# 'KONAARKA EXPRESS '

Kathala Samputi (1989-95)

*Author*

**Dr. VIPPARTHI PRANAVA MURTY, M.D.,**

Professor of Medicine, Andhra Medical College

Physician, K.G.Hospital

VISAKHAPATNAM - 530 002

First Impression **1995 Aug.**

| | |
|---|---|
| *Printed at* | **Ramsha-Siriesha Publications, Samalkot** |
| Copies | **1200** |
| Pages | xxiv + 106 |

*Paintings & Drawings*

**Dr. Vipparthi Pranavamurty**

*Published by*

**HIMABINDU ACADEMY**
**OF ART & LITERATURE**

12-1-21, Jawahar Street

KAKINADA - 533 001

*For Copies :*

**VISALANDHRA PUBLISHING HOUSE**

Vignana Bhavan, 4-1-435, Bank Street,

HYDERABAD - 500 001. Phone : 595671

*and its branches (Visalandhra Book House) at*

**KAKINADA, TIRUPATI, WARANGAL, VIJAYAWADA, VIZAG, ANANTAPUR, GUNTUR & HANAMAKONDA**

*Price:* **Rs. 50/-**

# పుంఖానుపుంఖం

(Contents)



డా॥ విప్పర్తి ప్రణవమూర్తి

ఈ కథలు రాసింది
1989-95 మధ్య

తొలుత ప్రచురించిన
పత్రికలు
ఆంధ్ర పచిత్ర వారపత్రిక
ఆంధ్రప్రభ, ఆంధ్రజ్యోతి,
విశాలాంధ్ర, గీతాంజలి,
తెలుగువిద్యార్థి, పల్లకి
రంగరాయవ్ పల్సు...

# ఎవరు? ఏమిటి? ఎక్కడ?

- అమ్మానాన్నా : శ్రీమతి వెంకట సీతారాజ్యం,
శ్రీ సూర్యనారాయణ రావు
- పుట్టింది : 01.02.1942
కస్బా పెంటపాడు (పశ్చిమ గోదావరి)
- చదివింది : 1. ఎం.బి.బి.యస్. (1965)
2. ఎం.డి. (జెనరల్) (1970)
ఆంధ్రా మెడికల్ కాలేజి, విశాఖలో
- చేస్తున్నది : ప్రభుత్వ వైద్యశాఖలో...
(ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంలో)
ప్రజలకు వైద్యం
- సాధిస్తున్నవి : బొమ్మలకు రంగువేయడం,
రంగుల బొమ్మలేయడం
నాణేలు ప్రోగుచేయడం
స్టాంపులు సేకరించడం
కథలు రాస్తూండటం
విజ్ఞానశాస్త్ర రచనలు చేస్తూండటం
- సాధించినవి : నూరు పెయింటింగులు వాటర్ కలర్సులో, ఆయిల్, లైన్, స్కెచ్ ధోరణుల్లో.
1957లో తొలిసారి గోల్డు మెడలు పెయింటింగుకి. అగణిత యోగ్యతా పత్రాలు.
అడవిబాపిరాజు స్మారక బహుమతి 1990
గ్రంధి అప్పారావు స్మారక పురస్కారం
అంకాల ఆర్టు అకాడమి సన్మానం
- స్థాపించింది : హిమబిందు అకాడమి ఆఫ్ ఆర్ట్స్ అండ్ లిటరేచర్ (1994 జూలై 16) కాకినాడ.
- జీవనం : సంసారయాత్ర శ్రీమతి డా॥శ్యామల తో
కుమార్తె డా॥హిమబిందు
కుమారులు రవీంద్ర, శ్రీనివాసరాజేష్
- అసలు చిరునామా: 12-1-21, జవహర్ వీధి, కాకినాడ-1
- కొసరు చిరునామా: 16-4-3, ఆఫీషియల్ కాలనీ, విశాఖ-2

# గ్రంథాంకితం



| | |
|---|---|
| స్వర్గీయ విప్పర్తి సూర్యనారాయణరావు<br>(మా నాన్నగారు) | స్వర్గీయ శ్రీమతి వెంకట సీతారాజ్యం<br>(మా అమ్మగారు) |

సదా మిము కోరి 'తల' దాల్చు
కొనే కృతార్థత కోసం
ఈ నా కథల 'కల' హోసం

- ప్రణవమూర్తి

# అంతరంగ కథనం

వృత్తిరీత్యా నేను వైద్యుణ్ణే అయినా, నా ప్రవృత్తులు కళాసాహిత్యాలు. అందుకే నేను నా తీరిక సమయాల్లో రంగులు దిద్దుతూ బొమ్మలేస్తూ ఉంటాను. కథలు కూడా రాస్తూ ఉంటాను.

కథలు రాస్తున్న దెప్పటినుంచైనా, నా తొలికథ మాత్రం 1989 లో ఆంధ్ర సచిత్ర వారపత్రికలోనే అచ్చయింది. తరవాత అనేక పత్రికల్లో వచ్చాయి. పీటినన్నింటినీ పుస్తకంగా వేస్తే బావుంటుందని సలహా యిచ్చిన సాహితీ మిత్రులు డా॥మిరియాల రామకృష్ణ వారి కూర్పులోనే నా తొలి పుస్తకాన్ని మీకందిస్తున్నాను.

ఈ పుస్తకాన్ని ఇంత సమ్మోహనంగా ముద్రించిన సన్నిహితులు డా॥పూషాగారికీ, ప్రచురణ కార్యక్రమం చేపట్టిన హిమబిందు అకాడమీ ఆఫ్ ఆర్ట్ & లిటరేచరు వారికీ నా కృతజ్ఞతలు. ఈ కథలు తమ తమ పత్రికల్లో ఎంతో ఆదరాభిమానాలతో ప్రచురించిన ఆంధ్రప్రభ, ఆంధ్రజ్యోతి, ఆంధ్రపత్రిక, పల్లకి, స్వాతి, గీతాంజలి, విశాలాంధ్ర, తెలుగువిద్యార్థి, రంగరాయన్‌పల్సు మొదలైన పత్రికల సంపాదకులకు నా అభివాదాలు. ఆయా కథలకు చక్కని బొమ్మలు వేసి హృదయరంజకం గావించిన చిత్రకారులకు నా అభినందనలు. ఇది నా మొదటిపుస్తకం కనుక కథల్ని ప్రచురణ కాలానుక్రమంగానే ప్రచురిస్తున్నానని మనవి.

ఈ పుస్తకంలో మధ్య మధ్య నేను చిత్రించిన కొన్ని వర్ణచిత్రాల మినీ రూపాలను కూడా చేర్చి మీకందిస్తున్నందుకు సంతోషంగా ఉంది. ముఖచిత్రంగా ప్రచురితమవుతున్న బొమ్మలు కూడా నా చిత్రశాలలోనివే.

ఈ గ్రంథానికి తమ అమూల్యాభిప్రాయాలనిచ్చిన సాహితీవేత్తలు డా॥ సోమసుందర్, శ్రీ పోలాప్రగడ సత్యనారాయణమూర్తి, డా॥ రెంటాల శ్రీవెంకటేశ్వరరావు, డా॥ మిరియాల రామకృష్ణ గారలకు నా కృతజ్ఞతాభివాదాలు. నా పుస్తకం చదివాకా, తమ అభిప్రాయాలందజేసే పాఠకులకు నా స్వాగతాంజలి.

భవదీయ

విశాఖపట్నం,
1.8.95.

డా॥ విప్పర్తి ప్రణవమూర్తి

# ఆమంత్రణం

మా డాక్టర్ ప్రణవమూర్తిగారు హృదయాధి నాథులు! అతిశయోక్తి కాదు; అసత్యమూ కాదు. విదారిత హృదయాలను చక్కగా రిపేర్ చేసి - పునశ్శక్తిని సంధానింపచేసి, ఆయుర్దాయం పోసి పంపేవారిని హృదయాధి నాథులనడంలో తప్పేముంది?

మనిషి గుండె గురించిన విజ్ఞానం గల ప్రతివారూ సజీవహృదయాల చైతన్యస్ఫూర్తి గురించి తెలియలేరు; దానికి గల లక్ష పోకిళ్ళనూ కనిపెట్టలేరు. అలాకాదని డబాయిస్తారా అది వెర్రిమాట. ఈ కనిపెట్టగలగడం - దాన్ని వివరించగలగడం - అది వేరే ప్రజ్ఞ! అదే సృజనాత్మక ప్రతిభ. దానికి కళాహృదయ సంసర్గం సైదోడు!

ఆబాల్యాదిగా ఉత్తమ సంస్కారం అలవడాలి. అలా అలవర్చుకున్న వారు కళాకారులు కావచ్చు! అదిన్నీ ప్రాథమిక సత్యమే! సార్వత్రికం కాదు. మనిషికి కావలసిన సంస్కారాన్ని అలవర్చే సూన్ృతులు మాత్రం తల్లితండ్రులే! తల్లి జన్మ నిస్తుంది. కనక ప్రథమ గణ్య! ఉత్తమ సంస్కారం అలవర్చే సకల బాధ్యతలూ స్వీకరించేది పితృపాదులే! కనక ఇరువురూ వందనీయులే! అలాంటి పవిత్రమాతా పితరులు లభించిన డా॥ ప్రణవమూర్తి గారూ, వారి సోదరులూ

పరమ అదృష్టశాలురు!

సహృదయులందరికీ సౌందర్య పిపాస ఉంటుంది. ప్రకృతిని, మానవ ప్రకృతిని సదా పరిశీలిస్తూనే ఉంటారు. అలా పరిశీలించగా హస్తవాసి కలసివస్తే చిత్రకారులవుతారు. వాక్శుద్ధి అనుగ్రహిస్తే రచయితలవుతారు. మన డాక్టర్ గారు ఉత్తమశ్రేణి సృజనాత్మక కళాకారులూ, రచయితలూ కూడా!

నేటికాలంలో కళాకారులనే మాట - చాలా పదాలకు మల్లేనే అపభ్రంశమై పోయింది. సైను బోర్డులు రాసేవాడే ఆర్టిస్టు! గోడల మీదా, తలుపుల మీదా రంగులు వేసేవాడూ పెయింటరే! గుమాస్తాలు రైటర్స్‌గా పిలువబడ్డంలేదూ? అందుకే వేమన్న గొంతెత్తి చెప్పనే చెప్పాడు - "పురుషులందు పుణ్య పురుషులు వేరురా?" అని.

సృజనాత్మక చిత్రకారుల తీరేవేరు! అందుకే మా డాక్టరు ప్రణవమూర్తి గత వత్సరం శ్రీ అడవి బాపిరాజు స్మారక చిత్రకళా అవార్డుని అందుకో గలిగారు. వారి చిత్రాలు రస హృదయులందరినీ ఆకర్షించాయి. నేనీ 'ఆముఖం' రాస్తున్న తేదీకి సరిగ్గా వత్సరం ముందు వీరి చిత్రకళా ప్రదర్శన 'హిమబిందు అకాడమీ'లో నా ప్రియమిత్రులు పద్మభూషణ్, జ్ఞానపీఠ్ అవార్డు గ్రహీత, డాక్టర్ సి. నారాయణ రెడ్డి ఆవిష్కరిస్తూ వీరి చిత్రాలలోని భావ సాంద్రతని అభినందించారు.

ప్రణవమూర్తి గారు పేరుకు తగ్గట్టుగా పవిత్రమూర్తి. వీరి తండ్రిగారిని నేను కళ్ళారా చూళ్ళేదు. కాని వారి గురించి చదివాను. నా మిత్రులు శ్రీ నిరీక్షణరావు గారు చెప్పగా విన్నాను. ఎంత ఉత్తమ సంస్కారులో తెలుసుకున్నాను. అలా కాకపోతే భావ్యర్థసూచనగా సంకేతిస్తూ ఇంత అపురూప నామధేయం ఇవ్వగలుగుతారా?

పేరుతో సరిపోయిందా? ఎంత ఉన్నత విద్య! ఎంత ఉత్తమ ప్రవర్తన! వీరి అన్నయ్యగారే శ్రీ కలికావతారంగారు. వారి గురించిన భోగట్టా చెప్పడం సూర్యుణ్ణి అద్దంలో చూపించడమే!

ఇంతవరకూ రాసినదంతా నిజానికి ఈ గ్రంథానికి ఆముఖమూ కాదు. ఆమంత్రణా కాదు. గ్రంథం అంటే వ్యక్తికి సంగ్రహ రూపమే! వెలుగునీ, దీపాన్నీ విడదీయటం అసాధ్యమైనట్లే గ్రంథాన్నీ, గ్రంథకర్తనీ విడదీసి మాట్లాడలేము; మంచిదీకాదు.

మా డాక్టర్ గారు మౌని. నిజంగా మితభాషి. ఆ మాట సరిపోదు. అందుకే మౌని అంటున్నది. కనుకనే వారు ఋషి కాగలిగారు. ఋషి అంటే కీర్తిశేషులు గోపాల చక్రవర్తి హాస్యం చేసినట్లు మూరెడు గడ్డం పెంచినవాడని

కాదు! ద్రష్ట అని మాత్రమే అర్థం! అంటే అదే వెర్రిగా లోకంలో కనిపించే ప్రతీదానినీ చూస్తూ కూర్చునేవాడనీ కాదు! ఒక తాత్విక దృక్కోణంతో మమకారంతో కూడిన ఒక అంతర్దర్శన కోసం వీక్షించ గలిగినవారనే అర్థం....

ఆ శక్తి మా డాక్టరుగారికి అక్షరాలా వుంది. ఈ కథలు చదివేవారికి తెలిసి తీరుతుంది. ఈ కథల గురించి చెప్పవలసిందెంతో వుంది. కథా రహస్యాలు వ్యాఖ్యానించవలసి ఉంది. అతి తక్కువ మాటలతో హ్రస్వలిపిలో కథలు చెప్పినవారు మనలో అతి తక్కువ. దిద్దుబాటును ఏ సుముహూర్తంలో మనకిచ్చాడో కాని ఆ మహాకవి బాటే డాక్టర్ గారిది.

"అల్లం మురబ్బా వెల ఒక వంకరనవ్వు" అనే కథలో కథానాయకుడు 'నాన్నగారూ' అనడానికి ఎబ్రివియేషన్‌గా (నాం) 'వాండీ' అని పిలుస్తాడు. అలాగే నాకు డాక్టర్ గారిని 'డాక్టారండీ' అని పిలవాలనిపిస్తూ ఉంటుంది.

ఆయన ఎన్నుకున్న కథావస్తువులన్నీ అచుంబితాలు. స్వయంగా దర్శించిన మానవ గ్లానినీ, జీవన పరిదేవనవనీ, హ్యూమన్ ట్రాజెడీని, కాపీనాన్నీ - సెంటిమెంటుపై విపరీతంగా బాది బాది కన్నీళ్ళు తెప్పించడం కాకుండా - ఆలోచింప చేయడం బాధ్యతగా స్వీకరించారు. గుండె గొంతుకలోకొచ్చి - ఉండచుట్టుకొని అటూపోక - ఇటూ రాక ఆగిపోయినట్లు చేయగల శిల్పి! అందుకే యీ కథల గురించి రసహృదయవ్యాఖ్యాత చాలా అవసరం. నేను సహృదయుడ్నే నన్న ఆత్మవిశ్వాసం నాకుంది. కాని ఆ పనిమాత్రం నేను చేయబోవడం లేదు!

ఏ కథ తీసుకున్నా - ఒక వైచిత్రి ద్యోతకమవుతుంది. విస్మాత్న జీవితాంశం ఆవిష్కృతమవుతుంది.

ముగిస్తూ ఒక్కనిజం చెప్పనా? మెడికల్ విద్య గురువు నేర్పారు. కార్డియాలజీ ప్రొఫెసరయ్యారు. కాని ఆయన చిత్రకళకు తానే గురువు, తానే శిష్యుడు. అలాగే కథారచన, సాహిత్యాభిజ్ఞతల గురించి కూడా తానే స్వయంగా కృషిసల్పారు!

అక్షరాలా డాక్టర్ ప్రణవమూర్తి చిరంజీవి. నా ప్రాణ సఖులైన చిరంజీవి. అందుకే గుండెల నిండుగా ఆశీర్వదిస్తాను. ఆయన అమోఘప్రజ్ఞను మనసారా అభినందిస్తాను.

రసహృదయులందరినీ విచ్చేయమనీ, శ్రద్ధగా ఈ కథలన్నీ చదవమనీ మనసారా ఆహ్వానిస్తున్నాను.

15-7-95, భవదీయ,

పిఠాపురం. డాక్టర్ సోమసుందర్ ఆవంత్స

# పుస్తక పరిచయం

ఇరవయ్యవ శతాబ్దం, సమకాలీన సాహిత్య ప్రక్రియ లన్నింటిలోనూ, కథానికకే పట్టం కట్టింది. ఒక్క తెలుగులోనే కాదు; ఏ భాషలో తీసికొన్నా కథానికకి ఉన్న ప్రాచుర్యం మరి దేనికీ లేదు. నవల, నాటికా, వ్యాసాదులన్నీ దాని తర్వాతే! జెట్ వేగంతో నడిచిపోతూన్న ఈ నవనాగరిక ప్రపంచంలో, తీరికగా కూర్చుని కావ్యాన్నో, నాటకాన్నో, నవలనో చదవడానికీ, చదివి, అందలి కావ్యానందాన్ని ఆస్వాదించడానికీ నేటి మానవునికి తీరిక లేదు. అదే ఆనందాన్ని, రెండు మూడు పేజీలు, లేదా నాలుగైదు పేజీల్లో కథానిక ఇస్తోంది. అంతేకాదు; కథానికా రచనలో ఎన్నో క్రొత్త క్రొత్త ప్రయోగాలూ, చిత్ర విచిత్రమైన రచనా పద్ధతులు వచ్చి, పఠితని ఆకట్టుకుంటున్నాయి. పైగా పత్రికల ప్రోత్సాహం కావలసినంత - వీటన్నింటికీ తోడు, మనిషికి చిన్నప్పటినుంచీ, 'అనగా అనగా ఓరాజు....' అంటూ సాగే కథా

శ్రవణ కుతూహలం ఉండనే ఉంది. తత్రాపి, నేటి రచనా ప్రక్రియల్లో కథకి ప్రోత్సాహ ప్రోద్బలాలు ఎక్కువగా లభించాయి; లభిస్తున్నాయి. ప్రసిద్ధులతో బాటు ఎందరో వర్ధిష్ణువులుకూడా కథా రచన పట్ల మొగ్గడం, ఎన్నో మంచి మంచి కథల్ని వ్రాయడం జరుగుతోంది.

ఈ మధ్య ఇలా కథ పట్ల ఆకర్షితులైన వారిలో డా॥ విప్పర్తి ప్రణవమూర్తి గారు ఒకరు. ఆయన వృత్తిచేత వైద్యులు. ప్రవృత్తిచేత కథకులు.

శ్రీ మూర్తి గారు అప్పుడప్పుడు వ్రాసి ఆంధ్రప్రభ, పల్లకి, తెలుగు విద్యార్థి, గీతాంజలి మున్నగు పత్రికల్లో ప్రచురించిన కథల్లో కొన్నింటిని ఏరి, ఈ కథల సంపుటిగా తెలుగు పాఠకులకి అందిస్తున్నారు. ఇందులో మొత్తం 19 కథలున్నాయి. వాటి రూపు రేఖా విలాసాలూ, వాటిలో రచయిత చూపించిన రచనా విన్యాసాలూ, అందు కనిపించే కళాత్మక విలువలూ, ఇవన్నీ వివరంగా కాకపోయినా స్థాలీపులాకంగానైనా పరామర్శించడం అవసరం. అయితే, అలా సమ్యగ్ దర్శనం కావించే ముందు, కథానికా ప్రక్రియ గురించి రెండు మాటలు.

కథా చక్రవర్తి శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి గారు అన్నట్లు, మంచి కథ రాయడం అనేది ఆషామాషీ వ్యవహారం కాదు. కథకుడికి లోకాలోకన సామర్థ్యం అపారంగా ఉండాలి. తను చూసిన, లేదా చూస్తూన్న ప్రపంచంలో ఏ సంఘటన, ఏ పాత్ర, ఏ విషయం, ఏ సంగతి, ఎంతవరకూ తన కథకి ఉపయోగిస్తుందో, ఏది స్వీకార్యమో, ఏది పరిహార్యమో ఏర్పరచుకొనే నేర్పరితనం ఉండాలి. స్వీకరించిన దాన్ని ఎలా చెప్పాలి, ఏ ధోరణిలో సాగించాలి, ఏ విధానం అనుసరించాలి అని నిశ్చయించుకొని, ఆ మార్గంలో సమర్థంగా వ్రాయగలిగే శకియుక్తులుండాలి. కథని ఎలా ప్రారంభించాలి, ఎలా నడపాలి, ఎలా ముగించాలి, అనే విషయాలు తెలిసి, ఆద్యంతమూ ఆకట్టుకొనే విధంగా కథని రాయగలిగే ప్రజ్ఞని అలవరచుకోవాలి. కథకి, ఒక ప్రయోజనం, పదికాలాల పాటు పఠితకి జ్ఞాపకం ఉండిపోయే ప్రాణశక్తీ ఉండాలి. కథలో వస్త్వైక్యత, సమగ్రత, సంక్షిప్తత పాటించాలి. ఇలా ఎన్నో గడుసు పోకడలని తనలో అందంగా మలచుకొని, తను రాసే భాషలో ఉండే జవాన్నీ జీవాన్నీ ఆకళింపు చేసుకుని, అందంగా మధురస నిష్యందంగా, సమగ్ర కావ్యకవితానంద బంధురంగా, కళాత్మకంగా అందించాలి కథని. ఇన్ని వ్యవహారాలున్నాయి కనకే, కథా రచనని కత్తిమీద సాము అన్నారు పెద్దలు. ఒకమాట ఎక్కువరాస్తే

స్వారస్యం చెడుతుంది. ఓమాట తగ్గిస్తే కళకట్టదు.

ఇలా క్లిష్టతర కష్టతమంగా ఉండే కథారచనకి పూనుకోవడం, ప్రణవమూర్తి గారి సాహసానికీ ఆత్మవిశ్వాసానికీ తార్కాణం.

ఈ సంపుటిలో కొన్ని మంచి కథలున్నాయి. ఇతివృత్తంలో వైవిధ్యం, కథనంలో నైపుణ్యం, వాతావరణ చిత్రణలో సహజత్వం, పాత్ర చిత్రణలో పరిశీలనా సామర్థ్యం కనిపిస్తాయి.

'అర్భకుడి ఆకుజోళ్ళు' కరుణ రసాత్మకంగా సాగిన ఒక నిరుపేద బాలుని కథ. గొంగళిపురుగుల జ్యోతిషం, దేముడిగదిలో దొంగ, ఈ రెండూ సమాజంలో సాగుతూన్న మోసాలపై రచయిత సంధానం చేసిన విమర్శ నాస్త్రాలు. బోంబేపర్సులో భోగం జ్ఞాపకం, లేబర్‌రూం ఆబసింగారం యువకులైన పాఠకుల్ని ఆకట్టుకొనే కథలు. నెం.152 వెయిటింగ్ లిస్ట్ ఇన్ కోణార్క్, వెండిమెరుపు రహస్యం కథలు, సమకాలీన జీవితాన్ని కళ్ళకి కట్టినట్లు చూపించే నిలువుటద్దాలు. ఇలాగే మిగిలిన కథలు కూడా మన చుట్టూ ఉన్న సమాజంలోని ఏదో ఒక భాగంమీద వెలుగు జిలుగుల్ని ప్రసరించేవే!

ప్రణవమూర్తిగారి కథలన్నింటిలోనూ ప్రసాద గుణం కనిపిస్తుంది. ప్రతీ కథా సాఫీగా సాగిపోయేదే! ఓ హెన్రీ మార్గంలో చివర్ని అనుకోని ఒక మలుపుతో పరిసమాప్తం అయి పాఠకుణ్ణి ఆశ్చర్యమగ్నుణ్ణి చేసేదే! చిత్తరువు గీసి చూపినట్లు పాత్రల స్వరూప స్వభావాల్ని అందంగా అందించేదే!

ఉదాహరణకి చూడండి- 'దేముడి గదిలో దొంగ' కథలో సూరన్న పంతులు అనే పాత్రని కథకుడు ప్రణవమూర్తి గారు ఇలా వర్ణించారు.

"ఎనభైయేళ్ళ సూరన్న పంతులు గారిది దబ్బపండు ఛాయ. తలమీద వెంట్రుకలన్నీ రాలిపోయి చలిమిడి ముద్దలా ఉంటుంది. కనుబొమ్మలు తెల్లబడిపోయినా, కళ్ళు తీక్షణంగా ఉంటాయి. ఈ వయస్సులో కూడా కళ్ళజోడు లేకుండానే పంచాంగం చదువగలరాయన. చెవులకు బరువైన కుండలాలు, చేతులకు గండపెండేరాలు, మెడలో రుద్రాక్షమాలలు, నీరు కావి పంచెతో, ఒంటినిండా విబూదిరేకలు, నుదుట కుంకుమ బొట్టుతో ఒక విధమైన తేజస్సుతో మెరిసిపోతూ ఉంటారాయన.."

వర్ణన ఎంత విస్పష్టంగా ఉందో చూడండి. మాట బొమ్మలంటే ఇవే -

శబ్దాలతో రూపాన్ని ప్రత్యక్షంగా చూస్తున్నట్లు చిత్రించడం, ఇందుకు రచయితకి ఎంతో ప్రజ్ఞ ఉండాలి.

కథలన్నీ చదివితే, విప్పర్తి వారికి కరుణ హాస్య రసాలంటే ఎక్కువ ఇష్టం అని తోస్తుంది. అర్భకుడి ఆకుజోళ్ళు కథలో చిత్రించిన కృష్ణపాత్ర దయనీయం అయింది. చివర్న 'మళ్ళీ రేపు రానాండీ! ఎవరైనా ఇస్తే ఉంచండి!' అనే, అతని మాటలు గుండెల్ని పిండుతాయి. తన ఆకు చెప్పులు ఇంకా దొరుకుతాయి అనే ఆశ పాపం ఇంకా అతనిలో చావలేదు. ఈ కథ ఎంత జాలి కలిగిస్తుందో 152 వెయిటింగ్ లిస్ట్ ఇన్ కోణార్క్ కథ పాఠకుడిలో అంత నవ్వు తెప్పించి, చివరికి ప్చ్- ఇలా ఉన్నాయి మన ప్రయాణంపాట్లు' అనే నిట్టూర్పు తెప్పిస్తుంది.

తన చుట్టూ ఉన్న సంఘాన్నీ, సంఘంలోని మనుష్యుల్నీ, వాళ్ళ మధ్య వచ్చే సంఘర్షణనీ, సునిశితంగా పరిశీలించారు; వాటినన్నింటినీ సున్నితంగా కథల్లో అందించారు విప్పర్తివారు. కథలన్నీ సాఫీగా సాగిపోయేవే - కడకంటా చదివించేవే!

అయితే, కథకి ఒక చిన్నమలుపు సాధించి, అయిపోయింది కథ అనడంతో సహజంగా పాఠకుడికి సంతృప్తి కలగదు. ప్రతి కథనీ మరి కాస్త నిలబెట్టి, పాఠకులలో ఆలోచనల్ని రేకెత్తించేదిగా రాసి ఉండవలసింది ప్రణవమూర్తి గారు. నూట ఆరు పేజీల్లో పందొమ్మిది కథలు పూర్తిచేశారంటే ఒక్కొక్క కథ నిడివి ఎంత ఉందో మనకి అర్థం అవుతుంది. అలా అని, కథా విజయం, కథ దైర్ఘ్యం మీద ఆధారపడుతుంది అని నేను అనను. "ప్రణవమూర్తి గారూ! మీరు అందించే మాధుర్యం గుండెకి తగిలేలోపుగానే కథ అయిపోతోంది. మమ్మల్ని మరింత రసాస్వాదన చెయ్యనివ్వండి. కథల్ని మరికొంచెం పెద్దవిగా రాయండి" అని అభ్యర్థించడమే నా ఉద్దేశం.

మొత్తంమీద కథలన్నీ ఆసక్తికరంగా సాగినవీ - పాఠకునిలో ఆలోచనలు రేకెత్తించేవీ - చదువరికి ఆనందం కలిగించేవీను. అన్నికథలూ ప్రణవమూర్తిగారి రచనా సామర్థ్యానికి మచ్చుతునకలే - ఆయన కలం నుంచి మరికొన్ని మంచి కథలు రావాలని ఆకాంక్షిస్తూ,

1-7-95
హైదరాబాదు

పోలాప్రగడ సత్యనారాయణమూర్తి

సంపాదకీయం

# కథా చిత్ర కళా లేఖనం

ఏ స్నేహం ఎలా మొదలవుతుందో తెలీదు. అభిరుచుల గుబాళింపుల నుంచి సన్నని తీగలు తీగలుగా పాటమరించుకొచ్చిన స్నేహం మాత్రం గుండెల్ని పట్టుకుంటుంది. దానికి దూరం అడ్డురాదు. కాలం పొలిమేరలు గియ్యదు. అది నిరంతరం కొనసాగుతూనే ఉంటుంది.

అప్పుడెప్పుడో ప్రాణం మీదికి మృత్యువొచ్చికూచుంటే హాస్పిటల్ బెడ్ దగ్గరికి పరుగెత్తుకుంటూ వచ్చి స్టెతస్కోపుతో నాగసర్పంలాంటి మృత్యువుని తీసి దూరంగా గిరవాటు వేసిన డాక్టరుగా ప్రణవమూర్తి నాకు దగ్గరయిపోయారు. అప్పట్నుంచీ ఈ పదిహేనేళ్లుగా నా గుండెమీద ఈగనికూడా వాలనీయడం లేదు ఆ మానవమూర్తి. ఆయన ద్వారా నేను చకచకా సాహిత్యద్వారాలు తీసుకుంటూ ముందుకు పోతున్నాను. చేతిలో కలం ఉంది కదా అని ఎవ్వడూ పరపరా రచనలు చేసి పారేయలేడు. ఆ చేతికి తతిమ్మా అవయవాలన్నింటితోనూ సంబంధముంటుందని మా అమ్మనాకు చెప్పిన గుర్తులేదు. డాక్టరు గారినించి మాత్రం నేను తొలిసారిగా నేర్చుకున్న పాఠం అదే! స్నేహాన్నీ ప్రేమనీ అభిమానాన్నీ చూపించడానికి వేరేవేరే మనుషులుంటారు. కానీ అన్నింటికీ మూలమైన మనసులోకి చొచ్చుకొచ్చి శుభ్రం చేసే మనుషులు మాత్రం ప్రతిజీవితంలోనూ ఒకరిద్దరు లేదా ముగ్గురునల్గురు ఇలా కొద్దిమందే ఉంటారు. అలాంటివారిలో నాకు ప్రణవమూర్తి గారొకరు.

ఇదంతా ఒక ఎత్తయితే, ప్రణవమూర్తి కథలురాస్తారని నేను తెలుసుకోవడం మరో ఎత్తు. నాకు కనిపించిన రెండో ప్రణవమూర్తి ఈయన. "మీ ఆరోగ్యం బాగానే ఉంది; దాన్ని గురించి మీరింక ఆలోచించే పని కూడా లేదు. ఇప్పుడు నా ఆరోగ్యం మీచేతుల్లో పెడుతున్నాను. ఇదిగో ఈ కాగితాలు చూసి నా కలంలో ఆరోగ్యముందో లేదో తేల్చి చెప్పండి" అంటూ ఒకరోజున కొన్ని కాగితాలు తెచ్చి నా చేతికిచ్చి మరి మాటాడకుండా వెళ్ళిపోయారు ప్రణవమూర్తి. సిగ్గో మొహమాటమో వినయమో వివేకమో ఏమిటో తెలియదు కానీ ఆ కాగితాల్లో ఏముందో విప్పిచూసేదాకానయినా ఆయన నిలబడినట్టు లేదు.

1989 మార్చి నెలనుకుంటాను. రెండోసారి 'గుండెనొప్పి' రావలసింది కాదు, కానీ పీడకళల రాంబందుల రాజ్యంలో డాక్టరుగారూ నేనూ దారితప్పిపోయాం. ఆయన కాకినాడలోనూ నేను తణుకులోనూ.... దూరం ఎక్కువయిపోయింది. ఆ దూరాన్ని తగ్గించుకునే ప్రయత్నంలో పరుగులు తీస్తూ ఉంటే అలిసిపోయి పడిపోయాను. "అబ్బే ఇది కేవలం అలసటే తప్ప మరేమీ ప్రమాదం లేదు. మీ అలసట తీరేదాకా బెడ్డుమీదుండండి, నేనున్నానుగా. ఇదిగో నా కాగితాలు చూసి ఆరోగ్యం నిర్ణయించరూ?" అంటూ నాకే ఎదురు 'చెకప్పు'ని అప్పగించారు డాక్టరైన ప్రణవమూర్తి. అదిగో ఆ విధంగా ఒక డాక్టరుకి పేషెంటే డాక్టరు కావాల్సిన సందర్భం వచ్చింది. ఇది కేవలం ఆయన కల్పించుకున్న సందర్భమే. (పేషెంటూ డాక్టరూ అంటే జ్ఞాపకమొస్తోంది. నేను డాక్టరేటు చేసిన కొత్తలో నేనెవరిమీదయితే డాక్టరేటు చేశానో ఆయనకి డాక్టరేటు లేకపోతే, అలా లేకపోయినందుకేమీ కుళ్లు పడకుండా స్వచ్ఛంగా 'డియర్ డాక్టర్' అని సంబోధించి 'యువర్స్ పేషెంట్లీ' అని ముగిస్తూ తన ఆనందాన్ని 'పన్ను' తో సహా కట్టేసిన ఒక మహాకవి మనస్సుని శంకిస్తూ నిస్సహానంతో బాధపడే ఒక విమర్శక మహాశయుడు తన బాధని బైట నలుగురిలోనూ కక్కేసి ఆరేశాడు. ఎవరు డాక్టరు? ఎవరు పేషెంటు? ఏది సత్యం? ఏదసత్యం? అన్నట్లుగా ఉంటుందంతా. పేషెన్సు ఉన్నవాడే ఒక అర్థంలో పేషెంటుగా వ్యవహరింపబడతాడన్న పరమార్థం తెలియనివాళ్లు కూడా విమర్శకులవుతున్న కాలం డాక్టరుగారినీ నన్నూ వెక్కిరిస్తే నష్టమేమీ మాకు లేదు.)

డాక్టర్ ప్రణవమూర్తి స్టోరీరైటర్ ప్రణవమూర్తిగా మారుతూ "డియర్ డాక్టర్....యువర్స్ పేషెంట్లీ" అన్నట్లుగా ముఖంపెట్టి, నెమ్మదిగా జారుకున్నారావేళ. తీరా కాగితాలు విప్పి చూద్దును గదా, జీవితాన్ని జీవితంతో గుణించి, భాగించి, హెచ్చవేసి, తీసివేసి, బోలెడంత పనిచేసి సింపుల్‌గా సారాంశాల్ని కథలుగా రాసి పెట్టిన కాగితాలవి.

"Reading maketh a full man, conference
a ready man, and writing an exact man"

ఫ్రేన్సిస్ బేకన్ నా బుర్రలో ఘోషిస్తున్నాడప్పుడు. బేకన్ను మంచి సత్యానికే కన్నుకొట్టాడు కానీ అది సామాన్య సత్యం కాదు. ముందు చదవాలి, తరవాత నలుగురితోనూ మాటాడాలి; మూడో అడుగు రచించాలి. ఇప్పుడీ మూడడుగులూ వేయగల పేషెన్సు చాలామందిలో లేదు. ఏకాఏకి రచనలు రాసి పారేస్తారు. అలా రాసి పారేసిన రచనల్లా లేవు ప్రణవమూర్తి గారి కథలు.

"To have striven, to have made an effort,

to have been true to certain ideals -
this alone is worth the struggle. We are
here to add what we can to, not to
get what we can from, life" **(Sir William Osler)**

జీవితంలో ఎన్ని సుఖభోగాల్ని పులుముకుందామా అని వెర్రిమొర్రిపనులు చేసేవారే తండోపతండాలుగా పెరిగిపోతున్న ఈ రోజుల్లో "నేను సైతం ప్రపంచాగ్నికి సమిధ నొక్కటి ఆహుతిచ్చాను" అనే తత్వం ఎంతమందిలో ఆచరణ పూర్వకంగా కనిపిస్తుందో ఆలోచించి, పరిశీలించి "హమ్మయ్య కొన్ని ఆదర్శాల కోసం ప్రయత్నించి, పోరాటం చేస్తున్న వారు కొందరున్నారులే" అనిపించినపుడు ప్రపంచంలో కొన్నిచోట్లయినా ఆనందం వెల్లివిరుస్తూ ఉంటుంది. ఈ విషయాన్నే సర్ విలియం ఓస్లర్ ప్రస్తావించాడు. ప్రణవమూర్తి గారి కథలు చదువుతూ పోతే, మనసులో ఇలాంటి కదలిక ఒకటి గోచరించింది.

మన సాహిత్యంలోకి నవలా కథా ఒకేసారి ప్రవేశించాయి. తతిమ్మా భాషల సంగతెలా ఉన్నా యూరోపులో నవలే మొదట విశ్వరూపంతో విజృంభించి, అన్నిరకాల మనుముల్లోనూ ఏమాత్రం చదువొచ్చినా సరే, వాళ్ళని అయస్కాంతంలా దగ్గరకు లాక్కుంది. ఆ రోజులు మారిపోయినప్పుడు నవలా సాహిత్యం వెనక్కు కాస్తకాస్త తగ్గుతూ కథాసాహిత్యాన్ని ముందుకి తోసింది.

In these days of haste there is a manifest
tendency to cut down the novel into
the briefest possible form, and supplant
it by the short story **(Winchester)**

నవల గురించి బోలెడంత చర్చచేస్తూ చేస్తూ వించెస్టరు దొరగారు ఆ ఛాప్టరు చివర్లో రాసిన వాక్యం ఇది. ఆయన ఆనాడు (ఈ శతాబ్ది మొదటి దశకంలో) రాసిన ఈ వాక్యంలోని తాత్పర్యం ఈనాడు మనకిక్కడ వర్తిస్తుంది. ఇటీవల నవల వెనకబడి కథ ముందుకొస్తున్న అత్యవసర పరిస్థితిని మనం కళ్లారా చూస్తున్నాం. కథలకోసం కొన్ని పత్రికలూ కొన్ని సదస్సులూ కొన్ని సంస్థలూ గత రెండేళ్లుగా విజృంభించినంత తీవ్రస్థాయిలో అంతకుముందు కనిపించలేదు. రోజులొక్కటే మారలేదు. అభిరుచులూ అవసరాలూ అవగాహనలూ అభిప్రాయాలూ కూడా మారాయి. పరిస్థితులు మారాయి. ధోరణులు మారాయి. మార్గాలు మారాయి. ఇన్నిరకాల మార్పులకు అనుగుణంగా అనురూపంగా వస్తున్న సాహిత్యరూపమే కథానిక.

The short story has a manner and structure
of its own. It renders an incident, a

single phase of experience, an unique type of character. **(Winchester)**

కథానిక గురించి ఇంతకన్నా 'గోల్డెన్ వర్డ్సు' ఎవరూ చెప్పగలరని నేననుకోలేకపోతున్నాను. మనుషులంతా ఒకటేగానీ ముఖాలు వేరువేరుగా ఉంటాయి. కథానిక నిర్మాణంలో కూడా ఒక్కో కథకుడు ఒక్కో రూపాన్ని సృష్టిస్తాడు. రచయితకు ఆ స్వేచ్ఛ ఉంటుంది. కథారూపాన్ని ఎటువంటి పదార్థంతో ఎటువంటి వస్తువుతో తయారుచేసుకోవాలన్న విషయంలో గీటురాయి మాత్రం జీవితమూ జీవనవాస్తవమూ అని చెప్పక తప్పదు. ఆకాశమంత విశాలమైన మానవజీవితంలో లెక్కపెట్టలేనన్ని అంశాలు నక్షత్రాలు. కథకు ఒక సంఘటన కావాలి. ఒక అనుభవం కావాలి. ఒక పాత్ర కావాలి. ఈ మూడింటిల్లో ఏ ఒకటయినా ఉంటే చాలు. అయితే మనం జీవిస్తున్న కాలంలోంచే వీటిని ఎంచుకుని, ఏరుకుని, గుచ్చుకుని ఆ చట్రంలోకి తీసుకు రాగలగాలి. మనం నివసిస్తున్న కాలంలో దేశంలో భాషలో పలుకుబడిలో పొంచి కూచున్న వస్తువే కథానిక రూపం తొడుక్కుని వచ్చినపుడు చదవని వారెవరూ ఉండరు.

నామట్టుకు నేను ఎన్నో కథలు చదవాలని మొదలెట్టి మొదటి రెండు మూడు పేరాలు మాత్రమే చదివి ఆగిపోయిన సందర్భాలు కోకొల్లలుగా ఉన్నాయి. చాలా కొద్దిమంది మాత్రమే కథతో పాటు నన్ను ముందుకు లాక్కుపోయి, తమ కథయొక్క ఆఖరి బిందువుమీద నాట్యం చేయించగలిగారు. అలాంటి కథకుల కోసం మనం సాధారణంగా వెదుక్కుంటూ ఉంటాం.

నాకు చాలా ఆశ్చర్యంగా ఉంటుంది శ్రీశ్రీగారు తన గురుత్రయంలో మపాసా లాంటి కథా రచయిత నొకడ్నిగా చేర్చుకుని ఆరాధించడం. మనచేత తనరాతల్ని ఎన్నిసార్లయినా చదివించుకోగల శ్రీశ్రీకూడా ఒక కథారచయిత నుంచి ఏం నేర్చుకున్నాడబ్బా? అని ఆలోచించి మపాసా నాలోకిస్తే నిజం తేలింది. రీ-రీడబిలిటీ మపాసా కథల్లో గోచరించింది. అలాంటిదే గురజాడవారి కథల్లోనూ కనిపించింది.

ఇటీవల నేను గీతాంజలి పక్షపత్రికకు సారథ్యం వహిస్తున్న రీత్యా నా దగ్గరికి పరిశీలనార్థం ఎన్నో కథలొచ్చి పడుతున్నాయి. ఎబ్బెట్టుగా లేకుండా సాఫీగా చదివించగల వారి కథల్ని అచ్చుకివ్వడం కన్నా సంపాదకుడేమీ చెయ్యలేడు. వాటిమీద తీర్పుని పాఠకులే అనుగ్రహిస్తారు. కాకపోతే, తప్పటడుగులు వేస్తున్న వర్ధిష్ణు కథా రచయితలకు మాత్రం 'మీరు చాసో కథలూ తిలక్ కథలూ చదివారా? మరోమారు చదవండి ప్లీజ్' అని సలహా యిస్తున్నాను.

నేను తెలుగు అకాడమీలో పనిచేసే కాలంలో (1970-73) ప్రసిద్ధ కథా రచయితలు తాళ్లూరి నాగేశ్వరరావు, మంజుశ్రీ, పోరంకి దక్షిణామూర్తి గార్లతో ఎక్కువగా 'మూవ్' అవుతూ ఉండేవాణ్ని. పదేపదే వాళ్లు సోమర్సెట్ మామ్ గురించి (ఓ హెన్రీ గురించి కూడా) ప్రస్తావిస్తూ ఉండేవారు. ఇది రమారమి ఇరవైఅయిదేళ్ల క్రితం సంగతి. 'మామ్' అప్పటికి నాలుగేళ్లముందే చనిపోయాడు. అప్పటికి నాకు కథల గురించి ఎక్కువ ఆసక్తి ఉండేది కాదు. నిజం చెప్పొద్దూ? నా దృష్టిలో కవిత్వమే గొప్పది. కారణం మరేమీ లేదు; కవిత్వం గురించి గ్లామరు పెరిగిపోతున్న రోజులవి. కానీ మంచి కవిత్వం రాసిన బాలగంగాధర తిలక్ నాకు తన 'నల్లజర్లరోడ్డు' కథ (1964) ద్వారానే పరిచయమయ్యారు. కవులు కథలు కూడా రాస్తే బావుంటుందన్న భావం నాకు పుట్టుకొచ్చిందప్పుడే. కథకులు కవిత్వం రాయలేరని నాకర్థమయిపోయింది కూడా అప్పుడే. మామ్ గురించి నాకు చెప్పిన పైన పేర్కొన్న కథకులెప్పుడూ కవిత్వం జోలికి వచ్చిన దాఖలాలు కనిపించలేదు. కానీ కవిత్వంపట్ల వారికి కూడా మంచి మర్యాద ఉండేది. తిలక్‌లాగే నన్నాకర్షించిన మరోకవి సోమసుందర్. బానిసల దేశం కథలు (ప్రచురణ 1950) చదువుతూంటే ఆ రోజుల్లో కవిత్వానికీ కథకీ ఎంత దగ్గరగా అల్లుకుపోగల గుణముందో అర్థమయింది.

సోమర్సెట్ మామ్ గురించి చెబుదామనుకుంటూ తప్పనిసరిగా దారిమళ్లినట్లు గుర్తుంది. కథకులందరూ కథల తత్త్వం గురించి చెబుతారన్న నమ్మకం వమ్మయిపోయిన దశలో మామ్ రాసిన 'ది షార్టు స్టోరీ' అన్న వ్యాసం నాకు ఎదురుపడి ఊరుకోపెట్టింది. అతను కూడా ఆ వ్యాసంలో అమెరికన్ మహాకవి, కథా నిపుణుడు అయిన ఎడ్గార్ అల్లన్ పో మాటల్ని ఉటంకించాడు.

> ... a good short story is a piece of
> fiction, dealing with a single incident,
> material or spiritual, that can be
> read at a sitting; it is original,
> it must sparkle, excite or impress;
> and it must have unity of effect or impression.

కథాకథనంలో శాఖాచంక్రమణాలూ అష్టావధానాలూ కుదరవు. 'సింగిల్ ఇన్సిడెంటు' అన్న నిర్దేశం కథకు - అందులోనూ ఆధునిక కథకు - మూలసూత్రం. ఎపిక్‌లో లాగా ఉపాఖ్యానాలు దూరిస్తే కథలో విసుగొస్తుంది. కథకి సశేషాలు బావుండవు. కథ 'ఒరిజనలు' గా ఉండాలంటే జీవితాన్ని 'ఒరిజినలు' గా చూసి కథని పట్టుకోవాలి. అంటే కథావస్తువు సమకాలం అనే గొడౌనులోనే

దొరుకుతుంది కానీ గతకాలం అనే మ్యూజియంలో ఉండదు. యూనిటీ ఆఫ్ ఎఫెక్టు ఆర్ ఇంప్రెషన్ అన్నమాటని పాఠకలోకానికి అనువర్తింప జెయ్యాలి. ఆదిమధ్యాంతాల మధ్య సమన్వయమున్నప్పుడే పాఠకుడికి మంచికథ చదివానన్న తృప్తి కల్గుతుంది.

మామ్‌నే గొప్పకథకుడని ఆ రోజుల్లో మామిత్రులంటే, ఆ మామ్ రడ్‌యార్డ్ కిప్లింగ్‌ని గొప్పకథకుడని ఈ వ్యాసంలో స్పష్టం చేశాడు. అసలు షార్టు స్టోరీస్‌కి మాస్టర్స్ ఫ్రెంచిలోనూ రష్యన్‌లోనూ ఉన్నారని అభిప్రాయపడ్డాడు మామ్. కానీ,

"People grow tired of good things. They want change."

కనుక కథకులెన్నో ప్రయోగాలు చెయ్యకతప్పదు. ఈ ప్రయోగాలన్నీ ఫలిస్తాయనేమీ చెప్పలేం. ఇందులో పాతవిలువలను పారేసుకోడం కూడా జరుగుతూ ఉంటుంది. కానీ మళ్లీ మార్పు కోసం వెదుక్కోవడంలో పాతవిలువలే మెరుస్తూ కనిపిస్తాయి. అందుకే కాబోలు ఇటీవల మన తెలుగు పత్రికల్లో పాత కథలన్నీ రిపబ్లిష్ చేయడం జరుగుతోంది. అంతేకాకుండా తెలుగుకథని ముందడుగు వేయిద్దామనే దృష్టితో 1994 లో వచ్చిన కొత్తకథలన్నింటినీ సమీక్షిస్తూ వేదగిరి రాంబాబుగారి సారథ్యంలో ఒక పుస్తకం వచ్చింది.

కథాసాహిత్యం ఇలాంటి దశలో ఉండగా ప్రణవమూర్తిగారి కథలు ఒక సంపుటిగా అచ్చవుతున్నాయి. ప్రణవమూర్తి, వారి కుటుంబం అంతా కొన్ని కళాభిరుచుల సంగమస్థానం. ఆయన డాక్టరు; సతీమణి శ్యామలాదేవి డాక్టరు; తనూజాత హిమబిందు డాక్టరు,. ఆయన బొమ్మలు రంగులతో వేస్తారు, కథలు రాస్తారు. నాణాలూ స్టాంపులూ పోగుజేస్తారు. ఒక నిమిషం కూడా ఊరికే గడిపివేయడం వారింట్లో ఎవ్వరికీ ఇష్టముండదు. పేషెంట్ల కథలెన్నో వారి మనసులో ఉన్నాయి. జీవితానుభవాలెన్నో వారికి తారసపడ్డాయి. కర్మయోగం ద్వారానే జ్ఞానసంయోగం సిద్ధిస్తుందని నమ్మిన విప్రర్షి వారు ఆయనకి 'ప్రణవమూర్తి' అని నామకరణం చేయడం యాదృచ్ఛికం కాదు.

ఈ 'ప్రణవం'లో నవత్వం ఉంది. మానవత్వం ఉంది. కవిత్వం కూడా ఉంది కానీ అది రెండు రూపాంతరాలు చెందింది. మొదటిరూపం వర్ణచిత్ర లేఖనం. రెండోరూపం కథాచిత్ర లేఖనం. ఈ కథా చిత్రాల గురించి స్పందించ వలసింది సహృదయులైన పాఠకులు. అయితే ఇవి మొహం మొత్తవని మాత్రం నేను ఖచ్చితంగా చెప్పగలను.

కాకినాడ<br>1 జూన్ 95

- డాక్టర్ మిరియాల రామకృష్ణ

1

# అర్భకుడి ఆకుజోళ్లు

తామరాడ గ్రామం నుండి యేవూరు వెళ్ళాలన్నా మూడు కిలోమీటర్ల దూరంలో వున్న రాజానగరం వచ్చి బస్సు ఎక్కాల్సిందే! మరో దారి లేదు. అక్కడికి కాకినాడ నుండి వచ్చే బస్సు మిట్ట మధ్యాహ్నం 12 గంటలకి వస్తుంది.

పదిహేను రోజుల నుండి రోజూ కృష్ణ తామరాడ నుండి వస్తూనే ఉన్నాడు.

మండుటెండలో రాసుకొన్న తలనూనె, చెమట కలిసి ముఖమంతా కారుతోంది. ముఖం కందగడ్డలా ఎరుపెక్కి పోయింది. కాలికి చెప్పులు లేవు. లూజు చొక్కా ....జారుతున్న లాగుని వకచేత్తో పట్టుకొని నిలబడ్డాడు.

కాకినాడ నుండి బస్సు సరిగా టైమ్‌కే వచ్చింది. దిగుతున్నవారు దిగుతుండగా.. ఎక్కుతున్నవారు తోసుకొని పోతున్నారు బండిలోకి.

కృష్ణ దీనంగా "కండక్టరుగారూ నా చెప్పులు దొరికాయాండీ? అంతా తోలుతోనే చేశారండీ! తెల్లగా వుంటాయండి! పైన ఎర్ర పువ్వుంటుందండీ!

ఎవరైనా దొరికితే యిచ్చారాండీ!

మళ్ళీ రేపు రానాండీ?" ఆ రోజూ యిలాగే అడిగాడు.

"లేదు బాబు" విసుగుదలతోనైనా జాలిగానే జవాబు చెప్పాడు కండక్టరు. ఆ రోజు కూడా, దుమ్ము రేపుకుంటూ బస్సు కదిలి పోయింది.

★ ★ ★

పన్నెండు సంవత్సరాల కృష్ణ మనసులో గ్రద్ధని పెంచాలనే వాంఛ పెరిగి పోయింది. పోయిన నెల చుట్టాలిచ్చిన పది పైసలతో షరీఫ్ కిళ్ళీ కొట్లో

సీసాలో వున్న లస్‌గోరా వుండని కొనుక్కొని, నెమ్మదిగా కొంచెం కొంచెం ఎక్కడ అయిపోతుందో అనుకుంటూ తింటూ వీధిలో వస్తూ వుంటే, చేతిలో వున్న వుండని గ్రద్ద గబుక్కున ఎత్తుకుపోయింది.

ఏమిటి జరిగిందా అని తెలుసుకొని తేరుకొనేందుకు కొంచెం సేపయింది.

గబగబా తినేసినా బాగుండును! ఉండలో చాలా భాగం అలాగే గ్రద్ద తన్నుకుపోయింది. గ్రద్ద గోళ్ళు చేతిని గీరేసాయి కూడా. రక్తం కూడా వస్తూంది. వేళ్ళను నోటిలో పెట్టుకొని రక్తాన్ని అదిమేసాడు.

బాగా ఏడుపొచ్చింది కృష్ణకి గ్రద్ద గీచినందుకు గాదు నోటి దగ్గర మూడొంతులు మిఠాయి వుండను లాక్కుపోయినందుకు. గ్రద్ద మీద కసి బాగా పెరిగిపోయింది.

పది రోజులయాక మళ్ళీ చుట్టాలొచ్చారు. కృష్ణకి అపరిమితమైన ఆనందమైంది.

వాళ్ళు మిఠాయి తెచ్చారు. దాన్ని ఇద్దరు అక్కలకి, ముగ్గురు తమ్ముళ్ళకి, వక చెల్లికి పంచేసరికి తన భాగం పంటి కిందికే రాలేదు.

కృష్ణ వాళ్ళ నాన్నగారు అర్ధాంతరంగా చనిపోయారు. గంపెడు సంసారాన్ని చూసేందుకు ఆసరా వాళ్ళకున్న 40-50 బాతులు, వాటి గుడ్లను, బాతుల్ని అమ్మి, వాళ్ళమ్మ దానితో సంసారాన్ని గుట్టుగా ఈదుతూంది.

అమ్మ వక బాతు కూర వండింది. దాన్ని ముందు చుట్టాలకే పెడుతుంది. పిల్లల వరకు వచ్చేసరికి దుమ్ములు సేరువాయే మిగిలింది. ఆ రుచికరమైన భోజనం అయినా మరి చుట్టాలొస్తేనే కదా!

పండగలకి మాత్రం బాతుగుడ్ల కూర వండేది. అరగదని సగం గుడ్డే వేసేది పిల్లలకి. ఎపుడో గాని పూర్తి గుడ్డు ఛాన్సు దొరికేది కాదు. తమ్ముళ్ళతో అక్క చెల్లెళ్ళతో కృష్ణకి తగాదా వచ్చేది. కృష్ణ ఎంత ముందుగా 'ఆ పెద్ద గుడ్డు నా'దన్నా తమ్ముడు ప్రకాష్‌గాడు 'నేను ముందు చెప్పుకొన్నాను. అది నాది' అని గొడవ పెట్టేవాడు. వాళ్ళమ్మ అందర్నీ బాది తగువు తీర్చేదనుకోండి.

ప్రక్క సందులో దుంపల బడికి చాలావరకు ఎగ్గొట్టకుండానే వెళ్ళేవాడు కృష్ణ. వాడికి నచ్చిన పాఠం చరిత్ర. మేష్టారు చెప్పేవారు ఎన్నెన్నో కథలు, బరోడా సంస్థానాధీశులు డేగల్ని ఎలా పెంచేవారు, ఎలా తర్ఫీదు యిచ్చేవారు, శత్రువుల మీదకు పంపి వాళ్ళ కళ్ళు వాళ్ళు పీకి తిరిగొచ్చి చేతి మీద ఎలా

నిలుచునేవి అనే కథ ఆ రోజు చెప్పేసరికి ఎలాగైనా గ్రద్దల్ని పట్టేయాలి, మచ్చిక చేసుకోవాలి అనే పట్టుదల పెరిగిపోయింది. దాన్ని సుబ్బారావు గాడి మీదకు పంపాలి. వాడి కళ్ళు పీకించేయాలి. వాడు గోళీకాయల ఆట దగ్గర మోసం చేసాడు.

చుట్టాలు మళ్ళీ చిల్లర డబ్బులు యిచ్చారు. మిఠాయి కొని ఆలా చేతిలో పెట్టుకొని వెళుతూ వుంటే ఆకాశంలో వున్న గ్రద్ద ఒక ఉదుటున చేతిలో వున్న ఉండను తన్నుకు పోతున్నపుడు గబుక్కున దాన్ని పట్టేయాలి.

మరో ఆలోచన, మిఠాయి వుండను ఎరగా గ్రద్దకు పెడితే కొంపదీసి మొన్నటిలా అది తన్నుకు పోతే? అందుకు ఖాళీ సిగరెట్టు పెట్టెల్లోని తగరాల్ని కొన్నిటిని పోగుచేశాడు. నిమ్మకాయంత వుండచేసి అరచేతిలో పెట్టుకొని ఆకాశం వేపు చూపుతూ, తళ తళ మెరిసే ఆ వుండని పట్టుకు పోవడానికి ఏ గ్రద్ద వస్తుందో అని ఆకాశం వైపు చూసుకుంటూ మిట్ట మధ్యాహ్నం ఎండలో బైలుదేరాడు కృష్ణ

గ్రద్ద రాలేదు గానీ,

ఎదురుగా వస్తున్న సైకిల్ని పైకే చూస్తున్న కృష్ణ గుద్దేశాడు. కంకర రోడ్డు మీద బోర్లా పడ్డాడు. రెండు మోకాళ్ళూ శుభ్రంగా కొట్టుకు పోయాయి. కుడికాలి లోకి సైకిల్ వూస గుచ్చుకు పోయింది. కృష్ణ ఏడుపు మొదలెట్టాడు. సైకిల్ అతను కృష్ణను లేపి కాలిలో వూచను తీసి చుట్టూ ఎవరూ లేకపోవటం చూసి' 'కళ్ళు నెత్తి కెక్కాయా' అని కృష్ణని తిట్టి, సైకిలు వూచ వూడినందుకు తిట్టుకుంటూ చక్కా పోయాడు.

మోకాళ్ళ దెబ్బలకి రోడ్డు మీది మట్టి అదిమాడు. భయం భయంగానే యింటికి వచ్చాడు. అనుకున్నట్టే అమ్మ కొరకంచుతో బడితె పూజ చేసింది, చొక్కా లాగు జేబుల్ని తడిమి దాచుకున్న రంగు రంగు రాళ్ళని, గోళీలని, నట్టులని, బోల్టులని అన్నిటిని తీసి బైట పడేసింది.

'వెదవకానా, బజారులో చెత్తంతా, మేక గొడ్డెలన్నీ నీ జేబుల్లోకే, బట్టల్ని నాశనం చేస్తావు.' గట్టిగా తిట్టింది.

రెండు రోజుల్లో దెబ్బలన్నీ బాగా మోపు చేశాయి కృష్ణకి.

ఆసుపత్రికి పోయి మాత్రలు, గ్రీజులాంటి మలాము రోజూ తెచ్చుకొనే వాడు. రోజూ వెళ్ళలేక ఒక పని చేసేవాడు.

కాంపౌండరుకి కిటికీలో నుంచి చీటీని చూపిస్తే కాగితంలో మడిచి కొంచెం మలామునిచ్చేవాడు. నలుగురైదుగురు పేషంట్లను పోనిచ్చి మళ్ళీ లైనులో చేర్చి చీటీని చూపించేవాడు. పరాకుగా వున్న కాంపౌండరు మళ్ళీ కాగితంలో మడిచి మందిచ్చేవాడు. కాని అప్పుడప్పుడూ కనిపెట్టి ఇతను అతను ఒకే కుర్రాడా అని అరిచేవాడు. చీటీని లాక్కుని వినిపించుకోకుండా పరుగెత్తుకొచ్చేసేవాడు కృష్ణ.

కాళ్ల పుండు మానేందుకు రెండు నెలలు పైగా పట్టింది. అరికాలిలో పుండు మాత్రం మానినట్లు కనుపించినా నడిచేటప్పుడు బాగా నొప్పి పెట్టేది.

అమ్మ వీడి బాధను చూసే గాబోలు కాకినాడ వెళ్ళినపుడు దయాల్బాగు స్టోరులో ఆకుజోళ్ళు కొని 'వేసుకోరా వీటిని' అని అప్యాయంగా కృష్ణ కిచ్చింది.

కృష్ణ ఆనందానికి అవధులు లేవు. తన తోబుట్టువుల కెవ్వరికి కాకుండా తనకే చెప్పులుకొన్నది వాళ్ళమ్మ. గర్వంగా వుంది. ఎంతో మురిసి పోయేవాడు. వీలైనంత వరకు వాటిని చంకలోనే పెట్టుకొని తిరుగుతున్నాడు.

★ ★ ★

ఆరోజు కాకినాడ ఫలపుష్ప ప్రదర్శనానికి తీసుకొని వెళ్ళారు కృష్ణ మాష్టారు. పిల్లలందరికి సగం టిక్కెట్లే! కృష్ణ ఆకుజోళ్ళేసుకుని దర్జాగా బయలుదేరాడు. ఉదయం కలబడి తిరిగేశారు పిల్లలంతా.

పూలు, పళ్ళు, ధాన్యాలు, పురుగుల మందులు...' కోసి పెట్టిన శవాన్ని మాత్రం చూసే ధైర్యం వాళ్ళెవరికీ రాలేదు. ఎన్నిటినో అలా చూస్తూ తిరిగారు. తామరాకు అంత అప్పడాన్ని కొనుక్కుని తిన్నాడు కృష్ణ. అయిస్‌క్రీమ్‌ని మాత్రం తింటున్న వాళ్ళనలా చూసాడంతే, కొనుక్కునేందుకు జేబులో డబ్బులు లేవు. రంగులరాట్నం పెద్ద చక్రం దగ్గర కూడా కళ్ళు తిరుగుతాయని.. డబ్బులు లేవని.. ఎక్కకుండా ఎక్కేవాళ్ళని అలా చూసాడు కృష్ణ.

పదకొండు గంటలకల్లా నీరసపడి పోయారు పిల్లలంతా. తిరుగు ప్రయాణానికి బస్సెక్కారు. మాష్టారి అజమాయిషీలో రాజానగరం చేరేసరికి సరిగ్గా పన్నెండు గంటలైంది. బాగా ఆకలేస్తోంది. పిల్లలంతా తోసుకొంటూ బస్సు దిగిపోయారు. కృష్ణ కూడా దిగాడు. బస్సు కదిలి దుమ్ము రేపుకొంటూ వెళ్ళి పోయింది.

సీటు క్రింద దాచుకొన్న కృష్ణ ఆకుజోళ్ళు బస్సులోనే ఉండిపోయాయి.

"నా ఆకు జోళ్ళు... నా ఆకు జోళ్ళు" కృష్ణ అరుపులుఎవరూ వినిపించు

కోనేలేదు... బస్సు వెళ్ళి పోయింది.

కృష్ణ చాలాసేపు అలా నిలబడి చూస్తూ వుండిపోయాడు.

ఏడుస్తూ యింటికి వెళ్ళాడు.

మర్నాడు సరిగ్గా పన్నెండు గంటలకి బస్సాగే చోటికి వచ్చాడు.

బస్సాగగానే "కండక్టరుగారు.. కండక్టరుగారు... నా చెప్పులండి. ఆకుజోళ్ళండి. దొరికాయాండి. తెల్లగా ఉంటాయండి! ముందు సూదిగా ఉంటాయండి! పైన ఎఱ్ఱ పువ్వు ఉంటుందండి! ఎవరికైనా దొరికితే ఇచ్చారాండి?" అటూ కండక్టరువైపు పరుగెట్టాడు.

"దొరకలేదు బాబు" కండక్టరు జవాబిచ్చాడు.

"మళ్ళీ రేపు రానాండీ. ఎవరైనా యిస్తే జాగ్రత్తగా ఉంచండి"

ఈలోగా బస్సు కదలిపోయింది.

*(ఆంధ్రసచిత్ర వారపత్రిక 7-7-'89, పే. 47-49)*



ఆర్కిడ్స్ 1974 ప్రణవమూర్తి

## 2

# గుమ్మడికాయతో ఉమ్మడి పేషెంటు

ఉదయం ఎనిమిది గంటలు కావస్తోంది.

అవుట్ పేషెంట్ డిపార్టుమెంట్లలో అప్పుడప్పుడే జనం చేరుతున్నారు.

కొంగల బారుల్లా తెల్లటి యూనిఫారాలు వేసుకొని ప్రొబేషనరీ నర్సులు గుంపులు గుంపులుగా ఎదురౌతున్నారు.

కారిడార్లు శుభ్రం చేస్తూ స్వాబ్ చేస్తున్న పనివారు పని ఆపి దారిస్తున్నారు. నైట్ డ్యూటీ చేసి అలిసిపోయిన నర్సులూ, పిల్ల డాక్టర్లూ ఎదురౌతున్నారు. అందరూ 'గుడ్ మార్నింగ్' అని చెపుతూ ఉంటే 'వెరీ గుడ్ మార్నింగ్' అంటూ నా రూమ్‌కి చేరాను.

ఓవర్ కోట్ వేసుకొని స్టెతస్కోపు తీసుకొని వార్డు రౌండ్సుకి బయలు దేరుతూంటే - "నమస్కారం డాక్టరుగారూ!" దీనంగా ముఖం పెట్టి ఏడుస్తున్నట్లే ఉంది. 35 సంవత్సరాల మధ్య వయస్కురాలు దారికి అడ్డుపడింది.

ఏమిటి.. అన్నట్లు చూశాను.

"డాక్టరుగారూ! ఆరో నంబరు మంచం మీదున్నది మా అమ్మ అండి. ఆవిడ ఆరోగ్యం ఎలా ఉందండి? దయచేసి చెప్పండి డాక్టరు గారూ...

"మా అమ్మ లేకపోతే నేను బతకలేనండీ. పెళ్ళి కూడా చేసుకోకుండా ఆవిడకు సేవ చేస్తున్నానండీ...

"డాక్టరు గారూ, నాకు ఒకే ఒక్క అమ్మండి! ఆవిడను మీరు ఎలా రక్షిస్తారో!" గుక్క తిప్పుకోకుండా నన్ను మాట్లాడనీయకుండా చెప్పేస్తోంది.

ఎవరికైనా ఒక్కరు గాకుండా ఇద్దరు ముగ్గురు అమ్మ లుంటారా - అనుమానం కలిగింది.

"ఆవిడ రాత్రి అడ్మిట్టయి ఉండాలి. నే నింకా చూడలేదు తల్లీ. చూసి చెపుతాను, మీరు పేషెంటు దగ్గరే ఉండండి. అక్కడికి నేను వస్తాను." సముదాయించి ఎమర్జెన్సీ వార్డు ముందుగా చూసేందుకు అటు వెళ్ళాను. ఎమర్జెన్సీ వార్డు పని పూర్తి చేసుకొని ఫీమేల్ వార్డు పనికి ఉపక్రమించాను.

మొదట బెడ్డు దగ్గర "అమ్మా! నీ బాధ ఏమిటి?"

"కళ్ళు కాలిపోతున్నాయి బాబూ!"

"బుర్ర పగిలిపోతూంది. ఆకలి లేదు. పక్కమీద నుండి కదలలేక పోతున్నాను."

వాటి నన్నిటినీ మెడికల్ పరిభాషలో రాసుకొని పరీక్ష చేశా. ఆవిడకు గుండె జబ్బు లేకపోలేదు.

సిస్టరు చెపుతోంది మధ్యలో- "సార్! ఆవిడ మీ రౌండ్సు అవగానే రోడ్డు మీదే తిరుగుతుంది. అసలు బెడ్మీదే ఉండటం లేదు సార్."

"అలాగా! ఒకసారి బి.పి. ఆపరేటస్ తీసుకొని రండి సిస్టర్."

"ఒకే ఆపరేటస్‌సార్ - ఛీఫ్ చూస్తున్నారు. తెస్తానుండండి." వెళ్ళిపోయిన సిస్టరు ఇరవై నిముషాలు అయినా తిరిగి రాలేదు. ఈలోగా ఆ పేషెంటు సుత్తి మరీ కొట్టేసింది.

"బీదదాన్ని తండ్రీ. మీరే కాపాడాలి. మీరే దేవుళ్ళు, మొగుడూ,పిల్లలూ అంతా వదిలేశారు. మీరే చూడాలి మాలాటి వాళ్ళను... కొంచెం భోజనం రాయించు తండ్రీ".

"అలాగే నమ్మా!" అని తెచ్చిన బి.పి. ఆపరేటస్‌తో బి.పి. చూసి, తరువాతి బెడ్‌కి వెళ్ళా.

అరవై ఏళ్ళ ముసలమ్మ ఆయాసంతో బ్యాక్ రెస్టుమీద ఆనుకొని కూర్చొంది. ముక్కులో ఆక్సిజన్ గొట్టం కూడా ఉంది. బి.పి. పల్సు చూశా. ఊపిరితిత్తులు బాగా తేడాగా ఉన్నాయి. కండిషన్ సీరియస్‌గానే ఉంది.

నోరు తెరవమన్నాను. పళ్ళన్నీ గారపట్టి, దవడలు కాలిపోయి ఉన్నాయి. ఆవిడ చేతులు చుట్టవాసన వస్తున్నాయి. అడ్డపొగ చేస్తుందనటం ఖాయం.

"ఏం తల్లీ! రోజుకి ఎన్ని చుట్టలు తాగుతావు?" అడిగా.

"అయ్యో! ఛీఛీ! నే నసలు చుట్టలే తాగను బాబూ!" కచ్చితంగా చెప్పింది.

అనుమానం వేసి పరుపు ఎత్తి చూశా. పది చుట్టల కట్ట, అగ్గిపెట్టి ఉంది.

వాటిని తీసి కిటికీలోంచి అవతలకి పారేశా.

పక్కనున్న పదేళ్ళ మనవరాలు "మా మామ్మ చుట్ట తాగుద్దండి." చెప్పేసింది.

ఏమిటన్నట్లు ముసలమ్మ వైపు చూశా.

"ఇదివరకు ఎప్పుడో తాగేదాన్నండి. ఇప్పుడు తాగటం లేదండి." ముఖం తిప్పేసుకొంది.

తరువాతి బెడ్‌కి వెళ్ళా.

"సిస్టర్! ఈవిడ బాగానే ఉన్నది కదా! నిన్ననే డిశ్చార్జి చెయ్యమన్నా కదా!

"ఈవిడ ఇంటికి వెళ్ళదంట సార్!" సిస్టరు చెప్పింది.

"మీ కాళ్ళు పట్టుకుంటాను. నన్నిక్కడే ఉండనియండి బాబూ.. ఇంటికెళ్తే నా మొగుడు తన్నుతున్నాడు బాబో" ముప్ఫై ఏళ్ళ మనిషి బోరున ఏడుపు లంకించుకుంది.

"సరేలే తల్లీ. రేపు చూసుకొందాం."

"నెక్స్ట్ బెడ్."

"ఏమ్మా, బాగుందా?"

"కొంచెం సులువుగానే ఉందండీ బాబూ." లేచి మంచం దిగి గబాల్న కాళ్ళకి దణ్ణం పెట్టేసింది.

"అదేం తల్లీ? నాక్కాదు భగవంతుడికి పెట్టు దణ్ణం. నాక్కాదు." తప్పుకున్నాను కంగారుగా.

"డాక్టరుగారూ! నా ప్రాణాన్ని కాపాడారు. మీరే దేవుళ్ళు.

"వీటిని మీరు తీసుకెళ్ళండి." సంచిలో తేగలు, వంకాయలు, చిలకడదుంపలు లాంటివి పెట్టి, బలవంతం పెట్టేసింది.

అందరి ముందూ సిగ్గేసింది కొంచెం.

"ఇక్కడ కాదులే తల్లీ.. తరువాత తీసుకొంటాను."

నెక్స్ట్ బెడ్.

కోపంగా మఠం వేసుకొని మంచం మధ్య కూర్చుంది. శిరోముండనం చేయించుకొని, తెల్లచీర కట్టుకొని డెబ్భై ఏళ్ళ బామ్మగారు.

"ఈవిడ కూతురేనండి, ఇందాక మీ గది కొచ్చి మాట్లాడింది." సిస్టరు చూసింది కాబోలు చెబుతూంది.

ఓహో ఈవిడే కాబోలు ఆవిడగారి ఒకే అమ్మ!

"ఏం బామ్మగారూ! ఎలా ఉంది ఒంట్లో?"

"నా పిండాకూడు, ఎలా ఉంటుంది?"

ముసలావిడ దగ్గర నుంచి వచ్చిన జవాబుకి బిత్తరపోయి దిక్కులు చూస్తున్నా.

"ఈవిడ మమ్మల్నందర్నీ తిట్టేస్తూంది సార్!" కంప్లైంట్ ఇచ్చేందుకే నుంచున్న ఆయా చెప్పింది.

"అప్రాచ్యులు! నా మడి బట్టల్ని ముట్టేసుకున్నారు" గొడవ ప్రారంభించింది ముసలమ్మ.

ఇక్కడ మడేమిటి?

"ఏమ్మో. ఒళ్ళు దగ్గర పెట్టుకొని మాట్లాడు! మాకేమిటి నిన్ను ముట్టుకొనేందుకూ, నీ బట్టలు ముట్టుకునేందుకూ." ఆయా రెచ్చిపోయింది.

"ముసలావిడ కదా ఊరుకోండమ్మా!" అని వాళ్ళని సముదాయించి, ఆవిడను అతికష్టం మీద పరీక్ష చేసేందుకు తలప్రాణం తోక కొచ్చింది.

కాళ్ళు వాపులు.. ఆయాసం, బాగా పెరిగింది.

అలాగే మిగిలిన వారిని కూడా చూసి రూమ్‌కి చేరేసరికి కొంచెం తలనొప్పి ప్రారంభమైంది.

మరుసటి రోజూ అదే రొటీన్.

మళ్ళీ బామ్మగారి దగ్గర కొచ్చేసరికి అలాగే మఠం వేసుకొని మంచం మధ్య కూర్చున్నారు.

"మామ్మగారూ! సరిగ్గా ఒకసారి పడుకోండి. పరీక్ష చేస్తా."

"ఊహూ! ఇలాగే చేయండి."

"ఇలా కుదరదు తల్లీ. సరిగ్గా పడుకో. చూడనీ."

పూర్తిగా కప్పుకొన్న చీర చెంగును తప్పించి పడుకోబెట్టేందుకు ప్రయత్నించా.

బామ్మగారి ఒళ్ళో బూడిద గుమ్మడికాయ బయట పడింది. ఆవిడ దాన్ని కౌగలించుకొని కూచుంది.

సిస్టరు పక్కున నవ్వింది.

నాకూ చుట్టూ ఉన్న వాళ్ళందరికీ కూడా నవ్వాగలేదు.

"ఏ అరటి పళ్ళో ద్రాక్ష పళ్ళో, ఏపిల్సో తెచ్చి ఇస్తారు ఆస్పత్రిలో పేషెంట్లకు. చూసేందుకు వచ్చిన మనిషెవడో ఈవిడికి బూడిద గుమ్మడికాయ ఇచ్చి పోయాడు సార్!"

"అప్పటి నుంచీ వదలకుండా" దాన్ని కౌగిలించుకొని పట్టుక్కూ చుంది." సిస్టరు చెప్పింది.

"బామ్మగారూ! నా కిస్తారా ఏమిటి ఈ బూడిద గుమ్మడికాయను." అడిగా.

"ఛస్తే ఇవ్వను." నిర్మొహమాటంగా చెప్పింది.

"సరేలెండి. మీ దగ్గరే జాగ్రత్తపెట్టుకోండి.

ఏం చేస్తారు దాంతో?"

"ఇంటికి వెళ్ళి వడియాలు పెడతాను. ఇంకా ఏదో చేస్తాను. నీ కెందుకు?"

"నీతో ఎందుకులే తల్లీ?"

నెక్స్ట్ బెడ్.

"ఏమ్మా! ఎలా ఉంది."

"నడుం నొప్పిగా ఉందండి. ఆకలి వేయటంలేదండి. రాత్రి నిద్దర రావటం లేదండి."

"అది కాదమ్మా! ఛాతీలో గుండెకు సంబంధించిన నొప్పేమన్నా ఉందా?'

"లేదులెండి."

"చాలా రోజులైందిగా ఆస్పత్రికి వచ్చి నీ విక ఇంటికి వెళ్ళొచ్చు."

"మూడు నెలల పదహారు రోజులు అయింది సార్!" సిస్టరు చెప్పింది లెక్కేసి.

"తల్లీ, నీ విలా ఆస్పత్రిలోనే ఉంటే నీ భర్త ఇంట్లో మరెవరినన్నా కాపరానికి తెచ్చేసుకుంటాడు. కొన్నాళ్ళు ఇలా ఉంటే నీకు విడాకులు ఇచ్చేసేందుకు కూడా అవకాశం వస్తుంది."

ఆవిడ గుండెలో రాయి పడినట్లుంది. "అమ్మ నాయినోయ్! కొంప ములుగుతాది. నాకూ ఆ అనుమానం ఉంది డాక్టరుగారూ! ఇప్పుడే ఇంటికి వెళ్ళిపోతాను బాబూ!"

"సిస్టర్! డిశ్చార్జ్ హెర్."

ఫిమేల్ వార్డులో రోజూ ఇదే విధంగా రౌండ్సు అవుతూ ఉంటాయి.

పది రోజులు గడిచాయి. బామ్మగారి కోసం ఇప్పుడు ఎవరైనా రావటం తగ్గించేశారు. అసలు ఎవరూ రావటమే లేదు. కూతురు కూడా రావటం లేదు.

ఆ రోజు సిస్టరు హడావిడిగా వచ్చి. "సార్ బామ్మగారి గుండెలో నొప్పట! ఆయాసపడుతున్నారు?"

వెంటనే పరిగెట్టా.

పల్సు, బి.పి. రికార్డు కాలేదు. హార్టు బీట్ వినబడలేదు. ఇ.సి.జి. మోనిటర్ కనెక్టు చేశాము. కాంప్లెక్సులు లేవు. కార్డియేక్ అరెస్టు. గుండెలోకి ఇచ్చే ఎమర్జెన్సీ ఇంజక్షన్లు ఇచ్చాను. కార్డియేక్ మసాజ్ ఇచ్చాను. గుండెకు డి.సి. షాక్ ఇచ్చాను. ప్రయోజనం లేకపోయింది. నిముషాల్లో బామ్మగారి ప్రాణం పంచభూతాల్లో కలసిపోయింది.

ప్రాణం ఉసూరుమంది.

ఇన్ని రోజులుగా వార్డునంతా గడగడలాడించి, అందర్నీ తిట్టి, తిట్లు తిని పని చేయించుకొని హుందాగా మంచంమీద కూర్చునే బామ్మగారు ఇక లేరు.

వార్డు తోటీలు ఆవిడ శరీరాన్ని స్ట్రెచ్చర్లో వేసి మార్చురీకి తరలించారు.

ఆవిడ మిగిల్చిన సామానులో ఏవైనా విలువైన వస్తువులుంటే జాగ్రత్త చేసి అవి కూతురు వస్తే అందజేయాలని సిస్టరు బెడ్‌ను వెదుకుతోంది. తలగడ కింద అయిదు రూపాయలు, మరికొంత చిల్లర, తెల్లచీరలు రెండు, దాని పక్కగా పాత గుడ్డల మూటొకటి ఉంది.

గుడ్డ మూటను నెమ్మదిగా విప్పింది సిస్టర్.

దానిలో సగం పైగా కుళ్ళిపోయి ఉన్న బూడిద గుమ్మడికాయను చూసినప్పుడు మనస్సు మరొకసారి చివుక్కుమంది.

*(ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక 14-2-90. పే. 22-25)*

**3**

# రిస్టు వాచీ ముసలితనం

ఎప్పుడూ రిపెయిరు అన్నదే లేదు. ఎభై ఏళ్ళుగా నిర్విరామంగా పనిచేసింది.

"కూర్చోండి సార్, ఇచ్చేస్తున్నాను. మీ రిస్టువాచీని ఓవరాయిలింగ్ చేస్తే సరిపోయిందండీ" అంటూ తన రిస్టు వాచీని తిరిగి ఇస్తున్నప్పుడు దాని వెనుక కథ స్ఫురణకు వచ్చింది ప్రకాశరావుకి.

★ ★ ★

తండ్రి ముసలితనం, చూపు తగ్గిపోవటం, వేరే సంపాదన లేకపోవటం వలన ఉన్న నాలుగు ఎకరాల పొలం అమ్మేసి, ఇద్దరు కూతుళ్ళ పెళ్ళిళ్ళు జరిపించేసాడు.

కొడుకు గురించి తండ్రికి బెంగలేదు. కొడుకు ఎక్కడ చదివితే అక్కడే, ఆ స్కూలువాళ్ళే స్కాలర్‌షిప్ ఇప్పించి మరీ చదివించేవారు. ప్రతి టీచరుకి ప్రకాశరావు ప్రియ శిష్యుడే.

ప్రకాశరావు ప్రజ్ఞాపాటవాలు చెప్పుకోదగ్గవి. చిన్నప్పుడు నవాబు పాలెం నుండి నడిచి వచ్చి, పెంటపాడులో మిడిల్ స్కూలు, హైస్కూలు చదువులు చదివాడు. నడచి వస్తున్నప్పుడు దారిలో రోడ్లు మరమ్మత్తు చేయిస్తున్న ఓవర్సీరుగారికి తెగని లెక్కలు ప్రకాశరావు సునాయాసంగా చేసి ఇచ్చేవాడు.

కోర్టులు దగ్గరకొచ్చే సరికి చావడిలో కూర్చున్న రైటర్లు, ప్రకాశరావు ముత్యాల వంటి వ్రాత తెలిసికొని ఎన్నెన్ని డాక్యుమెంట్లనో వ్రాయించుకునేవారు.

బి.ఎ. ఫైనల్ బందరులో చదువుతున్నప్పుడు ఆస్తిపాస్తులు లేకపోయినా కుర్రవాడు బుద్ధిమంతుడని అన్నింటిలోను ఫస్టు ప్రైజులుగా బంగారుపతకాలు, పుస్తకాలు, వీటన్నిటికి మించిన "గుడ్ కాండక్టు" ప్రైజులు అతనివేనని "కస్పా

పెంటపాడు" కరణంగారి ఏకైక సంతానాన్ని సుబ్బలక్ష్మిని ప్రకాశరావు కిచ్చి ఘనంగా పెళ్ళి జరిపారు.

ప్రకాశరావుకి తన గురించి ఆలోచించుకొనే ఆసక్తే లేదు. ఎప్పుడూ ఎదుట వాడికి ఏమి చేసి పెట్టాలా అనే ధోరణిలో వుండే సత్యకాలపు మనిషి. ఎదుట వానిని ఒక్క పరుషవాక్యమైనా అని బాధపెట్టని సౌమ్యుడు.

పెళ్ళయిన తరువాత అత్తవారింటికి వెళ్లటం అదే మొదటిసారి. రెండురోజులు ముందుగానే బయలు దేరాడు. పాలబండిలో బందరు నుండి గూడెం చేరేసరికి తెల్లారి నాలుగు గంటలయింది. మామగార్కి తను ఎప్పుడు వస్తాడో వ్రాయకపోవటం చేత స్టేషన్‌కి రెండెడ్ల బండి రాలేదు. అక్కడి గుర్రపు బళ్ళు పండగ బేరాలు తగలటం చేత అన్నీ వెళ్ళిపోయాయి. ఇక గత్యంతరం లేక కూలీ నెత్తి మీద పెట్టే హోల్డాలూ పెట్టి నెమ్మదిగా నడక ప్రారంభించాడు ప్రకాశరావు.

గూడెందాటి పెంటపాడు కాలవ దాటి, కస్పా పెంటపాడు చేరేసరికి 5 గంటలయింది.

కస్పా పెంటపాడుని బైరాగుల పెంటపాడు అని కూడా అంటారు. ఈ పల్లెటూరు పురాతనమైనది. బహుశా వేలకొలది సంవత్సరాల చరిత్ర దాని వెనుక ఉండాలి. ఈ ఊళ్ళో రెండు త్రాడుల లోతు తవ్వినా పెంటమట్టే తగులుతుంది. అందుకని పెంటపాడయింది. ఆ మట్టిని త్రవ్వి పొలాలకి ఎరువుగా పోస్తారు. చీకట్లో తెలియని వాడెవ్వడైనా ఆ ఊరు వస్తే ఆగాధాల్లో పడిపోయాడన్న మాటే.

అలా త్రవ్వుతూ ఉంటే అస్తి పంజరాలు, పురాతన మట్టిపాత్రల శిథిలాలు, వెండి, బంగారు నాణాలు ఎన్నెన్నో దొరికేవి.

ఆ ఊళ్ళో ఒక ఎనభై ఏళ్ళ ముసలమ్మ ఏమి చెప్పేదంటే నీరు కోసం నూయి త్రవ్వుతూ ఉంటే ఎంత లోతు వెళ్ళినా నీరు పడలేదు సరిగదా రెండు తలల పాములు, కుక్కలు, కుక్క మూతి వాళ్ళు, పందిమూతి వాళ్ళు పైకొచ్చేస్తుంటే గబగబా మట్టివేసి పూడ్చేసారట. మళ్ళీ నూతులు త్రవ్వే ప్రయత్నం చేయలేదట. నిజంగా ఆ ఊళ్ళో నూతులు లేవు. మూడు చెరువులు, ఒక కాలువ ఆ ఊరి నీటికి ఆధారాలు.

చింతతోపు దగ్గర కొచ్చేసరికి మంచు తెరల వెనక అటూ ఇటూ గాలికి తలలూపుతూ ఊగుతున్న ఎత్తైన చింతచెట్ల వెనుక దూరంగా బావాజీల శ్మశాన వాటిక దాని ప్రక్క వేణుగోపాల స్వామి గోపురాలు మసకగా

కనిపించాయి. అసలు ఆ గూళ్ళూ, గోపురాలూ పూర్వం బౌద్ధ ఆరామాలు, అక్కడికి ఎందరో బౌద్ధ సన్యాసులు వస్తూపోతూ ఉండేవారనిఅందుకనే ఈ ఊరికి 'బైరాగుల పెంటపాడు' అని కూడా పేరు వచ్చిందని అంటారు.

కోడి పుంజుల కొక్కొరోకోలతో బాలభానుడి కిరణాలు పూర్తిగా బైటపడ్డాయి. నాగలి చాడులను భుజాలకేసుకొని, పశువుల మందలను తోలుకుపోతున్న రైతు యువకులు గొంతెత్తి పదాలు పాడుతున్నారు.

నీళ్ళ బిందెల్ని నెత్తిన పెట్టుకొని రంగురంగు చీరలతో చెరువు నుండి చేలగట్ల మీద బారులుగా పల్లె పడుచులువస్తున్నారు.

'హరిలోరంగా హరి' హడావిడిగా పాడుకుంటూ నెత్తిన ఇత్తడి గిన్నె, తంబూర చిడతలతో హరిదాసు పరిగెడుతున్నాడు.

కన్నె పిల్లలు ఇళ్ళముందు రంగవల్లులు దిద్దీ గొబ్బెమ్మలను పెడతున్నారు.

ఊళ్ళోకి పండగొచ్చేసింది. ప్రకాశరావు మనస్సు ఆనందంతో నిండిపోయింది.

"నమస్కారం బాబూ! ఎప్పుడొచ్చారు" చాలామంది పలకరించారు. కరణంగారి అల్లుడు అనుకుంటూ.

మఱ్రి చెట్టుదాటి బోదె ప్రక్కన కరణంగారి ఇల్లు చేరువయ్యేసరికి ప్రకాశరావు ఒక్కసారి వెనక్కు తిరిగి చూసాడు.... సామాను తెచ్చే మనిషి కోసం. అతనులేడు. 30, 40 మంది తీర్థ ప్రజలుగా వెనకాలేవస్తున్నారు. సామాను మరొకరెవరో తెస్తున్నారు. ప్రకాశరావుకి కొంచెం సిగ్గేసింది.

ఈ వార్త ముందే అందిపోయినట్లుంది. ఇంట్లోకి పూర్తిగా చేరకముందే కరణంగారు ఎదురొచ్చి "ఇదేంటి బాబూ! ఇంత దూరం నడిచే వస్తున్నావా? ఉత్తరం వ్రాస్తే బండిని పంపేవాడిని కదా!" సాదరంగా ఆహ్వానించారు.

"అనుకోకుండా రెండు రోజులు ముందే వచ్చేయ గలిగానండి. అందుకని ముందుగా ఉత్తరం వ్రాయలేక పోయాను."

కాళ్ళు కడుక్కొనేందుకు నీళ్ళిచ్చేవారు, తుడుచుకొనేందుకు తుండుగుడ్డ ఇచ్చేవారు. అల్లుడి గది హడావిడిగా అమర్చి సదుపాయాలు చూసేవారు. ఇల్లంతా కోలాహలంగా ఉంది.

ప్రకాశరావు యేతలుపు చాటు నుండైనా ఆ కళ్ళు కనబడతాయా అని వెతుకుతున్నాడు.

ఊళ్ళో పల్లె పడుచులంతా తలుపు చాటుల నుండి చూస్తున్నారు. వెట్టోళ్ళు

"అయ్యగార్కి విశ్రాంతి గావాలి. ఎల్లి పొండెహె" గదమాయించి వాళ్ళను తరిమేస్తున్నారు.

స్నానమయి గదిలో కూర్చొనేసరికి సుబ్బలక్ష్మి టిఫిను, కాఫీలతో గదిలో ప్రవేశించింది. "హమ్మయ్య" అనుకొన్నాడు, ప్రకాశరావు.

సాయంకాలమయ్యేసరికి వూళ్ళో చుట్టాలు, మోతుబరులు, చాలామంది పలకరించేందుకు వచ్చారు. చదువుమీద ఆసక్తి వున్న హైస్కూలు కుర్రాళ్ళు ఈ విద్యాసాగర్‌ను కలిసికొన్నారు.

ఆరోజు మధురమైన మరొక రాత్రి గడచిపోయింది.

మరుసటి రోజు ఇంతటి హడావిడి అయిన తరువాత, భోజనం తరువాత 11-12 గంటల మధ్య ప్రకాశరావు ముందు వరండాలో వాలు కుర్చీలో కూర్చొన్నాడు. సుబ్బలక్ష్మి తండ్రికి భోజనం పెట్టింది.

గుమ్మం దగ్గర ఎవరో పాడుతున్నారు.

"చూడమ్మా. వీళ్ళకి వేళా పాళా లేదు. పొద్దుట్నించి ఒకటే వరస. వెళ్ళు గుప్పెడు బియ్యం వేసిరా."

సుబ్బలక్ష్మి బియ్యం పట్టుకొని బైటకొచ్చింది.

బియ్యం వేయకుండానే తలొంచుకొని గబగబా లోపలికి వచ్చేసింది.

"అదేమిటమ్మా! వెళ్ళిపోయాడా?" అడిగారు కరణంగారు.

"అదికాదయ్యా" సుబ్బలక్ష్మి సిగ్గుతో చెప్పలేకపోయింది.

"ఒక్క నిమిషం నుంచోలేక పోయాడా?"

"కాదయ్యా ఆయన పాడుతున్నారు"సిగ్గుతో ప్రక్క గదిలోకి పారిపోయింది సుబ్బలక్ష్మి.

అల్లుడు పాడుతున్నాడని తెలిసిన కరణంగారికి గొంతు పొరబోయింది. నవ్వాపుకోలేక పోయారు.

సరదాలతో, నవ్వులతో పండుగ గడచిపోయింది.

కొత్త బట్టలతో, వెస్టెండు రిస్టువాచి, దానికి బంగారపు ఛెయిన్‌తో బందరు హాస్టలు చేరాడు ప్రకాశరావు.

స్నేహితులంతా రిస్టువాచిని బంగారపు చెయిన్ను ఒకరి తరువాత ఒకరు చూసి చాల బాగున్నదని ప్రకాశరావుని అభినందించారు.

వారం రోజుల తరువాత ఒకరోజు ప్రకాశరావు టేబిల్ సొరుగులో పెట్టిన రిస్టువాచి కనబడలేదు. వార్డెన్‌కి కూడా రిపోర్టు చేయలేదు ప్రకాశరావు. పోలీసు రిపోర్టు చేస్తే తన సహచరుణ్ణే అరెస్టు చేయటం ప్రకాశరావుకి ఇష్టంలేక ఎవరికీ చెప్పకూడదని నిర్ణయించుకున్నాడు.

ప్రకాశరావుకి తెలుసు. ఆపని యెవరో చేసారో. కాని యేనాడు అతని పేరు బయట పెట్టలేదు.

అటు ప్రక్కకి తిరిగి నిద్రపోతున్నాడనుకొని తన గదిలోనికి ప్రవేశించిన వ్యక్తికి తనముందున్న అద్దంలో నుండి ప్రకాశరావు గమనిస్తున్నాడన్న సంగతి తెలియదు.

ప్రకాశరావులోని ఇంత మంచితనం ప్రపంచానికి ఏ విధంగా అర్థమౌతుంది.

నాల్గురోజుల తరువాత "బంగారపు చెయిన్ లేకుండా వాచి మాత్రం స్నానాల గది ప్రక్కన అరటి చెట్ల మొదలులో దొరికిందని" ఒక స్నేహితుడు వాచిని తెచ్చి ఇచ్చాడు.

రిస్టు వాచి దొరికినందుకు ప్రకాశరావు చాల సంతోషించాడు.

★ ★ ★

ప్రకాశరావు బి.ఎ. ఫస్టు క్లాసులో పాసయ్యాడు. మరి ఆరునెలల్లో లోకల్ ఫండ్ ఆడిట్ ఇన్స్పెక్టరుగా మద్రాసులో ఉద్యోగమొచ్చింది. మంచి ఉద్యోగం.. ప్రమోషన్లకూడా మంచి అవకాశం.

సుబ్బలక్ష్మిని తీసుకొచ్చి టీ-నగర్‌లో కాపరం పెట్టాడు. మంచి ఇరుగు పొరుగులతో కొత్త స్నేహితులతో మరొక సంవత్సరం గడిచిపోయింది.

ఒకరోజు "మీ మీద కేసుంద"ని ఒక సి.ఐ.డి. వచ్చేసరికి ప్రకాశరావుకి పిడుగుపాటయింది.

ఐడింటిటీ కార్డు చూపిస్తూ -

"మీ మీద చీటింగ్ 420 కేసు వుంది" అన్నాడు. ప్రకాశరావు అవాక్కయ్యాడు. తను ఎరిగి ఎవరికి హాని చేసాడు?

"మీరెక్కడ చదివారు?"

"బందరులో బి.ఎ. చదివాను."

"'అంతకు ముందు?"

"మిడిల్ స్కూల్, హైస్కూల్ చదువులు పెంటపాడులో"

"మీ సర్టిఫికేట్లు మీ దగ్గర భద్రంగా వున్నాయా?"

"ఉన్నాయండి"

"మీకు చదువు చెప్పిన మీ టీచర్లు మిమ్మల్ని గుర్తు పడతారా?"

"తప్పకుండా"

ఈ విషయం తెలిసిన సుబ్బలక్ష్మి ఎంత హైరాన పడిందో!

అసలు విషయం చెప్పాడు సి.ఐ.డి.

మరొక వ్యక్తి ప్రకాశరావు పేరుతో పోలీసు సబిన్స్పెక్టరుగా సెలక్షన్‌లో ఫస్టుగా సెలక్టయి ఆరునెలలు ఉద్యోగం చేసాడు.

జీతం ఇచ్చేటప్పుడు ఆడిట్ ఆఫీసులోనే తగువచ్చింది. ఒకే పేరుతో ఒకరు లోకల్ ఫండ్ ఎక్కౌంట్సు ఇన్‌స్పెక్టరుగా మద్రాసులో, మరొకడు పోలీసు సబిన్స్పెక్టరుగా విజయవాడలో ఉద్యోగాలు చేస్తున్నారు. ఎవరు నిజం? ఎవరు అబద్ధం?

కోర్టులో రెండు సంవత్సరాలు నడిచింది ఈ వ్యవహారం.

యూనివర్సిటీ రిజిస్ట్రార్ దగ్గర నుండి బందరు కాలేజీ ప్రిన్సిపాల్, పెంటపాడు హైస్కూలు వరకు ప్రకాశరావుని ఖచ్చితంగా గుర్తించారు కాబట్టి సరిపోయింది.

తన ఇల్లు కాలిపోయిందని ప్రకాశరావుని తనే అంటూ హైస్కూల్లో యూనివర్శిటీలోను డూప్లికేట్ సర్టిఫికెట్స్‌ను పోస్టుద్వారా సంపాదించి, ఎత్తూ, ఒళ్ళూ ఉన్న వ్యక్తి గాబట్టి మంచి సర్టిఫికెట్లతో సులభంగా పోలీసు సబిన్స్పెక్టరు ఉద్యోగాన్ని సంపాదించాడు. కాని దురదృష్టవశాత్తు దొరికిపోక తప్పలేదు.

బందరు కోర్టు బోనులో ఎక్కిన ఆ వ్యక్తిని మిగిలిన సాక్షులతో బాటు ప్రకాశరావు కూడ గుర్తించాడు.

బందరు కాలేజీలోనే డింకీలు కొడుతూ బి.ఎ. వరకు వచ్చి ఒక దానినీ పూర్తి చేయలేదు. చదువు ఆపేసిన నరసింహారావు - ఇంతకీ ఆ వ్యక్తి.

ప్రకాశరావు అనుకున్నాడు. మనస్సులో "నరసింహారావుకి ఎత్తు, బలం

ఉందిగాబట్టి ఆ ఉద్యోగం వచ్చింది. పీలగా నాల్గున్నర అడుగులున్న తనకైతే రాకపోనని"

మరొక విషయం "తన గదిలో తన రిస్టువాచి బంగారు ఛెయిన్‌తో దొంగిలించి, బంగారపు ఛెయిన్‌ను ఉంచేసుకొని గడియారాన్ని మాత్రం అరటిచెట్ల మొదళ్ళలో పడేసిన వ్యక్తి ఈ నరసింహరావే"నని. అప్పుడు కూడా ప్రకాశరావు వెల్లడి చేయలేదు.

★ ★ ★

"ఏమి సార్? ఒంట్లో బాగోలేదా? అని రిస్టువాచ్ రిపేరర్ అంటూన్నపుడు మళ్ళీ ఈ ప్రపంచంలోకి వచ్చిన ప్రకాశరావు "లేదు బాబూ బాగానే ఉన్నాను" అన్నాడు. ప్రకాశరావు రిటైరై పది సంవత్సరాలైంది.

సుబ్బలక్ష్మి కూడ వెళ్ళిపోయి ఐదు సంవత్సరాలయింది.

డెబ్బయ్యేళ్ళ ప్రకాశరావు తన టైము ఎప్పుడొస్తుందో! అనుకుంటూ కొడుకు ఇంటికి నెమ్మదిగా చేతి కర్రను పుచ్చుకొని బయలుదేరాడు - రిస్టు వాచిని చూసుకొంటూ...

*(తెలుగు విద్యార్థి మాసపత్రిక, జనవరి 1993 పే 13-15)*



వెన్నెల్లో గోదారి 1994 ప్రణవమూర్తి

4

# అల్లంమురబ్బా వెల ఒక వంకరనవ్వు

"అమ్మ బాబోయ్ వీడు వచ్చేస్తున్నాడు, వంకర నవ్వుతో" ఆ తల్లి భయపడి పోయింది.

మామూలుగా నవ్వితే ఫర్వాలేదు. అది వంకర నవ్వు అయితే ఏదో తుంటరి పని చేశాడన్నమాటే!

రేగిపోయిన జుట్టును ముంజేతితో సవరించుకుంటూ చీర చెంగుతో నొసటి మీద చెమటను తుడుచుకుంటూ చిన్ని కృష్ణుని భంగిమలో వస్తున్న తనమూడేళ్ళ కొడుకుని చూసి పార్వతి "రాజా! ఏమిరా బాబూ, ఏమి చేసుకొచ్చావు?" వాడి వంకర నవ్వు మళ్ళీ!

చంద్రవతీ వాళ్ళింటికి వెళ్ళిన నాడు, తను చెప్పనే చెప్పింది. సామానంతా కాస్త ఎత్తులో వీడికి అందకుండా సర్దుకోమని! వాళ్ళయినా ఎన్నని సర్దుకుంటారు? అలా చూస్తూండగానే కుర్చీ లెక్కి బెంచీలెక్కి అలమారలోని గాజు సామానంతా పగులగొట్టాడు. అలా ఎన్నిసార్లు. ఇక ఎవరింటికి వెళ్ళటం మానుకొంది. నాల్గు బాదుదామని దగ్గరకు వెళ్ళేసరికి ఆ వంకర నవ్వు. వాడు అలా నవ్వితే ఆ తల్లి యిక వాడిని కొట్టలేదు.

పొయ్యిమీద కూరను అలా వదిలేసి, పెరట్లోకి పరిగెత్తింది పార్వతి. ఒకటిన్నర సంవత్సరాల చిట్టితల్లి గుక్క త్రిప్పుకోకుండా ఏడుస్తూంటే ఐదేళ్ళ రమ దాన్ని పొట్టమీద తట్టుతూ ఓదారుస్తూంది. సరిగ్గా వూహ తెలియని యీ ముగ్గురి పిల్లల్తో సతమతమౌతోంది పార్వతి. అరగంటయింది, వాళ్ళని స్నానాలు చేసి ముస్తాబు చేసి, చాపలేసి పెరట్లో ఆడుకోమని చెప్పి.

"అమ్మా! రాజు కూర్చున్న చెల్లిని జుట్టు పట్టుకొని తోసేసాడమ్మా!"

చంటిపిల్ల గుక్క పెట్టి ఏడుస్తూ ఉంది.

"లేదమ్మా, చెల్లి?.. చాలాసేపు కూచుంది. గదా.. నడుం నొప్పెడుతుందనీ పడికించాను." సావధానంగా చెప్పాడు, వంకర నవ్వు విసురుతూ, రాజు.

"నీ మొఖం, అలాగేనా పడుకోబెట్టేది? పిల్లను సముదాయించి" అని కసిరింది పార్వతి. నడుంనొప్పితో కాళ్ళు పడిపోయి మంచం పట్టిన ముసలి తండ్రికి ఎదురుగా గదిలో చాప వేసి పిల్లల్ని కూర్చోబెట్టింది... పార్వతి.

"పిల్లల్ని నేనుచూస్తానే అమ్మా, నీ వెళ్లి పని చూసుకో" అంది రమ. వంట గదిలోకి వెళ్ళేసరికి పొయ్యిమీద కూర మాడి బొగ్గయింది. ఏం చేస్తుంది పార్వతి?

★ ★ ★

రాత్రి తొమ్మిది గంటలకు శంకర్ హెచ్.ఎమ్.వి. రేడియో పిక్ ఆపి గ్రామఫోనుతో దిగాడు. "ఎలక్ట్రీషియన్ వాటిని బిగించి" బాబి, నాగిన్ రికార్డుల పాటలు వినిపించాడు. పిల్లలంతా కేరింతలతో గంతులు వేస్తూ ఆడుకున్నారు. భోజనం అవగానే ఇక ఊరుకోలేక శంకర్ నాలుగిళ్ళ యివతలున్న తన స్నేహితుడ్ని తీసుకొచ్చి పాటలు వినమన్నాడు.

బొంబాయి స్వీట్లూ, మిక్చరు ప్లేట్లో తెచ్చాడు. "చాలా బాగుంది శంకర్ నీ సెట్టు, త్వరలో నేను కూడా వొకటి కొనాలి."

"కొనేయ్ మరి! ఇదిగో యిది కూడా నీకే" ఫ్రిజ్‌లోని కోకాకోలా టిన్నొకటి తెచ్చాడు.

"దీన్నెక్కడ సంపాదించావ్?" ఆనందంగా తాగుతూ అన్నాడు స్నేహితుడు. రాజు నెమ్మదిగా కోకాకోలా త్రాగుతున్న స్నేహితుడి ఎదురుగా నుంచుని "ఛీ! 'అక్కి!' నీవు అక్కి'! తాగుతున్నావు" అన్నాడు వంకరనవ్వు నవ్వుతూ!

కోకాకోలా త్రాగుతూనే 'ఏమిటి' అన్నట్లు చూసాడు స్నేహితుడు.

తటాలున తలుపు చాటున వున్న పార్వతి రాజుని జబ్బ పట్టుకొని అవతలి గదిలోకి లాక్కుపోయింది.

నీరుడుని వాడు తన భాషలో "అక్కి" అంటాడు.

ఎన్నో కొత్త పదాల్ని యీ విధంగా వాడు సృష్టించాడు. కోకాకోలా డబ్బాల్ని రెండు రోజుల క్రితం తెచ్చిన నాడు..."వాండీ! (నాన్నగార్ని షార్టుకట్) నాకూ

కావాలి కోకాకోలా" అడిగాడు. "ఛీ అది నీకు కాదురా! అది అక్క! నీవు త్రాగకూడదు" ఎక్కడ త్రాగేస్తాడో అని వాళ్ళ నాన్న అలా చెప్పాడు.

"ఏమిట్రా మీవాడంటున్నాడు?"

"అబ్బే ఏమీ లేదురా, వట్టి అల్లరి వెదవ. మరెప్పుడు కొంటావు ఈ పెట్టెని" మాట మార్చేసాడు శంకర్.

★ ★ ★

తెల్లవారింది, ఆరోజు ఆదివారం. తండ్రికి యిష్టమని హోటల్ నుండి పెసరట్టు ఉప్మా తెప్పించింది పార్వతి.

"అయ్యో! రాజు యింకా లేవలేదు. వాడొచ్చినా పెట్టొద్దు, వాడికి అరగదు" అని జాగ్రత్త చెప్పి వంట గదిలోకి వెళ్ళింది పార్వతి.

పది నిముషాలు కాలేదు. రాజు వంటగదిలోకి ప్రత్యక్షమయ్యాడు వంకర నవ్వుతో. "అమ్మ భడవ! ఏమో చేసేసాడు వీడు" అనుకునేలోగా.

"అమ్మా.... అమ్మా..." గట్టిగా పిలుస్తున్నాడు. తండ్రి కాఫీ గ్లాసు తీసుకొని, వెనకనే రాజు కూడా వచ్చాడు.

"వీడు చూసావా అమ్మా! వాసన వచ్చేసింది.. పరుగెట్టు కొచ్చేసాడు. వీడు అడిగితే పెట్టకుండా ఎలా వుంటాను? ప్లేటు తెచ్చుకో బాబు, నీకు కొంచెము యిస్తాను అన్నా, వీడేమన్నాడో తెలుసా."

నోరు తెరుచుకు వింటూ ఉంది పార్వతి.

"తొందరగా నోట్లో పెట్టరా మొద్దా! అని నన్ను గదమాయించేసాడమ్మా" తాత పగలబడి నవ్వు. రాజు వంకర నవ్వు! పార్వతికి నవ్వొచ్చింది. "వీడికి తెలివి తేటలు ఎక్కువైపోతున్నాయి" అనుకొంటూ భర్తకు కాఫీ యిచ్చేందుకు వెళ్ళిపోయింది.

ఆదివారం సాయంకాలం బీచ్ ప్రోగ్రాము. ముగ్గురు పిల్లలూ పార్వతితో రిక్షాలో తాపీగా బయలుదేరాడు శంకర్. రోడ్డుమీద రాజాగాడి రన్నింగ్ కామెంట్రీ "పంది పిల్లలివిగో, కుక్క పిల్లలవిగో" వేటిని చూసినా వాడికి ఆనందమే. తండ్రి మెడపట్టి లాగి -

...రోడ్డు ప్రక్కన పడివున్న టెలిఫోను స్తంభాన్ని చూపిస్తూ "వాండీకి పెద్ద థర్మామీటరదిగో" దాన్ని వీడు మొన్న జ్వరం వచ్చిననాడు డాక్టరుగారి దగ్గర

చూసాడు.

"ఓరి వెధవా! బాగానే పోల్చావే!"

"వాండి. కోకాకోలా కూస్తుంది" ఎక్కడో కోకిల కూస్తుంది. కోకాకోల అంటే వాడికి అంత అభిమానమేమో, కోకిలనలా పిలుస్తాడు. చాలా వరకు స్వచ్ఛంగానే పలుకుతాడు. వక్క సింహానికి తప్ప! సింహం అనమంటే మాత్రం సితిప్పం అంటాడు.

బీచ్ చేరేసరికి బాగా చల్లబడింది. సముద్రపుగాలి హోరుగా వస్తూంది. పిల్లలు గంతులేస్తూ, పరిగెడుతూ, చెడుగుడు ఆడుతూ, పూచిక పుల్లలతోను, నత్త గుల్లలతోనూ ఆడుతున్నారు. కుక్క పిల్లలతో పరుగెడుతున్న వారు కొంతమంది. పెద్దలు తీరికగా యిసుకలో కూర్చొని కబుర్లాడుతున్నారు. రెపరెపలాడే రంగు రంగుల పైటలతో తరుణులు, ఎన్నెన్నో ఫాషన్లు చేసుకొచ్చిన ప్రౌఢలు, అన్ని తరగతుల వారూ, అన్ని వయసుల వారూ ఎంతోమంది చేరారు.

బుడగలు, పల్లీలు, ఐస్‌క్రీమ్‌లు అమ్మేవాళ్ళు చుట్టూ తిరుగుతున్నారు. పార్వతి చిట్టితల్లిని ఎత్తుకుంది. చెంగు పట్టుకొని రమ, రాజుని గట్టిగా పట్టుకొని శంకర్ నురగలతో ఉవ్వెత్తుగా వస్తున్న అలల్ని చూస్తూ నెమ్మదిగా నడుస్తున్నాడు. మెరుపులాగా రాజు తండ్రి చేయిని విదిలించుకొని సముద్రం వైపు పరిగెట్టాడు. శంకర్ వెంటనే పరిగెట్టినా వాడిని అందుకోలేక పోయాడు.

అప్పుడే ముందుకు వచ్చిన 'అల' రాజుని చూస్తూండగానే క్రిందికి పడేసి లోపలికి లాక్కుపోయింది. నీళ్ళలో రాజు కనపడ లేదు.

శంకర్‌కు ఏమి చేయాలో తోచలేదు. నీళ్లలో ముందుకు నడవలేకపోయాడు. చతికిల బడిపోయాడు. చుట్టూ ఉన్న వారికి ఏమి జరిగిందో కూడా తెలియలేదు.

పది నిమిషాలు గడిచాయి. యాదృచ్ఛికంగా మరొక పెద్ద అల రాజుని దొర్లించుకుంటూ యిసుకలో వదిలి పోయింది. శంకర్ వాడిని పొడి యిసుకమీదకు తీసుకొచ్చి వెల్లకిలా పడుకోబెట్టి, పొట్ట నొక్కి ముక్కునుండి, నోటినుండి నీరు పోయేట్టు చేసాడు.

పది నిముషాలలో వూపిరి సలపడంతో రాజు కళ్ళు తెరిచి "నీళ్ళు ఉప్పుగా ఉన్నాయివాండీ" అన్నాడు వంకర నవ్వుతో.

వాడిని ఎత్తుకొని, గట్టిగా గుండెకద్దుకుని "ఎందుకురా వెధవా అలా వెళ్ళావు?" ఎదురుగా నీళ్లలో కెరింతలు కొడుతూ, ఈదుతున్న పల్లీల పిల్లల్ని చూపిస్తూ, "ఆ పిల్లలంతా నీళ్లలో ఆడుకుంటున్నారు. చూడండి". "నీవెప్పుడూ అలా వెళ్ళకూడదురా" ఏమనాలో తోచక. "నిన్ను బీచ్‌కు తీసుకొని రావటం నా బుద్ధి తక్కువ" లెంపలేసుకున్నాడు తండ్రి.

నిశ్చేష్టురాలై ఆనంద బాష్పాలు రాలుస్తున్న పార్వతి "యిక యింటికి పోదాం పదండి" అంది.

యింటికి దారి తీసారు.

☆ ☆ ★

మరుసటి రోజు ఉదయం "అమ్మా! వీడు రాత్రి పందెం వేసి చొక్కాకు పెట్టిన పిన్ను మింగేశాడు" వెక్కి వెక్కి ఏడుస్తూ రమ చెప్పింది.

రాత్రంతా చెబుదామంటే వాడు చెప్పనీయ లేదట. ఉదయం యిక ఉగ్గబెట్టుకోలేక చెప్పేసింది.

పార్వతి గుండెల్లో రైళ్ళు పరిగెట్టాయి. రాజును ఎత్తుకొని డాక్టర్ ప్రకాశరావు దగ్గరికి పరిగెత్తింది. వొక్కగా నొక్క కొడుకుని బ్రతికించమని ప్రాధేయపడింది. ఆయన వాడిని పరీక్షచేసి ఎక్సరేలు తీసి "విప్పుకొన్న పిన్ను చిన్న ప్రేగులలో ఉన్నది. దానికదే క్రిందికి రావచ్చు. ఎక్కడైనా గ్రుచ్చుకుపోతే మాత్రం యిరవై నాలుగు గంటలలో ఆపరేషను చేసి తీయాలి" అన్నాడు.

పార్వతికి ముచ్చెమటలు.

"కంగారు పడకండి, విరోచనం జారీగా అయ్యేందుకు మందిస్తున్నాము. రేపు ఉదయం పడిపోవచ్చు, జాగ్రత్తగా గమనించండి" డాక్టరు సముదాయించి పంపేడు.

పార్వతి ఎన్ని దేముళ్ళకు మొక్కుకుందో, ఏ దేముడో వరమిచ్చాడు. తెల్లవారేసరికి అది బైటపడింది.

వీడిని ఎలా భరించడం?

మరొక రోజు తెల్లవారింది. ఆ రోజు రమ స్కూలుకి సెలవు. ముగ్గురి పిల్లలకి స్నానాలు చేయించి డ్రాయింగు రూమ్‌లో ఆడుకోమని చాపలేసి బొమ్మల్ని ముందు వేసి పార్వతి వంట గదిలోకి వెళ్ళింది.

అరగంటలో రాజా వంట గదిలోకి ప్రత్యక్షమయ్యాడు, వంకర నవ్వుతో. "బాపురే! ఏమి చేసావురా రాజా!" డ్రాయింగు రూమ్‌లోకి వెళ్ళింది తల్లి.

నాన్న తెచ్చిన హెచ్.ఎమ్.వి. రికార్డు తాలూకు ఒక్కో భాగమూ విడి విడిగా పడి ఉన్నాయి. మూత వొకచోట, చక్రము వొకచోట, ముల్లుండే చేయి మరొకచోట.

రమ వెక్కి వెక్కి ఏడుస్తోంది.

"అమ్మా.... నేనూ.... గ్రామఫోను పెట్టడం వచ్చా?.. అని అడిగానమ్మా... అంతే, వీడు వీటినన్నిటినీ పీకేసాడమ్మా" రాగం తీసింది రమ.

పార్వతి రాజాగాడ్ని జబ్బ పట్టుకొని దొడ్లోకి తీసుకెళ్ళింది. సంపెంగ తీగను త్రెంచి రాజాగాడ్ని వీపుమీద వాయించింది.

"ఇంట్లోకి రాకు ఇక్కడే ఏడువు" వంట గదిలోకి పోయి వంట గాబరా గాబరాగా చేసింది.

కొంతసేపు పోయాక దొడ్లోకి వెళ్ళింది.

కళ్ళమ్మట నీరు కుక్కుకుంటూ ఉండుండి వెక్కివెక్కి ఏడుస్తున్న రాజాను చూసేసరికి ఆమెకు ఏడుపొచ్చింది. వాడ్ని దగ్గరకు తీసుకొని "నాన్నగార్కి ఏమని చెప్పనురా, గ్రామ ఫోనుని ఎన్ని ముక్కలు చేశావు?" అంటూ చొక్కా విప్పితీసి చూసింది. తాట తేలిన దెబ్బలు సున్నితమైన చర్మంమీద బాగా కనిపిస్తున్నాయి. లోపల భయంతో "రాజా! కొట్టానని తాతయ్యకి చెప్పకే" అంది. చెప్పనన్నట్లు తలూపాడు.

ఇంట్లోకి తీసుకెళ్ళి భోజనాలు పెట్టి, పిల్లల్నీ జోకొట్టి నిద్ర పుచ్చింది. ఆ రోజు శంకర్ మధ్యాహ్నం భోజనానికి ఎందుకో రాలేదు.

పార్వతి ఒక కునుకు దీసి లేచేసరికి సాయంకాలం అయిదు గంటలయింది. వేసవి కాలం పిల్లలకి సాయంకాలం కూడా స్నానం చేయించాలి.

రమకి చేయించి తుడిచి లోపల గౌను వేసుకోమని చెప్పి,

"రాజా రారా, నీకూ స్నానం చేయిస్తాను" అంది.

రాజాగాడు తాతయ్య మంచమెక్కి కబుర్లాడుతున్నాడు. "ఉండవయ్యా నీ చొక్కా నేను తీస్తాను" రెండు చేతులు పైకెత్తాడు. చొక్కా తీయించుకొని వెనక్కు తిరిగిన రాజా వీపు మీద దెబ్బలు తాతయ్య కంటబడ్డాయి.

"ఏమిటయ్యా నీ వీపు మీద యిన్ని దెబ్బలు" దగ్గరకు తీసుకొని వీపు నిమురుతూ అడిగాడు. రాజేమీ చెప్పలేదు. కానీ తాతయ్యకు అర్థమయ్యింది. భోరున ఏడ్వడం ప్రారంభించాడు, రాజు దుఃఖం ఆపుకోలేక.

గుమ్మం దగ్గర పార్వతీ గతుక్కుమంది. తనకు కూడా కళ్ళల్లో నీరొచ్చేసింది.

"అదికాదయ్యా, వీడు నన్ను చాలా విసిగించేస్తున్నాడు" రికార్డు ప్లేయర్ని ముక్కలుగా చేసాడని చెప్పింది.

"అబ్బాయికి నేను చెబుతాను లేమ్మా, అయినా వీడిని యింత గట్టిగా కొట్టకమ్మా" అని పార్వతికీ, "అమ్మని విసిగించకురా" అని వాడికీ చెప్పాడు.

ప్రక్క గదిలోకి వచ్చి పార్వతి కూడా, భోరున ఏడ్చింది.

★ ★ ★

పదిరోజులు గడిచేసరికి యిక పార్వతి ఒక నిర్ణయానికి వొచ్చేసింది. వీడ్ని యింట్లో భరించటం కష్టమని, అక్షరాభ్యాసం చేయించి, పలకా బలపం సంచిలో పెట్టి భుజానికి తగిలించి స్కూలులో మాట్లాడి "అక్కతో నీవు కూడా బళ్ళోకి పోరా బాబు" పంపింది ఆ రోజు.

"బళ్ళోకి వెళ్ళొస్తే చాక్లెట్లు, కోవా బిళ్ళలు కొనిస్తానని" బెల్లించి పంపేసరికి తల ప్రాణం తోకకి వచ్చింది.

పదిహేను నిముషాలలో అక్కా తమ్ముడు తిరిగి వచ్చేసారు.

"అమ్మా! వీడ్ని స్కూలుకి తీసుకెళ్ళటం నా తరం గాదు. వీడికె దారిలో కాళ్ళు లాగుతున్నాయట, చెమట పడుతుందట, స్కూలుకి రాడట."

"నా ఫస్టు పిరిడు పోయింది. ఇప్పుడు వెళితే మాష్టారు నన్ను కొడతారు" ఆ రోజు రమ స్కూలు పోయిందన్న మాట.

నాల్గు బాదుదామని వెళ్ళబోతున్న పార్వతికి 'వాడి నవ్వు' అడ్డం వొచ్చింది.

'ఇంకా మూడేళ్ళన్నా నిండలేదు గదమ్మా, అపుడే వాడికి స్కూలేమిటి, కొన్నాళ్ళు ఆడుకోనీ" గదిలో నుండి వాడి తాతయ్య వకాల్తా.

"మరి వీడిని యింట్లో భరించడం ఎలా?" అది పార్వతి సమస్య.

సాయంకాలం "అమ్మా" అంటూ రమ లోపలికి వచ్చింది. "రాజు ఏడి

రమా?'' అంది తల్లి.

"వీధి గుమ్మం దగ్గర కూర్చొని అల్లం మురబ్బా కావాలని ఏడుస్తున్నాడమ్మా.''

గుమ్మం దగ్గరకి వెళ్ళేసరికి అద్దాల పెట్టె తెరిచి చిన్న ముక్క యిస్తూ అమ్మా యీ చిన్నిముక్క అబ్బాయికి యివ్వనిండమ్మా" అన్నాడు అల్లం మురబ్బావాడు. "సరే అలాగే" లోపలికి వెళ్ళి రెండు రూపాయలు నోటు తెచ్చి యిస్తూ "ఎంతయిందో తీసుకో" అంది పార్వతీ. ఎంతచెప్పినా డబ్బు తీసుకోలేదు వాడు.

"వొద్దు తల్లీ! నన్ను వూరికే యివ్వనివ్వండి. నాకివ్వాలనిపించింది.

బాబు ముఖంలో మంచి వర్చస్సుంది. ఎంతో పెద్ద వాడౌతాడు తల్లీ, వాడి పెదాల మీద ఆ నవ్వు నేనెక్కడా చూడలేదు తల్లీ.''

ఆ రోజు రాత్రి పార్వతి పిల్లలు ముగ్గుర్నీ పెరట్లో మంచం మీద వేసుకొని కథలు చెపుతూ ఉంది.

రాజు ఆకాశం వైపు తదేకంగా చూస్తూ "అమ్మా ఆ నక్షత్రం యేమిటి?'' అన్నాడు. వీడికెప్పుడూ అటువంటి ప్రశ్నలే.

"అది ధ్రువ నక్షత్రం బాబు.''

ఆ చల్లగాలికి పిల్లలంతా నిద్రపోయారు.

అల్లం మురబ్బా వాడి మాటలు గుర్తుకొస్తున్నాయి పార్వతికి.

"బాబు ముఖంలో మంచి వర్చస్సుంది. ఎంతో పెద్దవాడౌతాడు బాబు, వాడి పెదాలమీద నవ్వు.....''

వీళ్ళంతా ఎప్పుడు పెద్ద వాళ్ళవుతారు. త్వరగా అయిపోతే బాగుండును.

వెన్నెల కాంతిలో రాజు ముఖం, తదేకంగా.... తన చూపే వాడికి ఎక్కడ దిష్టి కొడుతుందో ననుకుంటూ.... చూస్తోంది.

వాడు అమాయకంగా నవ్వుతున్నాడు.... నిద్రలోనే!

*(వల్లకి.. విసూత్న వారపత్రిక 21-4-93 పే 44-47)*

5

# అలారంపీసులో అల్లావుద్దీన్

"ఒక సిగరెట్టు ఇలా పడేయండి సార్"

బసవయ్య సాయంకాలం ఆరు ఏడు గంటల మధ్య పాలెపు అప్పారావు వాచ్‌హౌస్‌కి రావటం రివాజే. ఎందుకో అలా అలవాటై పోయింది.

"ఏమిటి ఈరోజు దూకుడుగా వున్నావు?"

అప్పారావుగారు సిగరెట్టు, దానితోపాటు అగ్గిపెట్టే కూడా ఇచ్చాడు.

సిగరెట్టు అంటించి అగ్గిపెట్టి తిరిగి ఇచ్చేస్తూ, "ఏం చేయమంటారు సార్! ఇన్‌స్పెక్టరుగారి దగ్గర పనిచేయటం కంటే అడుక్కుతింటే సరిపోద్ది".

"మొన్న ఆదివారం ఆ సోంబాబు మంగళారప్పేటలో కిరాణాకొట్టు తెరిచేసి బాబు సామ్ములాగ అమ్మేస్తున్నాడు. నేను చూసాను. నేను లేబరాఫీసు జవాన్నే గదా! ఆడికో జూకానోటీసియ్యండయ్యగారూ అంటే యీయడే యీయన!"

"జూకానోటీసేమిటయ్యా బాబు"

"అదేనండీ కారణం చూపు అంటాం అది"

"షోకాజ్ నోటీసా! నీ ఇల్లు బంగారంగాను"

"ఆడేదో కక్కుర్తి పడ్డాడు లేవయ్యా. మనం వెళ్ళి చెబుదాంలే అంటాడేగాని కాగితం మీదపెట్టడు. కాగితాలు రాసి ఆళ్లని బెదర గొడితేగాని ఆళ్ళు మనకి లొంగుతారా!

మరీ మెతక బాబు. అందరికీ ఈయన ధర్మాత్ముడే."

"అవును బసవయ్యా మీ ఇన్‌స్పెక్టరు చాలా మంచోడయ్యా."

"ఆ! అలాగైతే మరి మాలాంటోళ్ళు ఎలా బతుకుతారండీ?"

"బి" వార్డులో లక్ష్మీనారాయణ ఇన్‌స్పెక్టర్ని చూడండి. లేబర్ ఇన్‌స్పెక్టర్ అంటే అలా ఉండాలి. అటు పనోళ్ళని ఇటు షావుకార్లని ఏమి ఆటకాయించేస్తాడండీ!"

"ఆయన కర్కోటకుడురా బాబూ!"

"ఆయన దగ్గర జవాను సూర్యంని చూడండి. పెళ్లానికి ఎన్ని చీరలో! నగలో! డాబా కట్టించాడు. విక్కీబండి కొన్నాడు." చాలా అసూయతో అన్నాడు.

"అటువంటి సంపాదన ఎక్కడ నిలుస్తది లేవయ్యా!"

"ఆ..... మీరు మరీ చెపుతారు. ఆళ్ళు సుఖంగా లేరటండీ!"

"సరేగాని ఇదిగో నీ రిష్టువాచే టంచనుగా తిరుగుతుంది. ఓవరాయిలింగు కూడా చేసా. బఫింగ్ చేసా, చూడు, కొత్తదిగా కనుపించడం లేదూ!"

అటూ ఇటూ చూసుకొని పళ్ళికిలించి "థాంక్యు అయ్యగారు. రేపొస్తానండి." పోలీసు సాల్యూట్‌చేసి తరువాత మజిలీ కొత్తపేటసందు చేరాడు బసవయ్య.

★ ★ ★

"ఏందే జగదాంబా ఏంకూరొండావు?"

"వస్తున్నా మావా" కాళ్ళు కడుక్కొనేందుకు నీళ్లిచ్చింది.

"నీ సంపాదనకి రోజూ పులసల కూరెక్కడొండను? ఏదో వున్నదే వండాను."

"ఏందే లంజా! కూస్తున్నావు? నా సంపాదనకేంటే?" కొట్టేందుకన్నంత పోర్సులో కొచ్చేసాడు.

"నన్ను లంజంటే ఊరుకోను. ఇంకేమన్నా పడతాను. నేనెపుడు లంజరికం చేసానురా? జాగ్రత్తగా రానీ మాటలు! నోటికొచ్చినట్లల్లా రానీమాక."

జగదాంబ రెచ్చిపోయే సరికి బసవయ్య తగ్గాడు.

"ఈ రోజు ఉల్లిపాయ పులుసు తింటే తిను లేకపోతే మానీ."

గొణుక్కుంటూ చిరాగ్గా "తువ్వాలియ్యవే లచ్చే" టెన్తుక్లాసు పరీక్షకు గుడ్డి దీపం ముందు చదువుతున్న కూతుర్ని ఉద్దేశించి.

లక్ష్మి త్వరగా రాలేదు. "ఎంతసేపే తువ్వాలు తేడానికి?" తెచ్చిన తువ్వాల్ని లాక్కుంటూ ఒకటి అంటించాడు.

ఈ గొడవకి చదువుకి యిక కుదరదనుకొంటూ ఏడుస్తూ రోజూలానే పడుకుంది లక్ష్మి. "చాతగాని మొగాడు పిల్లని కొట్టుకుంటున్నాడు" జగదాంబ యీసడించింది.

"పిల్లనెందుకులా బాత్తావు? లాగుబోతాడా! రాత్రిళ్ళు దాన్ని చదవనీయవు. తెల్లారి లేద్దామనుకుంటే దానికి ఒక అలారం గడియారం కూడా కొనలేవు! ఏం బ్రతుకురా నీది.."

నాలుగు మెతుకులు తిని ప్రక్కమీద నడుంవాల్చాడు. మత్తు కొంచెం విడుస్తున్నట్లుంది. ఎక్కెక్కి ఏడ్చే లక్ష్మి నిద్రపోయింది. "అనవసరంగా పిల్లని కొట్టానే!" అనుకొన్నాడు.

ఇంట్లో అన్నీ చక్క బెట్టుకొచ్చింది జగదాంబ. "ఏందే అస్తమానం పనే నీకు! పిల్లలు నిద్రోయారు గందా! రా" నెమ్మదిగా జగదాంబను పక్కలోకి తీసుకున్నాడు బసవయ్య.

★ ★ ★

తెల్లవారింది. పనులన్నీ మళ్ళీ మామూలే.

ఏడుగంటలకల్లా అమ్మగార్కి కనబడి బజారు పనిచేసి పది గంటలకల్లా ఆఫీసు కెళ్ళాడు బసవయ్య.

ఆరోజు బజారు ఇన్‌స్పెక్షన్. డవాలేసుకొని ఫైళ్ళు బట్టుకొని అయ్యగారితో బయలుదేరాడు బసవయ్య. నాల్గు కొట్లాయాక సూపర్ బజారు వచ్చింది. లోపల కూర్చొని రిజిష్టర్లను తనిఖీ చేస్తున్నారు ఇన్‌స్పెక్టరుగారు. బైటకొచ్చి సిగరెట్టు ఎలిగించాడు బసవయ్య. అలా చూస్తుంటే అద్దంలోంచి అలారం టైంపీసులు కనిపించాయి.

లక్ష్మికి గడియారం కొనాలి. సిగరెట్టు నేలమీద పడేసి కాలితో రాసి నలిపి లోపలకి వెళ్ళాడు.

"ఆ గడియారం గంటలు కొట్టేదేనా! ఎంత బాబూ!" అడిగాడు.

తీసి చూపిస్తూ "ఇది పాన్ కంపెనీది. చాలా మంచిది. నూట నలభై" చూపించాడు కుర్రోడు.

"అమ్మనీయమ్మ అంత ఖరీదే!" ఇంక రెండు మూడు చూపుతూ అడిగాడు. అన్నీ 150-200 మధ్య ఖరీదులు.

"ఇప్పుడప్పుడే కొనలేము గడియారాన్ని" అనుకుంటూ బైటకొచ్చే బోయాడు బసవయ్య. కౌంటరు కుర్రాడు "ఇది చూడు రెండు సంవత్సరాలుగా యిక్కడే పడి వుంది. స్మగుల్డు ఆర్టికల్. నాసి లోన మిషనుందో లేదో చెప్పలేము."

చేతిలో తీసుకొని ఆడించాడు. గలగల్లాడింది.

"ఇక్కడ దానిని విప్పడానికి వీలులేదు. నీకెవరైన వాచి రిపేరర్ వుంటే తీసుకెళ్ళి బాగు చేయించుకో"

'ఎంతేంటి బాబు?'

"నలభై రూపాయలు. ఇందులో మిషన్ లేకపోతే మాది బాధ్యత గాదు. నీ కిష్టమైతే తీసుకెళ్ళు".

"వద్దులే బాబు! బొమ్మల కొలువెట్టుకోవాలి మాపిల్ల. దానికి గంటలు కొట్టేది కావాలి".

బయటకొచ్చేసాడు బసవయ్య. అయ్యగారు యింకా ఏమిటో పుస్తకాలు చూస్తున్నారు. మేనేజరు ఏమిటో చెపుతున్నాడు.

బసవయ్య బుర్రలో ఆలోచన మెదిలింది. అపరాలు తెద్దామనుకున్న నలభై రూపాయలు జేబులో వున్నాయి.

లోపలికెళ్ళి "ఆ గడియారం ఇవ్వండి బాబు". నలభై ఇచ్చి బిల్లు తీసుకొని మరీ తీసుకున్నాడు.

అయ్యగారు బైటికి వచ్చేస్తున్నారు. గబగబా వెళ్ళి ఫైల్సు తీసుకొని ఇక ఇళ్ళ కొచ్చేసారు.

★ ★ ★

సాయంకాలం 7 గంటలకి బసవయ్య "సిగరెట్టు సార్!" అంటూ పాలెపు అప్పారావు గారి కొట్టుకి చేరాడు.

"సార్, దీన్ని కాస్త చూడండి, మా లక్ష్మికి తెల్లారిగట్ల లేచేందుకు అల్లారం గడియారం కొనమంటే కొన్నాను."

డొక్కు తీసుకొని అల్లల్లాడిస్తూ "ఇదెక్కడ దొరికిందిరా బాబు నీకు అల్లాఉద్దీన్ మాయాదీపంలాగ.. ఇందులో ఏం రాళ్ళే రప్పలో!"

"నీవిక్కడే ఉండు బాబు, నీ ఎదురుగా తీసి చూపిస్తా. మిషను తీసేసి రాళ్ళేసానంటావు. మిషనేమన్నా వుంటే బాగు చేస్తాను మరి."

"బాబూ! ఈ రోజుకి టైమయిపోయింది. రేపొస్తాను. మీదగ్గరే ఉంచండి! రేపు చూద్దురుగాని."

మరి టంచనుగా ప్రభుత్వ సారా దుకాణంకి వెళ్ళి పోయాడు బసవయ్య.

మరునాడు 7 గంటలకి మళ్ళీ "సిగరెట్టు సార్" చేరాడు పాలెపు అప్పారావు కొట్టుకి.

"ఏకాస్త మిషనున్నా మిగిలింది కాస్త వేసేయండి బాబు." ప్రాధేయపడ్డాడు అప్పారావుగారు డొక్కుని విప్పుతుంటే.

అప్పారావుగారు మళ్ళీ హెచ్చరించారు. ''బసవయ్యా ఇందులో ఏ రాళ్ళున్నా నీదే, నాదేమీ బాధ్యత లేదు."

"అలాగే బాబు! లేకపోతే లక్ష్మి బొమ్మల కొలువులో ఎట్టుకుంటాది."

నెమ్మదిగా టైంపీసును విప్పారు అప్పారావు గారు.

అందులో ఇరవై మెరుస్తున్న సీకో రిస్టులు కనుపించగానే ఎగిరి గంతేసాడు బసవయ్య - సంతోషంగా.

*(తెలుగు విద్యార్థి మాసపత్రిక మే' 1993 పే.33-34)*



కోనసీమ కోడెగాడు 1979 ప్రణవమూర్తి

6

# హృదయంకోసం లిటిగేషన్

హడావిడిగా రాజు అడిషినల్ మునిసిఫ్ కోర్టు చేసేసరికి 11 గంటలయింది.

బ్రిటిష్ కాలపు రాతి కట్టడం అయిదెకరాల కాంపౌండులో చుట్టూ వరండాలతో ముందు పొడవైన హాల్. హాల్‌లో గుండ్రటి బల్ల చుట్టూ నల్లకోట్లు, గౌన్లు వేసుకొన్న 20 మంది ప్లీడర్లు కూర్చున్నారు. వారి వెనుక ప్లీడరు గుమాస్తాలు దొంతర్లకొద్దీ దస్త్రర్లను మోసుకొస్తూ వారి వారి ప్లీడర్ల చెవిలో ఏవో గుసగుస లాడుతున్నారు. ఖద్దరు చొక్కా, పంచెలు కట్టుకొన్న మనుష్యు లెక్కువగా ఉన్నారు. కొందరు గోడకానుకొని ఉన్న బెంచీలమీద కూర్చున్నారు. హాలంతా రణగొణ ధ్వనులతో నిండిపోయింది.

ఈ ఏర్పాటు వెనుక ఎర్రగుడ్డ పిట్టగోడలా ఉన్న స్టేజిమీద జడ్జిగారి సింహాసనం లాంటి కుర్చీ ఉంది. దాని వెనుక మూడు సింహాలు ఉన్న ఇత్తడి పళ్ళెం గోడమీద ఉంది. వాతావరణం క్రొత్తగా ఉంది రాజుకి.

కప్పగంతుల లక్ష్మీవతిగారు కనబడగానే హమ్మయ్య అనుకొని 'నమస్కారం! ప్లీడరుగారు' అన్నాడు రాజు. "ఏమిటో సమన్లట, దీన్ని చూడండి సార్" కాగితం అందించాడు. అటూ ఇటూ చూసి "నే చెపుతాను కంగారు పడకండి. సివిల్ సూట్. అలా కూర్చోండి."

బుర్రగోక్కుంటూ కూర్చున్నాడు రాజు బల్లమీద. ఒకరి తరువాత ఒకరు ఆ బల్లమీద కొస్తూ, 'కొంచెం అలా జరగండి' అంటూ రాజుని బల్లకి ఒక మూలకి తోసేశారు.

ఇంతలో 'సైలెన్సు ప్లీజ్' అంటూ బంట్రోతు అరిచాడు. స్టేజి ముందు

బల్లమట్టా, ఫైల్సుతో కోర్టు గుమస్తాలు చేరారు. హాలులో అందరూ లేచి నిలుచొని నమస్కారం చేశారు. స్టేజి ప్రక్క తెరిచిఉన్న తలుపుల్లోనుండి జడ్జిగారు నల్లగౌన్లో వచ్చి సభకి నమస్కారం చేసి కూర్చున్నారు. అందరూ నిశ్శబ్దంగా కూర్చున్నారు.

స్టేజి ముందు గుమస్తా లేచి ఒక్కో ఫైలు తీస్తూ అరుస్తున్నాడు.

"ఓ యస్ 2 బై 206 యమ్ యస్ కె ఫర్ ట్రయల్"

పొట్టిగా, లావుగా, పొట్టంతా పైకుండి దానిక్రిందగా ఉన్న పేంటు, నల్లకోటు గౌనుతో ఒక ప్లీడరు లేచాడు... కుడి భుజం పైకి క్రిందికి ఆడిస్తూ, (అలవాటు కాబోలు).

"నాట్ రెడీ యువరానర్. మాక్లయింట్‌కి ఒంట్లో బాగుండలేదు. మెడికల్ సర్టిఫికెట్ ఇచ్చారు యువర్ ఆనర్"

బంట్రోతు దానిని అందుకొని జడ్జిగారి ముందు పెట్టాడు. దానిమీద ఆయన వ్రాసిన దానిని అందుకొని గుమస్తా "పోస్టెడ్ ఆఫ్టర్ ఫిఫ్టీన్ డేస్.. ఆన్ జూన్ 16"

"థాంక్సు యువరానర్" ప్లీడరు గారు కూర్చొన్నారు.

మళ్ళీ గుమస్తా "ఓ యస్ నంబర్ టెన్ బై వన్ నాట్ ఫోర్ ఫర్ ట్రయల్ పి.యస్.యన్. అండ్ యం.యస్.ఆర్"

ఇద్దరు ప్లీడర్లు లేచి "రెడీ యువరానర్" ముక్తకంఠంతో చెప్పారు.

గుమస్తా చెప్తే అందుకొని బంట్రోతు "పిల్లి సత్యనారాయణ! పిల్లి సత్యన్నారాయణ! పిల్లి సత్యన్నారాయణ!" ముమ్మారు అరిచాడు.

ఆరడుగుల ధృఢమైన 30 ఏండ్ల యువకుడు జులపాలు, గెడ్డం పెంచుకొని తెల్ల పేంటు మీద ఎర్ర చొక్కా టక్కు చేసుకొని సాఫీగా బోను ఎక్కాడు.

బంట్రోతు 'దేవుని ఎదుట ప్రమాణం చేసి నిజమే చెపుతాను అబద్దం చెప్పను' అని అతనిచేత ప్రమాణం చేయించాడు.

ఇద్దరిలో ఒక సన్నపాటి సీనియరు ప్లీడరు "మీ పేరు?" అడిగాడు.

"పిల్లి సత్యన్నారాయణ"

"మీ భార్యపేరు?"

"పిల్లి సావిత్రి"

"మీ పెళ్ళెపుడు జరిగింది"

"జూన్ పదహారు 1969"

"ఎన్నాళ్ళు కాపురం చేశారు?"

"రెండు నెలలు"

"తరువాత ఏమైంది?"

"కైకలూరు పుట్టింటికని వెళ్ళింది. అక్కడినుంచి శ్రీరామచంద్రమూర్తి అనే అతనితో లేచిపోయింది"

"ఆవిడతో మళ్ళీ కాపురం చేస్తారా?"

"నేనుండను. నాకు విడాకులు ఇప్పించండి"

"మీరిక వెళ్ళవచ్చు."

నమస్కారం చేసి బోను దిగిపోయాడు.

"పిల్లి సావిత్రి! పిల్లి సావిత్రి! పిల్లి సావిత్రి" మళ్ళీ ముమ్మారు అరిచాడు బంట్రోతు.

ఇరవై ఐదేళ్ళ సావిత్రి ధైర్యంగా బోనెక్కింది. ప్రమాణం అయిన తరువాత అదే ప్లీడరు ఆవిడని ప్రశ్నిస్తున్నాడు.

ఏమడుగుతాడా! ఏమని జవాబిస్తుందా! అని రాజా శ్రద్ధగా వింటున్నాడు.

"మీ పూర్తి పేరు?"

"పిల్లి సావిత్రి"

"మీకు సత్యన్నారాయణకి పెళ్ళయిందా?"

"అయిందండి"

"ఎన్నాళ్ళు కాపురం చేశారు?"

"రెండు నెలలు"

"మీకు మీ భర్తతో కాపురం చేయటం ఇష్టం లేదా?"

"ఇష్టం లేదు" ఖచ్చితంగా చెప్పింది.

తన భార్య పార్వతి కూడ బోనెక్కి నలుగురిలో తన గురించి పిచ్చి

విడిచి ఇలాగే చెప్పేస్తుందా? కడుపులో చేయి పెట్టి దేవినట్లయింది రాజుకి.

ఆవిడను ప్లీడరు ఇంకేమీ అడగలేదు.

"సరే మీరిక వెళ్ళవచ్చు."

సావిత్రి బోను దిగిపోయింది.

జడ్జి "మరొక సంవత్సరం టైమ్ కావాలా?"

ప్లీడరు "లేదు యువరానర్! ఇద్దరూ ఇష్టపడి విడిపోతున్నారు."

జడ్జి "సరే. ఆర్డర్స్ టుమారో. నెక్స్టట్".

గుమస్తా మళ్ళీ 'ఒ.యస్. ఫోర్ బై త్రీ నాట్ సిక్స్, సెవెంటీ సిక్స్ డి2 ఫర్ ట్రయల్" అరిచాడు.

క్రూరమైన చూపులతో తలనెరిసిన స్థూలకాయుడైన ఒక ప్లీడరు లేచి, "అయామ్ రెడీ యువరానర్" అన్నాడు.

వెంటనే రాజు ప్లీడరు లక్ష్మీపతి కూడ లేచి "ఐ యామ్ ఫర్ డి2 యువరానర్. ఐ నీడ్ టైమ్ యువరానర్" అన్నాడు.

జడ్జిగారి నుంచి కాగితాలు తీసుకొని గుమస్తా "కేస్ పోస్టెడ్ టుమారో ఫర్ ట్రయల్" అరిచాడు.

"రాజుగారు విడాకులిచ్చినావిడ భరణంకోసం వేసిన కేస్ అది. వివరాలు సేకరించాలి. రేపు ఉదయం ఇక్కడికే త్వరగా రండి" బైటకు తీసుకొచ్చేసి రాజుతో చెప్పేసి మరో కేసుందని హడావిడిగా వెళ్ళిపోయారు కప్పగంతుల లక్ష్మీపతి.

విడాకులు అన్నమాట తన నోటమ్మట ఎప్పుడూ రానేలేదు.

పార్వతి ఎంతకు తెగించింది? ఎంత క్రూరమైన మనిషి? నాతో ఉంటూ ఎంత నాటకమాడుతోంది? కోపం అణచుకోలేక పోతున్నాడు. రాజా తల దిమ్మెత్తి పోయింది. గుండెల్లో గుబులు బయలు దేరింది. చిరు చెమట్లు పోశాయి.

ఇంటికి రాగానే పార్వతి నవ్వుతూ తలుపు తీసింది. 'భోజనానికి రండి' అంటున్న పార్వతిని తీక్షణంగా చాలా సేపు కన్నార్పకుండా చూశాడు.

"ఒంట్లో బాగుండలేదాండీ?"

ఎంత నంగనాచి? ఏమీ తెలియనట్లు ఎలా నటిస్తోందో! గుండెల్లో అగ్నిగోళాన్ని అణచుకుంటూ "బాగోలేదు" పక్కమీద కెళ్ళి ముసుగేసుకొని పడుకున్నాడు. ఒకప్రక్క ఏడుపు కూడా వస్తోంది.

★ ★ ★

తనకి, రాధకీ అక్రమ సంబంధం ఉన్నదని తెలిసిననాడు పార్వతి చాలా గొడవచేసింది.

అసలు రాధ బాధలన్నీ తన అక్కకే చెప్పేది. పార్వతి ద్వారానే విషయాలు తనకి తెలిసేవి.

మర్యాదకోసమో మరేమో రాధ రాజు ముందుకొచ్చి మాట్లాడేది కాదు. భర్త రైల్వేలో టిక్కెట్ కలెక్టరు. ఆగ్రా దగ్గర 1974లో జరిగిన రైలు ప్రమాదంలో చనిపోయాడు. రాధ గుడివాడ తల్లిదండ్రుల దగ్గరకొచ్చి రెండేళ్ళయింది. శ్రీనివాస టాకీసు దగ్గర వాళ్ళ ఇల్లు.

రాజు అదే ఊరిలో మెడికల్ షాపు పెట్టుకొని, జాగ్రత్తగా సంపాదించుకొని నాల్గు సంవత్సరముల క్రితం కలక్టరాఫీసు వెనుక పాటి మీద వీర రాఘవపురంలో ఒక పాత ఇల్లు కొనుక్కొని అంచెలంచెలుగా రిపెయిర్ చేయించి ఈ మధ్యే కాస్త స్థిరపడ్డాడు.

ఆనాడు మధ్యాహ్నం భోజనాల తరువాత పార్వతి పిల్లలతో బట్టలు కొనుక్కోవటానికి ప్రక్కింటావిడతో బజారుకెళ్ళింది. ఇంట్లో మరెవ్వరూ లేరు. 'అక్కేది' అంటూ రాధ డ్రాయింగు రూమ్‌లోకి వచ్చింది.

"బజారు కెళ్ళింది, వచ్చేస్తుంది కూర్చో"

బిడియపడుతూనే, ఎదురుగా సోఫాలో కూర్చొని వారపత్రిక తిరగేస్తోంది.

'ఎలా ఉన్నావు రాధా?' ఇంతవరకు అంతగా మాట్లాడిందే లేదు తనతో.

'ఏం చెప్పను బావా! ఏం చేయను నేను' దుఃఖం ఆపుకోలేక పోయింది రాధ. వాళ్ళ కుటుంబాలలో ఆడది మళ్ళీ పెళ్ళి చేసుకోవటం లేదు.

ఓదార్పుగా దగ్గరకెళ్ళి తల నిమురుతూ అప్రయత్నంగా "నేనంటే ఇష్టమా" రాజు అడిగాడు. అవునంటూ తలూపి బావని గట్టిగా కౌగిలించుకుంది. విడదీయలేని బంధమేదో అన్నట్లు వాళ్ళ శరీరాలు ఏకమైనాయి.

"నీవంటే నీ అక్కకి అపరిమితమైన ప్రేమ, వాత్సల్యం. నీ అక్కని ఒప్పించే బాధ్యత నాది. నిన్ను రెండో భార్యగా చేసుకొంటాను! నీ బాధ్యతలు నావి." భరోసా ఇచ్చాడు రాజు.

"అక్క ఒప్పుకొంటుందా? నీదే భారం బావా"

"సమయం చూసి నెమ్మదిగా చెపుతాను! నీవేమీ గాబరా పడకు. నీవుమాత్రం ధైర్యంగా ఉండాలి సుమా!"

పూర్తి విశ్వాసంతో బావ ఒడిలో ఇమిడిపోయింది రాధ.

"ఒకసారి చెపితే పార్వతి ఒప్పుకోలేదు. నెమ్మదిగా ఈ విషయాన్ని చెప్పి వొప్పించాలి. నామాట ఏనాడు కాదనదు నాభార్య." ఈ నమ్మకం రాజుకుంది.

తన చెల్లెలితో తన భర్త ఇంతవరకు లేని చనువును గ్రహిస్తూనే ఉంది పార్వతి. ఈ విషయాలలో ఆడవాళ్ళు చాలా ఆరితేరిన వాళ్ళు.

రోజు రోజుకి వారిద్దరి మధ్య గొడవ పెరుగుతూనే ఉంది.

ఒకనాడు "అవును, నాకూ, రాధకీ శారీరక సంబంధం ఉంది. అది నీ తోబుట్టువు. దాన్ని నీవు కాపాడాలి. దాని బ్రతుకు కూడా నాతోనే. మీ ఇద్దర్నీ నా రెండు కళ్ళుగా చూసుకొంటాను" ఎంతో ప్రాధేయ పడ్డాడు రాజు.

"నేను నీతో పదేళ్ళు కాపురం చేశాను. నీ పిల్లల్ని కన్నాను. మనసా వాచా కర్మణా నిన్నే నమ్ముకున్నాను. నాకు సవతిని తెచ్చే అధికారం నీకెక్కడిది?"

"అది నీ చెల్లెలు. అనవసరంగా దాని బ్రతుకు బజారుపాలు చేయకు."

"అది నా చెల్లెలైనా సరే! నా భర్తను దానికి పంచను. దాన్ని చంపేస్తాను.'

రోజూ ఏదో గొడవ ఉంటూనే ఉంది. ఒకనాడు మెళ్ళో తాళిబొట్టు తీసి విసిరేసింది. "దీనికేమిటి విలువ?" అంటూ.

మరొకనాడు "నేను కాలవలో దూకుతా"

ఇంకొకనాడు "పిల్లలికి ఇంత ఎండ్రిన్ ఇచ్చి నేనింత త్రాగి ఛస్తాను. నీవెళ్ళి ఆ రంకులాడితోనే ఉండు"

"నేను కూడా నీకులాగ మరెవడినన్నా నా ఆనందంకోసం చూసుకోలేనా?"

"నీలాటి మోసగాడితో నేను బ్రతకను. నాకు విడాకు లిచ్చేయి."

ఎంతకు తెగించింది పార్వతి! ఇన్ని సంవత్సరాలుగా పార్వతిని ఎంత ప్రేమగా చూశాడు రాజు? తన ఆనందంకోసం తన చెల్లెలి దీనావస్థను చూసి పార్వతి ఈ మాత్రం త్యాగం చేయలేదా! పార్వతి మనస్తత్వం అర్థంగాలేదు రాజుకి.

మరెంత మందితో చెప్పిందో! తండ్రితో కూడ చెప్పేసింది చెల్లెలి నిర్వాకమంతా.

తండ్రి రాధని మందలించాడు. రాధ రాకపోకలు ఆగిపోయాయి. రాధ "బావతో నాకెటువంటి సంబంధం లే"దని నలుగురిలో అబద్ధమాడింది.

★ ★ ★

రాజుకి రాత్రంతా కలత నిద్రలో ఉండి తెల్లారి మెలకువ వచ్చేసరికి 7 గం. అయింది. అరగంటలో తయారయి బైటగేటు దగ్గర కొచ్చేసరికి పార్వతి మంచి చీర కట్టుకొని రోడ్డుమీద వచ్చే పోయే వాళ్ళని చూస్తూ నించుంది. చప్పుడు చేయకుండా వెనుక నించున్నాడు రాజు.

పార్వతి ఏనాడూ ఇలా పది సెకండ్లు రోడ్డువైపు చూడ్డం ఎరుగడు రాజు. అరగంట పైగా అలానే చూసింది. ఉలిక్కిపడి వెనక్కు తిరిగిన పార్వతి "రిక్షా కోసం చూస్తున్నాను! బజారు వెళ్ళాలి" అంది.

"నేను కూడా నీకులాగ మరెవడినన్నా నా ఆనందం కోసం చూసుకోలేనా... ... నాకు విడాకులిచ్చేయి" పార్వతి మాటలు బుర్రలో సమ్మెట పోట్లనిపించాయి.

"ఎంతకు తెగించింది పార్వతి? ఇప్పుడు విడాకులు కావాలి! భరణం కావాలా! కోర్టులోనే తేల్చుకుంటాను." కోపాన్ని అణుచుకుంటూ మాట్లాడకుండా కోర్టుకి స్కూటరుమీద వచ్చేశాడు రాజు.

పార్వతి కోర్టులో ఎక్కడైనా కనబడుతుందా! అని వెతికాడు. ఎక్కడా కనబడలేదు.

10 గంటలకల్లా కప్పగంతుల లక్ష్మీపతిగారు నవ్వుకుంటూ వచ్చారు.

ఎంతలోకువైపోయాను లోకం దృష్టిలో అనుకున్నాడు రాజు.

"ఈ గొడవకి పరిష్కారం ఏమిటి సార్?"

"మిమ్మల్ని పెళ్ళి చేసుకోకుండానే మిమ్మల్ని విడాకుల భరణం అడుగుతుంది."

"అదేమిటి! నాకు పెళ్ళయింది. పది సంవత్సరాలైంది. ఇద్దరు పిల్లలు కూడా సార్."

"మీ ఆవిడ గాదయా బాబూ! మీమీద కేసు వేసింది."

"మరి"

"మీరు పాటి మీద ఇల్లు కొన్నారా? ఎవరి దగ్గర?"

"కంభంపాటి శాంతకుమారి అమ్మింది"

"ఆవిడకు భర్త ఉన్నాడా?"

"లేడు! పది సంవత్సరాల క్రితం చనిపోతే మిగిలిన ఆస్తితో ఈ ఇల్లుకూడా ఆవిడకు వచ్చింది."

"ఆవిడకు పిల్లలెంతమంది?"

"ఒక్కడే కొడుకు, సూర్యారావు. జులాయిగా తిరుగుతాడంటారు."

"అతనికి పెళ్ళైందా?"

"అయినట్లుంది! నాకు తెలియదు."

"అతనికి పెళ్ళయింది. రెండు నెలలు ఆవిడతో కాపురం చేసి విడిపోయారు. ఆవిడ మీమీద భరణం కోసం కేసు వేసింది."

"ఇదేమిటి ఆవిడకూ నాకూ సంబంధం ఏమిటి? భరణం కావలిస్తే ఆవిడ భర్తమీద కేసు వేసుకొంటుంది. నామీదేమిటి?"

"మీరు కొనుక్కున్న ఇంట్లో ఆవిడకు భాగం వస్తుందని"

"ప్లీడరుగారూ! ఆకుర్రాడికి ఈ ఆస్తిలో భాగం ఏమీ లేదు. ఎనిమిదేళ్ళ క్రితం తల్లి దగ్గర నలభైవేలు తీసుకొని, హక్కు విడుదల పత్రాలు వ్రాసుకున్నారు. ఆ పత్రాలు జాగ్రత్త కోసం నా దగ్గరే పెట్టుకొన్నాడు. అతనికి ఈ ఆస్తితో సంబంధం లేదు. అతని భార్యకి అంతకంటే హక్కులేదు."

"మరింకా మాట్లాడతారేమిటండి? ఆ కాగితాలు ఇల్లు రిజిస్ట్రేషను కాగితాలు నాకు వెంటనే పంపండి! ఈరోజు వాయిదా అడుగుతా."

ఆ సాయంత్రమే ఆ కాగితాన్ని ప్లీడరుగారికి అందజేశాడు రాజు.

వారం రోజుల తరువాత వాయిదాలో కోర్టులో గుమస్తా మళ్ళీ "ఓ.యస్ ఫోర్ బై త్రి నాట్ సిక్స్, సెవెంటీ సిక్స్ డి టూ పర్ ట్రయల్, కె.యల్.పి. జె.ఎస్.ఎమ్" అరిచాడు.

బంట్రోతు ముమ్మారు పిలిచాడు. సూర్యారావు భార్య బోనెక్కింది. ప్రమాణం అయ్యాక, ప్లీడరు లక్ష్మీపతి ఆవిడను ప్రశ్నించారు.

"మీ పేరు?"

"కంభంపాటి సుజాత"

.......రాజు మీకు తెలుసా?

'తెలుసు'

'ఎలాగ?'

'వారి మెడికల్ షాప్‌లో మందులు కొనుక్కునేదాన్ని.'

'మీకు భరణం కేసు ఉంది. ఆ ఇల్లు మీద మీకు హక్కు ఉంది అని ఆయనకు చెప్పారా?'

'చెప్పానండీ'

'ఎప్పుడు?'

'మందులు కొనుక్కునేటప్పుడు.'

"ఇదేమిటి మందులు కొనుక్కునేటప్పుడు నాకెప్పుడు చెప్పింది? అబద్ధం! అంతరంగిక విషయాలు ఎంతో పరిచయముంటే తప్పితే ఎలా మాట్లాడుతారు? ఈ పిల్లెవరో నాకు తెలియనే తెలియదు." గొణుక్కున్నాడు రాజు.

"ఈ ఆస్తి కొనుక్కునేటప్పుడు ముందుగాని, అప్పుడు గాని, తరువాత గాని ఆయనకు నోటీసిప్పించారా?"

'లేదు.'

"మీ భర్త తన తల్లికి ఎ షెడ్యూలు ఆస్తి హక్కు విడుదల పత్రం ఎనిమిది సంవత్సరాల క్రితం నలభైవేలు తీసుకొని వ్రాసిచ్చారు. మీకు తెలుసా?"

'నాకు తెలియదు.'

ఇదే పంథాలో తండ్రిని, రాజుని కూడ బోనెక్కించి ప్లీడర్లిద్దరూ ప్రశ్నల వర్షాన్ని కురిపించారు.

ప్లీడరు లక్ష్మీపతి...

"రాజు సరైన కిమ్మత్తిచ్చి 'ఎ' షెడ్యూలు ఆస్తిని కొనుక్కున్నాడు. ఎంతో ఖర్చుచేసి బాగు చేయించుకున్నాడు. నాల్గు సంవత్సరాలైంది. నలభైవేలు తీసుకొని హక్కువిడుదల పత్రాలు డి-వన్ సూర్యారావు తల్లికి వ్రాసి ఇచ్చారు. అతనికి 'ఎ' షెడ్యూలు ఆస్తిమీద హక్కులేదు. భరణం అడుగుతున్న అతని భార్యకి కూడ ఆ ఆస్తి మీద హక్కులేదు. రాజు భరణం ఇవ్వాల్సిన అవసరం లేదు. రాజు భరణం ఇవ్వాల్సిన అవసరం లేదు." గట్టిగా వాదించాడు.

ప్రత్యర్థి వాదించేందుకు సరైన వాదనే లేకపోయింది.

వారం రోజుల తరువాత జడ్జిగారు 'డీ టూ రాజు, సుజాతకి భరణం ఇవ్వాల్సిన అవసరం లేదని, డి-వన్ సూర్యారావుకి ఇంకా ఆస్తులున్నందున అతని భార్యకి వాటిలో భరణం ఏర్పాటు చేయాలని" తీర్పు చెప్పారు.

రాజు మనసు కుదుట బడ్డది.

పార్వతి తన చెల్లెలు రాధని మాత్రం ఆ తరువాత ఏనాడూ రాజుకి కనబడకుండా చేయగలిగింది. ఆడదానికి ఆడదే శత్రువు.

రాధ తండ్రి ఆనవాయితీ లేకపోయినా మరొక 'భార్యను పోగొట్టుకున్న' వ్యక్తికిచ్చి రాధ పెళ్ళి జరిపించాడు.

పార్వతి శాంతించింది.

ఆ తరువాత పార్వతికి రాజుకి ఇటువంటి సమస్యలు రాలేదు. పార్వతి విడాకులు అన్నమాట ఎప్పుడూ ఎత్తలేదు.

( పల్లకి.. వినూత్న వారపత్రిక 23-6-93 పే.36-39)

**7**

# చిన్నకారు మీద బస్తీబురద

**బ్యాంకు వారి సౌజన్య సహకారాలతో... వడ్డీ రేటు ఎంత పెంచినా, నేమా కొన్నాను ఒక ఫియట్ కారుని ఇన్నాళ్ళకు!**

ఆనందం పొంగి పొర్లగా కారుని డ్రైవ్ చేస్తున్నపుడు ఎంతో గర్వంగా వుంటుంది. కాని ఎప్పటి కప్పుడు పెరిగే పెట్రోలు ధరలు, దాని నిర్వహణ భారం గుండెల్లో గుబులు పుట్టిస్తూనే వున్నాయి. అంతేగాదు మరికొన్ని విషయాలలో నాకు గుండెపోటును తెప్పిస్తూందీ కారు.

రోడ్డు మీదికి కారులో వెళ్ళేసరికి నేను చూపిస్తున్న సిగ్నల్సు కనిపించక నేను మ్రోగిస్తున్న హారన్ వినిపించక (హారన్ వేయకపోతే వేయలేదని, వేస్తే ఆ గొడవేమిటి అని ఉరిమి చూసే వారూ వున్నారు.)రోడ్డు రూల్స్ ఏమాత్రమూ ఖాతరు చేయక నడిచే అనేకమంది సహచరులను తప్పించుకు పోయేందుకు ప్రాణం అలసి పోతుంది.

ముఖ్యంగా ముగ్గురికి పైగా వక్క స్కూటరుని యెక్కి పాముల్లా జెట్టు స్పీడ్‌లో వచ్చే నవయువకులు నాలాంటి వారిని మరీ కన్‌ఫ్యూజ్ చేస్తున్నారు. వీరికి జీవితంలో "థ్రిల్లే" ప్రధానమనిపిస్తుంది.

కార్లు, టాక్సీలు, బస్సులు ముఖ్యంగా లారీలు వారితో కూడా గొడవలే.

కార్ల వారికి టాక్సీల వారికి వోపిక తక్కువ.. స్పీడెక్కువ. ఎటువంటి రద్దీ రోడ్డుమీదైనా వీరు సైడు తీసుకోవలసిందే, ముందుకు ముందుకు తోసుకు పోవలసిందే. కారు అన్ని కిటికీలలో నుండి అందులో వున్న అందరూ చేతులు పైన బెట్టి యిచ్చే సిగ్నెల్సు 'ఆక్టోపస్' చేతుల్లా కనిపించి వారి అసలు వుద్దేశాన్ని అర్థం కాకుండా చేస్తాయి.

ఇక లారీలూ బస్సులూ డ్రైవ్ చేసేందుకు తరచూ క్లీనర్లకు అవకాశము వస్తుంది కాబోలు. ఏమైనా కాని వీరు రోడ్డు రూల్సుకి, ఎదుట వారిచ్చే సిగ్నల్సుకి ఎప్పుడూ అతీతులే! లారీల్లో ప్రక్క సీట్లో కూర్చునే క్లీనరు మాత్రం ఎదుట వాడిని నెమ్మదిగా రమ్మని ఎప్పుడూ చేయి వూపుతూనే వుంటాడు. వీరికి గోతుల్లేవు! స్పీడు బ్రేకుల్లేవు. యమస్పీడే ప్రధానం.

ఇటువంటి వారు మన మీద నుంచి యెపుడు దూసుకు పోతారా అని యింటికి చేరేవరకూ ప్రాణాల్ని అరచేతిలో పెట్టుకొని వుండటమే.

రోడ్డు మీద నడిచే వారితో, రిక్షాలు రెండెడ్ల బళ్ళు మొదలైన వారితో గడబిడలు అనంతం.

ఇక ట్రాఫిక్ పోలీసులు ట్రాఫిక్ జామ్ అయితే మాత్రం కనిపించరు. కొంతమంది ఎప్పుడూ యాదాలాపంగా స్నేహితులతో బాతాకానీ వేస్తూ ఇలారా అలా వెళ్ళు అని వేళ్ళతో చేసే సైగలు సిగ్నల్సుగా అనిపించవు. పోలీసు జీపులుగాని, రెవెన్యూ అధికార్ల కార్లుగాని కనిపిస్తే వీరు బిగిసిపోయి, సెల్యూట్‌తో సహా సిగ్నల్సు యిస్తారు. క్రొత్త ఆడపోలీసులు శిక్షణ లేకుండా యిచ్చే సిగ్నల్సు మరింత నవ్వు పుట్టిస్తాయి. ట్రాఫిక్ లైట్లు వెలగనే వెలగవు కదా.

మాఊళ్లో మెయిన్ రోడ్డు మధ్య స్కూటర్లకు సైకిళ్ళకు పార్కింగ్ ప్లేసు చూపించారు. బాగానే వుంది. పేవ్‌మెంటు మీద రాళ్ళు ఎన్నో పగిలే వున్నాయి. రోడ్డుకి ఇరుపక్కలా పేవ్‌మెంటు కానుకుని వున్న రోడ్డు మూడడుగులకు పైగా తవ్వబడి వుంది. దీని మూలంగా ట్రాఫిక్ నడిచేందుకున్న రోడ్డు మరింత యిరుకయింది. పేవ్‌మెంట్ల మీద కొచ్చేసిన కొట్లెన్నో వున్నాయి. వాటిమీద తెరిచివున్న 'మాన్ హోల్సు' కూడా చాలా వున్నాయి. మరి ప్రతివాడికి గోతుల్లోపడి కాళ్ళు విరగకొట్టుకొనే అవకాశాలు ఎక్కువే.

మరి కార్ల పార్కింగ్ ఎక్కడ? ఎలానూ మెయిన్ రోడ్ మీదకాదు. సరే ప్రక్క రోడ్లలో అనుకొంటే ఎక్కడా కారు పార్కింగ్ అని బోర్డులు గాని నేలమీద గీతలు కాని కనిపించటం లేదు. ఏ సందుల్లో చూసినా సైకిళ్ళు, స్కూటర్లు, గూడుబళ్ళు పూర్తిగా ఆక్రమించుకుని వుంటున్నాయి.

ఆ రోజు సందులో చిన్న ఖాళీలో నా కారుని పార్కు చేసే ప్రయత్నం చేసాను.

"మాకొట్టుకి అడ్డంగా వుంది కాస్త ముందుకి పెట్టుకోండి." ఆ రోడ్లో ఎంత దూరం వెళ్ళినా షావుకార్లు యిదే అరుపు.

వారి మాట ఖాతరు చేయకుండా ఒకచోట కారుని నిలిపి బజారు పనిచూసుకొని పావుగంటలో తిరిగి వచ్చాను. కారుమీద, కారు అద్దాలమీద ధూళిలో హీరో హీరోయిన్ పేర్లు, ఎన్నెన్నో చిత్రాల ప్రదర్శనం. గాజు ముక్కతో గాబోలు కారు డోరుల మీద అసహ్యంగా గీసిన గీతల్ని చూసాక ప్రాణం గిజగిజలాడింది. ఎవరిని అడగను?

నెమ్మదిగా యింటికి వచ్చి కారుని షెడ్డులో పెడుతున్నాను. సిగ్నలు లైట్లు వెలుగుతున్నాయి. హారన్ మోగించాను. చేతులు చూపిస్తూనే వున్నాను. స్కూటరు మీద వస్తున్న పెద్ద మనిషి కారు వెనక భాగాన్ని గుద్దేసాడు. లైట్లు పగిలాయి. రంగుపోయింది. బాగా లొత్త పడింది.

'ఏమిటయ్యా బాబు యిది కొత్తకారు' అని అడిగితే బ్రేకు సరిగా లేదట.

"తత్తత్తబెబ్బెబ్బె" అతనికి మాటలు మరి రావటం లేదు. వెనుక కూర్చున్న అతని భార్యామణి దణ్ణాలు పెడుతూంది.

మరిక మాట్లాడలేక కళ్ళల్లో నీరు తిరుగుతున్న నన్ను గమనించి గబాల్న స్కూటరు స్టార్టుచేసి పారిపోయారా జంట.

*(తెలుగు విద్యార్థి మాసపత్రిక, ఆగష్టు, 1993 పే. 73-74)*



నట్టేట 1978 ప్రణవమూర్తి

# 8

# పిల్లకాకి ఎదురుదెబ్బ

ఆ ఆస్పత్రి రాష్ట్రంలోనే అతి పురాతనమైనది. అది టీచింగు ఆస్పత్రికూడా. అంటే అనుబంధంగా మెడికల్ కాలేజి కూడ వున్నది. చుట్టు ప్రక్కల అనేక జిల్లాలనుండి ప్రతి జటిలమైన కేసూ అక్కడికి రావలసిందే! మెడికల్ వార్డులు, సర్జికల్ వార్డులు, స్త్రీల జబ్బుల వార్డులు, పిల్లల వార్డులు, ఇంకా ఎన్నెన్నో! అన్నీ పురాతన రాతి కట్టడాలు, బ్రిటిష్ కాలం నాటివి. అక్కడి డాక్టర్లు సీనియర్లవటమే గాదు, విదేశాలలో పై చదువులు చదువుకొని గొప్పగొప్ప డిగ్రీలను సంపాదించుకొని వచ్చినవారు. అటువంటి వారిలో అగ్రగణ్యుడు డాక్టరు భీమారావు. డాక్టరు రావుగారి గత చరిత్ర కొంత విచిత్రంగా వుంటుంది.

ఇంటరు మీడియట్ వరకు రావుగారు ఎలా చదివారో సరైన దాఖలాలు లేవు. కాని యంబిబియస్ ఎలా చదివారో అందరికీ తెలుసు. యం.బి.బి.యస్ లో వున్న ప్రతి సబ్జక్టును, కనీసం రెండుసార్లు తప్పి మరీ పాసయ్యారు. అయిదు సంవత్సరాలలో పూర్తిచేయాల్సిన కోర్సును పది సంవత్సరాలలో పూర్తి చేసారు. ఆ తరువాత యం.డి.ని మాత్రం గుబుక్కున బోరింగ్‌లో జల అందుకున్నట్లు మొదటి ప్రయత్నంలోనే సంపాదించారు. ఎవరిని ఎలా... పట్టేరో గాని ఒకగోల్డు మెడల్‌ను కూడా సంపాదించారు. ఇక ఆ తరువాత విదేశాలు వెళ్ళి చాంతాడులా డిగ్రీలను పోగేసుకొచ్చారు. ఆయన ఓపికను మెచ్చుకోవలసిందే, కాని తలమీది వెంట్రుకలు వూడిపోయినా తల బిరుసుతనం పెరిగిపోయింది. సహాధ్యాయుల్నే చులకనగా చూడటం మొదలు పెట్టారు.

"వాడికి సబ్జక్టేమి వచ్చు. కనీసం క్లోరోమైసిటిన్ సరైనడోసు యివ్వటం

కూడ రాదు" ఇలా ఎన్నో కామెంట్లు. డాక్టరు రావుగారు రోజూ ఆస్పత్రికి కారులో వచ్చి ఉదయం ఎనిమిది గంటలకు వార్డులో అడుగుపెట్టారంటే, అసిస్టెంటు డాక్టర్లకు, హౌస్ సర్జన్లకు, చదువుకొనే కుర్రకారు డాక్టర్లకు, సిస్టర్లకు అందరికీ హడల్. ఆస్పత్రంతా నిశ్శబ్దమైపోతుంది. సూటు బూటుతో ఠీవిగా తన రూమ్‌లోకి వెళ్ళారంటే మళ్ళీ పన్నెండు గంటలకే బైటకు వచ్చేది. ఈలోగా మంత్రులు, ఎం.ఎల్.ఏలు, ధనిక పురప్రముఖులు అంతా వైద్యసంప్రదింపుల కోసం ఆయన గదిలోకి బారులు కట్టి వెళ్ళేవారు. ఆయనకు వూపిరి పీల్చుకునేందుకు సమయముండేది కాదు. రో..రింగు ప్రాక్టీసు. పన్నెండు గంటలకి, 'రాజా వెడలె రవి తేజము లలరగా' అనగా, రావుగారు రౌండ్సుకి బయలు దేరితే ఆయన వెనక అసిస్టెంటులు, హౌస్ సర్జనులు, మెడికల్ స్టూడెంటులు ఒకరి తరువాత ఒకరు బారులు తీరి తరలి వెళ్ళేవారు. బేసిన్‌లో లోషన్‌వేసి ఒక వార్డుబోయ్, టవల్ తెస్తూ నర్సు కూడా వుండేవారు. వీటి అవసరం ఆయన కెప్పుడూ వుండేది కాదు. ఎందుకంటే ఆయన వార్డులో ఎప్పుడూ పేషెంటును పరీక్ష చేయలేదు. ఆ అవసరమే వస్తే ఆ పేషంటును స్ట్రెచ్చర్ మీద ఆయనగదిలోకి రప్పించుకొని అక్కడ పరీక్షించేవాడు.

ఈ రౌండ్సులో సబ్జక్టులోని పరమ రహస్యాల్ని వెల్లడి చేయకపోయినా ఆయన విదేశ అనుభవాల్ని చెపుతూ జోక్సును పేల్చుకుంటూ పోయేవారు. ఏదైనా ప్రశ్న వేసి వివరణ కోరితే ఆ డాక్టర్ని నలుగురిలో ఎక్కడ భంగపరుస్తాడో అని ఎవరూ నోరు విప్పేవారు కాదు. ఈవిధంగా ఆ భిషగర్యుని వైభవం దిన దినాభివృద్ధి చెందుతోంది.

ఆరోజు రౌండ్సులో స్వానుభవ ప్రగల్భాలు పలుకుతూ "ఈరోజు వార్డులో ఎక్కడి నుంచో 'ఊపిరి తిత్తులలోని కురుపు' వాసనేస్తోంది" అన్నారు. ఎన్నోసార్లు ఈవిధంగా ఆశ్చర్యపరిచేవారు. రోగ నిర్ణయంలో ఈయన ఎంత నిష్ణాతులో అని అందరూ నోరు తెరిచేవారు. కాని ఆ రోజు దురదృష్టవశాత్తు అసిస్టెంటు "సర్ ఆ పేషంటు నిన్నరాత్రి కాజువాలిటీలోనే పోయాడు, వార్డువరకు రాలేదు" నెమ్మదిగా చెప్పాడు.

ఇంటిదగ్గర క్షుణ్ణంగా పరీక్ష చేసి హాస్పిటల్‌కి పంపిన ఆ కేసు, వార్డులో మర్నాడు వుంటుందనుకొన్న రావుగారు ఖంగుతిన్నారు. రౌండ్సు అర్ధాంతరంగా ఆపేసి రూమ్‌లోకి వెళ్ళిపోయారు. కొన్నిరోజులు గడిచాయి. ఆస్పత్రిలో నాల్గవ తరగతి ఉద్యోగులనుండి డాక్టర్ల వరకు లంచగొండితనం పెరిగిపోతున్నది. కొత్తగా వచ్చిన హౌస్ సర్జన్ సుబ్బారావు గురించి డాక్టరు రావుగార్కి

కొంతమంది గూఢచారులు చాలాచెప్పారు. ఆ హౌస్సర్జను ప్రతి పేషెంటు దగ్గరా యింజక్షనుకు ఒకటీ, రెండు రూపాయలు వసూలు చేస్తున్నాడని. ఇది యధార్థమే అని దీనిని ఖండించి సుబ్బారావుని నలుగురిలో నవ్వులపాలు చేయాలని రావుగారు పథకం వేసుకున్నారు. ఆరోజు గ్రాండ్ రౌండ్సులో డాక్టరు రావుగారు 'ఆస్పత్రులు-ప్రజాసేవ' అంటూ ధారాళంగా ఉపన్యాసమిచ్చారు. "డాక్టర్ సుబ్బారావ్" పిలిచారు డాక్టరు రావుగారు. "సర్" .... "నీవు ప్రతిపేషెంటు దగ్గరా ఇంజక్షను యిస్తూ డబ్బు వసూలు చేస్తున్నావట, తప్పుగదా!". సుబ్బారావు కొంచెం చెవిటితనాన్ని (సెలెక్టివ్ డెఫ్‌నెస్) నటించాడు, అవసరమైన మాటలు తప్ప వినిపించవు అన్నట్లు. ఈసారి రావుగారు మరింత కోపంగా గట్టిగా "వినపడటం లేదా నీవు ప్రతి పేషెంటు దగ్గరా యింజక్షన్లు యిచ్చినందుకు డబ్బులు వసూలు చేస్తున్నావట! పేషెంట్లు ఫిర్యాదు చేస్తున్నారు. ఇది ధర్మాసుపత్రి! అలా చేయవచ్చా?"

ఈసారి సుబ్బారావు సావధానంగా "అరవకండి సార్ వినపడుతుంది. మీరు పేషెంట్ల మాటలు వినకూడదు సార్. వాళ్ళలాగే చెపుతారు, నన్నడగండి నేను చెపుతాను" అంటూ చెప్పాడు. "ఈ పేషెంటే ప్రతివాడు మీకు పాతిక రూపాయలు యిచ్చామంటున్నాడు నేను నమ్ముతున్నానా!! లేదుసార్" రావుగారు ఖంగుతిని రౌండ్సు ఆపేసి రూమ్‌లోకి వెళ్ళిపోయారు.

*(Kakinada Rangaraya Medical College Magazine, 1993)*



వెన్నెల్లో వేడిమి 1993 ప్రణవమూర్తి

9

# బోంబేపర్సులో భోగం జ్ఞాపకం

"మనిషి అన్న తరువాత మడికట్టుకు కూర్చోవవసరం లేదు. అవకాశం వచ్చినప్పుడు అనుభవించాలి" ఇటువంటి సత్యాల్ని స్వంత అల్లుడికే చెపుతూ ఉంటాడు రావుగారు. ఏభై ఏళ్ళు దాటినా రావుగారు అన్నిటికీ తయారే! హుషారైన మనిషి.

అల్లుడు శరత్ బాబు స్వయంకృషిపై అంతర్జాతీయ బ్యాంకింగ్ మీద పరిశోధన చేయడం వలన, బ్యాంకు వారే స్వంత ఖర్చుల మీద ట్రైనింగ్ కోసం ఇంగ్లాండు పంపించారు. రెండేళ్ళలో తిరిగి వచ్చిన బాబుకి బొంబాయి బ్యాంకులో పెద్ద ఉద్యోగ మిచ్చారు. అన్ని మెలుకువలూ తెలిసిన బాబు ఆ ఉద్యోగాన్ని సమర్థవంతంగా చేసుకొస్తూ ఉన్నాడు. అటు అధికార్ల, ఇటు ఖాతాదార్ల మన్ననల్ని పొందుతున్నాడు.

ఆరోజు నథమల్లాల్ భూల్‌చంద్ "రేపు సాయంత్రం బ్లూ-మౌంటెన్‌లో ఆనీడాల్ప్ ప్రోగ్రాము ఉన్నది బాబూ. 'మీకి' తప్పక వెళ్ళాలి" అంటూ రెండు వందల రూపాయిల రెండు కాంప్లిమెంటరీ టిక్కెట్లను చేతిలో పెట్టినప్పుడు బాబు హృదయం ఉప్పొంగి పోయింది.

ఆనీడాల్ఫు ప్రఖ్యాత పాప్ సాంగ్సరుట. ఆవిడ పేరు వినని రసికు డుండడు. గత అయిదు సంవత్సరాలుగా 'ఆన్నీ' కార్యక్రమాలు టీ.వి.లలో యెన్నో వచ్చాయి. అన్ని పత్రికల్లోనూ ఈవిడి గురించి ప్రశంసలే!

ఈవిధంగా సంపాదించిన టిక్కెట్లను ఆరోజే పనిమీద బొంబాయి వచ్చిన తన మామగారైన రావుగారిచేతిలో పెట్టాడు బాబు. మరునటి రోజు సాయంకాలం ఇద్దరూ క్రొత్త పెళ్ళికొడుకుల్లా తయారై రహస్యంగా బ్లూమౌంటెన్

హోటల్‌కు బయలుదేరారు స్కూటరు మీద.

హోటలు కాంపౌండు వందలాది కార్లతో, స్కూటర్లతో అపరిమితమైన జన సందోహంతో కోలాహలంగా ఉన్నది. పోలీసు బందోబస్తు కూడా ఎక్కువగానే ఉన్నది.

మనుష్యులను తోసుకుంటూ ముందుకు పోయారు బాబూ, రావుగారూను.

"మనది రెండు వందల రూపాయల టిక్కెట్టు కదూ బాబు" ముందు కుర్చీలో కూర్చోపెడతారనే ఉద్దేశంతో అన్నాడు రావుగారు.

"అవును" అన్నాడు బాబు.

"మీ టిక్కెట్టు ఏది?" ముందు కొచ్చేస్తున్న వాళ్ళను ఆపి అడిగాడు ఒక వాలంటీరు.

ఆ టిక్కెట్లను చూసి మెడపట్టి గెంటినంత పనిచేశాడు వెనక్కి పొమ్మంటూ. వాడి భాషలో చెప్పుకు పోతూ ఉంటే, రావుగార్కి అర్థమైనది ఏమిటంటే... ముందు ఒక టిక్కెట్టును పదివేల రూపాయలు పెట్టి కొనుక్కున్న వాళ్ళున్నారు. మీ దగ్గరున్నది అతిసామాన్యమైన రెండు వందల రూపాయల టిక్కెట్లు. ఈ టిక్కెట్ల వారు అందరికంటె ఆఖరున నుంచుని చూడాలి అని.

అహం దెబ్బతిన్నా, చుట్టూచూసి, తెలిసిన వారెవరూ లేరని తృప్తిపడి వెనుక వరసలలోనే నిలబడి సర్దుకుపోయారు.

హాలులో ఇసుక వేస్తే రాలనంత జనం చేరిపోయారు. చుట్టూ రంగు రంగుల సీరియల్ సెట్‌లైట్లు వెలుగుతూ ఆరిపోతూ, దూరంగా వినిపిస్తున్న వాయిద్యాలకు లయ కలుపుతున్నట్లున్నాయి.

హఠాత్తుగా హాలులో ఉన్న లైట్లన్నీ ఆరిపోయాయి. స్టేజి మీద ఉరుములు మెరుపులు కనిపించాయి. జనం అంతా నిశ్శబ్దం అయిపోయారు. స్టేజి మీద రంగు రంగులైట్లను అటూ ఇటూ త్రిప్పడం ప్రారంభించారు. ఎన్నోరకాల వాయిద్యాల్ని యుద్ధానికి వెళ్ళేటప్పుడు రణభేరి మ్రోగించినట్లు బాది ఒక్కసారి ఆపేశారు.

ఇంతలో సూటూ బూటూ వేసుకున్న యాభైయేళ్ళ వ్యక్తి మైకు ముందు నిలబడి "ఆనీ డాల్సు" ఎటువంటి పాటగత్తె, ఆవిడ ఎన్నెన్ని దేశాలలో ఎన్నెన్ని

ప్రదర్శనలనిచ్చింది, ఎన్నెన్ని రికార్డులను బ్రద్దలు కొట్టింది వివరిస్తూ అనర్గళంగా ఉపన్యాసమిచ్చాడు.

ఇదిగో మీ 'ఆనీ' అంటూ వంగుని అతను నిష్క్రమిస్తూ ఉంటే, జిగేల్ మంటూ ఆ మెరుపుతీగ స్టేజిమీదకు ఉరికింది. చింపిరి జుట్టుతో, పిల్లికళ్ళతో, తెల్లని పాలవంటి శరీరచ్ఛాయతో నాజూకైన అవయవ సౌష్ఠవంతో, వల్లమాలిన శృంగార చేష్టలతో అత్యంత ఆకర్షణీయంగా ఉన్నది ఆనీ. ఉన్నవో లేవో అన్నట్లు వేసుకున్న జీన్సు దేహానికి పూర్తిగా అంటుకుపోయాయి. కటివలయం దగ్గర మాత్రం సిగ్గుబిళ్ళ నొకదానిని వేలాడ గట్టింది.

"ఆనీ డాల్సు" అంటూ నమస్కార సూచకంగా చేతులు ఎత్తింది. జనంలో హర్షధ్వానులు మార్మోగాయి.

చెవులు గళ్ళు పడేటట్లు డ్రమ్ములూ, బాకాలూ ఒక్కసారిగా మ్రోగాయి.

అదేవిధంగా విచిత్ర వేషధారణలతో, సిగ్గుపడకుండా, వంతపాడేందుకు, గంతులేస్తూ మరో పదిమంది అమ్మాయిలు స్టేజిమీదకు చేరారు.

ప్రతి పాటకూ ముందు కొంచెము ఉపోద్ఘాతమిస్తూ పాట తరువాత పాట .... నాల్గు పాటలు పాడేసరికి, శ్రోతలంతా పాకాన పడ్డారు. వారుకూడా గళమెత్తి పాడుతూ, చప్పెట్లు, తాళాలతో పాటల్లో లీనమై పోయారు.

ఏదో క్రొత్త ప్రపంచం అంచుల్లోకి వెళ్ళిపోయినట్లనిపించింది బాబుకి, రావుగార్కి కూడా.

హఠాత్తుగా జనంలో పాటకి బదులు ఏదో కోలాహలం వినిపించింది.

"ఏమిటి బాబూ" అంటున్న రావుగారి మీదకి కూడా కొన్ని కాగితాలు పడ్డాయి. వీటిని ఏరుకోవటం తోనే జనంలో బయలుదేరింది అలజడి.

ఒక కాగితం రావుగార్కి దొరికింది "చూడు బాబూ" అంటూ ఇచ్చిన కాగితాన్ని, అసలే బ్యాంకు ఉద్యోగి బాబు క్రీనీడలో కూడా "అసలైన పదిరూపాయలు! మామగారు! నకిలీదికాదు" కనిపెట్టేశాడు. అలా అంటూ ఉండగానే ఇద్దరి నడ్డిల మీద లాఠీదెబ్బలు, ధారావాహికంగా పడిపోయాయి. జనాన్ని గొడ్లని బాదినట్లు బాదారు పోలీసులు. ఆతురతతో బైటకు పరిగెట్టే మనుషులతో మరింత త్రొక్కిసలాటై పోయింది.

ఎవడో అభిమాని పది రూపాయల నోట్లను, ఉత్సాహ మాపుకోలేక,

గుప్పెళ్ల కొద్దీ ఆనీ డాల్సు మీద, మరి కొన్నింటిని జనాల మీదికి కూడా విసిరాడట. అదీ ఆ గడిబిడకు కారణం.

రావుగారూ, బాబూ ఈ కుమ్ములాటలో విడిపోయారు. ఇద్దరి కళ్ళజోళ్ళూ ఎక్కడో పడిపోయాయి. ఇద్దరి చొక్కాలు చిరిగిపోయాయి. ఒళ్ళు హూనమైపోయింది. వీరిద్దరూ స్కూటరు దగ్గర తిరిగి కలిసికొనేందుకు రెండుగంటలు పట్టింది.

"మామగారూ నాకళ్ళజోడు పడిపోయింది. చీకట్లో తడిమితే ఎవడిదో నాకు దొరికింది" చూపించాడు బాబు మామగారికి.

"నాకూ అంతేనోయ్. నాకూ మరెవరిదో కళ్ళజోడు దొరికింది" ఆయనా చూపించాడు అల్లుడికి.

అదృష్టం కొద్దీ, విచిత్రంగా మామ కళ్ళజోడు బాబుకీ, బాబు కళ్ళజోడు మామకీ దొరికాయి. సంతోషించారిద్దరూ. రావుగార్కి ఒక పదిరూపాయల నోటు కూడా దక్కింది.

జాగ్రత్తగా ఇంటికి చేరి, ఇంట్లోమాత్రం తమ స్కూటరు రోడ్డుమీద ఎలా 'స్కిడ్' అయిందో ఇద్దరూ ఎలా పడిపోయారో, జంటగా కథ అల్లి చెప్పారు.

ఈ సంఘటన జరిగి అయిదు సంవత్సరాలు పైగా అయిపోయింది.

ఎన్నిసార్లు పర్సుతీసినా నలిగి ఒక మూలకొంచెము చిరిగిన ఆ పదిరూపాయల నోటు కనిపిస్తే రావుగారి పెదవుల మీదకి బుల్లి చిరునవ్వు వస్తుంది. వెంటనే వీపును కూడా ఒకసారి తడుముకుంటారు.

ఆ నోటును మాత్రం ఆయన ఖర్చు చేయరు. దాచుకున్నారు జ్ఞాపకార్థంగా.

*(పల్లకి.. వినూత్న వారపత్రిక 1-9-93 పే 20-21)*

**10**

# కాకినాడలో గురజనాపల్లి

**ఆస్పత్రుల్లో ప్రైవారు రోగుల్ని పరామర్శించే సమయం సాయంకాలం 4 గంటల నుండి 6 గంటల వరకే. స్పెషల్ వార్డులికి మాత్రం ఈ 'రూల్' పూర్తిగా వర్తించడం లేదు. ఏదోవిధంగా అన్ని వేళల్లోనూ, ఎవరో వకరు వస్తూ పోతూనే వుంటారు. లోపలికి వస్తామంటూ గేట్‌మాన్‌తో రోజూ ఎవరో గొడవ పడుతూనే వుంటారు.**

ప్రొద్దున్నే హాస్పిటల్ సూపరింటెండెంట్, తన పరివారంతో ప్రతీ వార్డూ చూసి వెళ్ళిపోయారు. వార్డులు నీటుగా వుండటం లేదని డాక్టర్లనీ, నర్సుల్నీ మందలించి పోయారు. వీళ్లేం చేస్తారు? వీళ్ళమాటని తోటీలూ, స్వీపర్లూ వింటారా? ఇక వీళ్లే చీపుర్లు పట్టుకుని వార్డుల్ని తుడవాలి. సూపరింటెండెంటు కూడా వాళ్ళనేమీ అనలేక, డాక్టర్లూ నర్సులూ లోకువ గాబట్టి వీళ్ళనే తిడతారు. "మీరు దగ్గరుండి తుడిపించాలి" అంటూ!

"అవిగో అక్కడ మేకలు! అవిగో అక్కడ కుక్కలు! తరమండి, వాటిని బైటికి తరమండి" అంటూ సూపరింటెండెంటు అరుచుకుంటూ వెళ్లిపోయారు ఆరోజున.

అసిస్టెంటు డాక్టర్లు నర్సుల్ని తిట్టారు, నర్సులు సార్జెంటును తిట్టారు. సార్జెంటు గేటు కాపలావాడిని తిట్టి "నీవల్లే! విజిటర్లకు ఒక టైమని లేదు, ఎందుకు రానిస్తున్నావు? వార్డులన్నీ వాళ్ళ వల్లే గత్తరైపోతున్నాయి" అంటూ చీవాట్లు పెట్టాడు.

గేటుమేన్ గేటు దగ్గరకు పోయి "వీళ్ళతో గొడవ పడలేకపోతున్నాను. జనాన్ని లోపలికి పోనిస్తే వొక గొడవ, పంపక పోతే వొక గొడవ," అంటూ గొణుక్కున్నాడు.

"అన్నాల టైమ్‌కే కారేజీలున్న వాళ్ళే; మిగిలినోళ్లంతా ఎల్లిపొండి, నేను పంపను" అని జనాన్ని కసురుకుంటూ అరిచాడు.

ఒక గంట మాత్రం మనుష్యుల సంచారం తగ్గింది.

మళ్లీ మామూలే! జనానికి తెలుసు గేటుమాన్ లోపలికి ఎలా పంపుతాడో!

ప్రక్క "బి క్లాస్ రూమ్"లో పేషెంటుని చూసేందుకు ఈ రోజు మరీ తండోపతండాలుగా వచ్చేస్తున్నారు. ఒక గంటలో ఇరవై మంది పైగా వచ్చారు.

మళ్లీ మరొకడు "బాబూ గురజనాపల్లి కర్ణంగారు యేగదిలో వున్నారు బాబూ" అన్నాడు. చాలా కేస్ రికార్డులు రాయాలి, ఇంజక్షన్లు యివ్వాలి, ఇంకా చాలా పని వుంది.

వీళ్లందరికీ "ఎంక్వయిరీ కౌంటర్లా వుంది నన్ను చూస్తే" అనుకున్నాను.

మళ్లీ మామూలే, పంచె, సైనుబనియను, తలపాగ, చెవిలో చుట్ట, చేతిలో కర్ర, కాళ్లకి కిర్రు చెప్పులు, మాసిన గెడ్డంతో, ముక్కుకి చెవులుకి తీగలతో ముప్పై యేళ్ళ పైబడ్డ పల్లెటూరు వాడు నవ్వుతూ అడుగుతున్నాడు.

ఈసారేమిటో వచ్చే వారందరూ చిరునవ్వులు వలక బోసుకుంటూ వస్తూన్నారు.

కోపంగా గేటుదగ్గిర కెళ్లి -

"ఏమయ్యా పొద్దుట్నుంచీ ఎంతమందిని పంపిస్తావు లోపలికి" అన్నాను. కానీ నాకూ తెలుసు హవున్ సర్జన్ మాట వీడు వినడని. "నన్నేమి చేయమంటారు సార్, తోసుకుంటూ వచ్చేస్తున్నారు. అప్పటికీ వొక్కొక్కడ్నీ మాత్రమే పంపుతున్నాను" తల తిప్పుకొని స్పష్టంగా చెప్పాడు గేటుమాన్.

"వీడెప్పుడూ ఇంతే, వీడితో మనం మాట్లాడలేము," అనుకుంటూ వార్డు దగ్గిరికి వచ్చాను. పల్లెటూరి వాడు యింకా అక్కడే నిలబడి వున్నాడు.

"ఏమయ్యా ఏమి గావాలీ?" నసుగుతూ "కర్ణంగారెక్కడ బాబు?"

"అదిగో ప్రక్క గదిలోనే వెళ్లు."

వీళ్లందరికీ ఈ కర్ణంగారు అంటే అంత అభిమానం దేనికి? ఇంతమంది వచ్చేస్తున్నారు?

"ఏయ్ అబ్బాయి యిలారా, మీ కర్ణంగారు అంత మంచివాడా?"

"కాదు బాబూ చండశాసనుడు"...

"మరి మీ అందరికీ భయమా ఆయనంటే?"

"లేదు బాబూ! ఎవరం జడవటం లేదు"

"మరింతమంది వచ్చేస్తున్నారేమిటి? పలకరించేటందుకు?"

"అది కాదు బాబూ" సిగ్గుపడి పోతున్నాడు ఆ కుర్రాడు.

"మరేమిటి?"

"బాబూ కర్ణంగార్కి చెక్కది పెట్టారట గదా! అది ఎలా పనిచేస్తూందో చూద్దామని!"

ఇదా వీళ్ళు తెలిసికోవాలనుకున్న విచిత్రము!

కర్ణంగార్కి ప్రోస్టేటు గ్రంథి వాచి నీరుడు గొట్టాన్ని నొక్కేస్తే, పొత్తికడుపులోంచి నీరు బయటకు వచ్చేందుకు మరొక ద్వారం ద్వారా రబ్బరు గొట్టాన్ని దూర్చి దానికి మూతగా చెక్క బిరడాని పెట్టారు.

"చెక్కది బాబూ! ఎలా పన్చేస్తుంది?"

నేను నవ్వాపుకోవడానికి ప్రయత్నించాను, ప్రక్కన సిస్టరు పక్కుమంది.

*(తెలుగు విద్యార్థి మాసపత్రిక, అక్టోబరు 1993 పే.15)*



నిద్ర 1994 ప్రణవమూర్తి

11

# గొంగళి పురుగుల జ్యోతిష్యం

"మీరు బాగా చదువుకున్నారు. పలుకుబడి ఉన్నవారు, ఉద్యోగస్థులు. నిజమేనా?"

"అవునండీ" అన్నాడు రాజు.

"మీకు ఇంట్లో కుదురు లేదు. భార్యవల్ల మనస్తాపం వుంది నిజమేనా?"

"అవునండీ"

"మీకు వేరే స్త్రీతో సంబంధం ఉంది. ఆ పిల్లను వాళ్ళింట్లో బంధించేసారు. ఆవిడ మీ దగ్గరకు రావాలి. అంతేనా?"

"అవును సార్"

"వస్తది"

హమ్మయ్య! సత్యన్నారాయణ సరైన వాడి దగ్గరకే పంపాడు. తనేమీ చెప్పకుండానే తనగురించి అంతా చెప్పేశాడీయన.

దివాన్ చెఱువు దగ్గర ఈయన ఎడ్రసు తెలుసుకొని వచ్చేసరికి రెండుగదుల డాబాలో ఒక గదిలో మడత కుర్చీ మీద కూర్చొని ఉన్నాడీయన. ముసలాడే కోలముఖం. తెల్లగా పాలిపోయి సన్నగా వున్నాడు. చేతుల వేళ్ళు సగానికే ఉన్నాయి. కనుబొమ్మలు, కన్నులు తీరుగా లేవు. కంటిలోంచి నీరుగారుతోంది. కుష్టువ్యాధి కాబోలు. పల్లెటూరి వాతావరణం. భార్య, కూతురు గాబోలు అటూఇటూ తిరుగుతున్నారు. గది గోడలనిండా కుటుంబ సభ్యుల ఫోటోలు! గదిమూల, దేవుడి మంటపం. గదిలోకి కోళ్ళూ, కుక్కలూ ఫ్రీగా వచ్చి పోతున్నాయి.

"రేపు సాయంకాలం మూడు గంటలకి రండి. ఇపుడు ఇరవై రూపాయలివ్వండి. తాయత్తు చేసి ఇస్తాను. రేపు ఆరు నిమ్మకాయలు, రెండు కొబ్బరికాయలు, పళ్ళు, ఆకు, వక్క పట్రండి...."

"అలాగే సార్!"

"పనైతే రెండొందలు ఇవ్వాల్సి ఉంటుంది. నేను ఖచ్చితమైన మనిషిని"

"అంతకంటేనా!" కాళ్ళకి దణ్ణం పెట్టి వచ్చేసాడు రాజు.

★ ★ ★

ఏ గొడవాలేని రాజు బ్రతుక్కి ఇదో పెద్దసమస్య అయి కూర్చొంది.

తను ప్రైవేటు చెపుతున్న గదిలోకి అరుణ, నాన్నతో వచ్చి 'నమస్కారం సార్' అంటూంటే తదేకంగా, ప్రపంచాన్ని మరిచి ఆవిడ్నే చాలసేపు చూసాడు.

తెల్లటి నాజూకైన శరీరం, కోలముఖం, పిరుదుల వరకూ ఉన్న పొడవైన జడా, ముప్పై ఏళ్ళు దాటి అమాయకంగా కనిపించింది. సాదా చీరకట్టుకున్నా చాలా అందంగా వుంది.

తేరుకునే సరికి నలభైయవపడిలో పడిన తనకి సిగ్గేసింది.

"మా అమ్మాయి అరుణ" వాళ్ళ నాన్న పరిచయం చేశాడు. "నమస్కారమండి కూర్చోండి".

"నేను రాధా ఎంపోరియంలో పనిచేస్తున్నా! మా పెద్ద అమ్మాయి దురదృష్టవంతురాలండీ!"

ఇంకా చెపుతున్నాడు. "కష్టపడి ఒక సౌమ్యుడికిచ్చి పెళ్ళి చేసాను నాల్గేళ్ళక్రితం. వాళ్ళు ఎంతో అన్యోన్యంగా ఉండేవారు. అతనిని మా ఎంపోరియంలోనే గుమాస్తాగా వేయించాను."

"దేముడు వక్రంగా చూసాడు. అతనికి పచ్చ కామెర్లు వచ్చాయి. వేయించని మందు లేదు. చేయించని వైద్యం లేదు. ఇల్లంతా గుల్లయి పోయింది. అల్లుడు మాత్రం మా కన్యాయం చేసి వెళ్ళిపోయాడు, ఈ పిల్లని మాకొదిలేసి. పిల్లలన్నా లేరు. వేరే వ్యాపకం లేక అవే జ్ఞాపకాలతో ప్రతిక్షణం ఏడుస్తుంటే మళ్ళీ చదువులో పెడదామని తీసుకొచ్చా".

కథంతా క్లుప్తంగా చెప్పాడు. అవును! అరుణ నల్లబొట్టు పెట్టుకుంది.

"మీరు ఎకనామిక్సు బాగా చెపుతారని అంతా చెపుతూ ఉంటే దీనిని మీ శిష్యురాలిగా చేద్దామని తెచ్చాం. ప్రైవేటుగా పరీక్ష వ్రాస్తుంది. మీరా సాయం చేయాలి".

"ఉదయం బాచ్‌లో అమ్మాయిలు ఎక్కువ వస్తారు. ఆరుగంటలకల్లా పంపండి." మిగిలిన విషయాలన్నిటిని తేల్చేసి మంచి రోజు చూసుకొని పంపించమన్నాడు. "తదియ! రేపటినుండి వస్తుందండి" అని చెప్పి వెళ్ళిపోయారు.

అరుణ శ్రద్ధగా పాఠాలు వినేది. ఎకనామిక్స్ కాకుండా లాంగ్వేజస్ కూడా చెప్పేవాడు. అరుణ మొదటి సంవత్సరం పరీక్ష పాసైంది.

బందరు లడ్డూలు తెచ్చి "అంతా మీ దయ సార్" అంటూ రాజు కాళ్ళకి దణ్ణం పెట్టింది. ఇంట్లోకి రమ్మని "పార్వతీ ఇలా రా!" అన్నాడు రాజు.

"ఆ ఏమిటండీ! నాకీ వంట చేతగాదు. ఉద్యోగమన్నా మానేస్తాను. వంటైనా మానేస్తాను. రెంటినీ నేను చేయలేను" అంది వంటింట్లోంచే పార్వతి, రాజు భార్య.

పార్వతి కూడా ఆ కాలేజీలోనే బోటనీ లెక్చరరు.

'ఎవరీ అమ్మాయి?'

"నా స్టూడెంటు అరుణ. ఫస్టుగా పాసయింది. నీకు స్వీట్లు తెచ్చింది."

అరుణ ఆవిడకు నమస్కారం చేసింది. స్వీట్లు చేతిలో పెట్టింది.

"నేను వంట చేస్తానుండండి, మేడమ్! నాకు వంట చేయటం అంటే ఇష్టం." అంటూ వంట గదిలోకెళ్ళి అన్నీ చక్కగా వండింది అరుణ. పార్వతికి ఎంతో రిలీఫ్. ఇక వంటమనిషి రానప్పుడల్లా అరుణదే వంట. అంతేగాదు. ఇంట్లో కర్టెన్లు, పిల్లో కవర్లు, కుర్చీ కవర్లు, ఎంబ్రాయిడరీ వర్కు ఎన్నింటినో అరుణే చేసేది. పార్వతి అరుణల ఆప్యాయతలూ, అనుబంధం రోజురోజుకీ పెరిగిపోయాయి. బజార్లకీ, సినిమాలకీ పార్వతీపిల్లలతో అరుణ కూడా రావలసిందే.

రాజూ వాళ్ల ఫ్యామిలీ మెంబరు అయిపోయింది, అరుణ.

రాజూ, పార్వతీ కలిసి అరుణ ఇంటికి వెళ్ళినప్పుడు అరుణ చెల్లెళ్ళూ తల్లిదండ్రులూ వాళ్ళని ఎంతో గౌరవంగా చూసేవారు. మరో సంవత్సరం

గడిచింది. ఆరోజు రాజు ఒక్కడూ పేపరు చదువుతున్న సమయంలో అరుణ దిగాలుగా వచ్చి రాజు చేతిలో ఒక ఉత్తరం పెట్టి వెక్కి వెక్కి ఏడ్వటం ప్రారంభించింది.

"మీ అమ్మాయి అతిగా ముస్తాబయి మగపిల్లలతో సిగ్గు, బెరుకు లేకుండా నవ్వుతూ మాట్లాడుతుంది. పెళ్ళాం పిల్లలూ ఉన్న ఒకాయనతో సుఖ జీవనానికి అలవాటు పడింది. ఇది మీ అమ్మాయికి మంచిది కాదు. హెచ్చరించవలసిన బాధ్యత మీది" సంతకం లేని ఉత్తరమిది.

"మా నాన్న ఈ ఉత్తరం చదివి నీవు ఎవరితోనన్నా ఎంజాయ్ చేసావా, అంటూ ఏనాడూ పల్లెత్తు మాట అనని వాడు బెల్టుతో కొట్టాడు. నేనే పాపమూ చేయలేదు." అంది అరుణ బిక్కమొహంతో.

రాజుకి మతిపోయింది. "ఊరుకో అరుణా! ఊరుకో". ఎలా సముదాయించాలో అర్థంగాలేదు.

ఇటువంటి అపవాదులు అరుణకి ఎందుకు వస్తున్నాయి? తను మరే తప్పటడుగు వేయకముందే ఆగుకోవాలి.

"అరుణా! నేనంటే నీకిష్టమా!" ధైర్యంగా అడిగేసాడు రాజు.

"అవును మీరంటే నాకిష్టమే!" అంది అరుణ. రాజుకి మరీ అయోమయం అయింది.

దగ్గరకి తీసుకొని బుగ్గమీద ముద్దిచ్చాడు. అరుణ బుగ్గలు అరుణారుణ మయ్యాయి.

వారి శరీరాలు ఏకమయ్యాయి. అప్పటినుండి వారిద్దరూ ఎలాగో కలుసుకొంటూనే వున్నారు.

రాజు మనస్సులో సంచలనం బయలుదేరింది. "తను చేస్తున్నదేమిటి? పార్వతికి అన్యాయమా? అరుణకి మాత్రం న్యాయమేమిటి?

కాదు. ప్రపంచంలో ఎందరికి ఇద్దరు భార్యలు లేరు? ఎందుకు ఉండకూడదు? ముస్లిం అయితే ఒక న్యాయం, హిందూ అయితే ఒక న్యాయమా? అసలు ఇటువంటి స్త్రీని చేరదీసి రెండో భార్యగా చేసుకొంటే అటువంటి వారికి సమాజంలో ఒకవిధంగా గౌరవమిచ్చినట్లే. తనతోటి లెక్చరర్ రామేశంకి ఇద్దరు భార్యలు లేరా! తన ఇంటిప్రక్కన బ్రహ్మానందం అక్క

చెల్లెల్ని పెళ్ళి చేసుకోలేదా! ఇంటి వెనక పేరిశాస్త్రి ఇద్దరు భార్యలతో లేడా!

ప్రపంచంలో ఎంతమంది లేరు. ఇలా ఇది ఒక అడ్జస్టుమెంటు మాత్రమే. తనకి పార్వతి అరుణలు ఇద్దరూ కావాలి. వారిద్దరు తన రెండు కళ్ళు. పార్వతిని ఎలాగైనా ఒప్పించాలి."

కొంటె పిల్లలు అల్లరి ప్రారంభించారు. కాలేజీ బ్లాక్ బోర్డుల మీద శివుడూ పార్వతి నెత్తిమీద గంగా కార్టూన్లు వేసారు. పార్వతికి అనామక ఉత్తరాలు వచ్చాయి. పర్యవసానం ఇంట్లో శాంతికి లోపం. పార్వతి అసలే కోపిష్టి. అరుణని పిలిచి నిలదీసి అడిగింది. ఏమి చెప్పాలో తెలియక అరుణ బిత్తరపోయి "ఏమీ లేదు మేడమ్. అన్నా చెల్లెళ్ళ వరుస" అంటూ ఏడ్చింది.

"ఇక నీవు మా ఇంటికి రాకు" పార్వతి అరుణకి అల్టిమేటం యిచ్చింది. అరుణ రావటం మానేసింది. రాజు గుండెల్లో అగ్నిపర్వతాలు బ్రద్దలౌతున్నాయి. ఒక రోజు రాజే స్వయంగా పార్వతితో చెప్పాడు.

"పార్వతీ! నీ అనుమానం నిజమే. అరుణకీ నాకూ శారీరక సంబంధం వుంది. దీనిని తప్పించుకోలేను. నీ చెల్లెలే అనుకొని అరుణని కాపాడు. ~~ఈ~~ విషయం కడుపులో పెట్టుకో. నామీద నీకు ప్రేమంటూ ఉంటే అరుణని కూడా మన జీవితంలో భాగం పంచుకోనీ".

"నేను మీతో పాతిక సంవత్సరాలుగా సంసారం చేస్తున్నాను. నాలో ఏలోపం లేదు. మనకు ఎదిగిన పిల్లలున్నారు. నాకు సవితిని తెచ్చే అధికారం నీకెక్కడిది?" పార్వతి నిలదీసింది.

"పార్వతీ! అరుణని ఇన్ని రోజులుగా సొంతచెల్లెలు కంటె అధికంగా అభిమానిస్తున్నావు నీవు."

"తిండి, బట్ట ఇవ్వగలను. నా భర్త నాకు స్వంతం. నేను మరొకరితో షేరు చేసుకోలేను." ఖచ్చితంగా చెప్పింది పార్వతి.

"పార్వతీ! ఇది జరిగిపోయిన విషయం! నీ సొంత చెల్లెలనుకొని దాన్ని కాపాడు." ప్రాధేయపడ్డాడు రాజు.

"కుదరదు. అది నాస్వంత చెల్లెలే అయితే ఏనాడో చంపేసి వుండేదాన్ని." ఏడ్పులు, పెడబొబ్బలు, ఇల్లంతా రణరంగం.

★ ★ ★

ఆరోజు దిగాలుగా కాలేజి క్లోక్‌రూమ్‌లో కూర్చున్న రాజుతో అటెండరు

సత్యన్నారాయణ "సార్! అంత దిగులుగా ఉన్నారేమిటి?" అన్నాడు.

"ఏం లేదురా".

"బాధపడకండి సార్. మీ ఇంట్లో గొడవలు నాకు తెలుసు. దివాన్ చెరువు దగ్గర ఒకాయన ఉన్నారు. ఇటువంటి వాటిని ఎన్నిటినో కుదిర్చాడు. ఒకసారి వెళ్లిరండి సార్" అడ్రస్ ఇచ్చాడు.

★ ★ ★

ఆరు నిమ్మకాయలు మిగిలిన సరంజామాతో రెండో రోజు హాజరయ్యాడు రాజు దివాన్ చెరువు స్వామి దగ్గరకు.

గదిలో మడత కుర్చీమీదే కూర్చొన్న స్వామి రాజుని దగ్గరకు రమ్మని వెనక్కి తిరిగి కూర్చోమన్నాడు ఎదురుగా ఉన్న స్టూలుమీద. వీపు మీద పైనుంచి క్రిందకి రాస్తూ మంత్రాలు చదివాడు.

తాయత్తు ఇచ్చి 'మొలకు కట్టుకో' అన్నాడు.

మూడు నిమ్మకాయలు తిరిగి ఇస్తూ, 'సగానికి కోసి నాల్గురోడ్ల జంక్షన్లో పడేయి' అన్నాడు.

"మండలంలోగా నీపనై పోతుంది. వీలున్నప్పుడల్లా ఈ శ్లోకం చదువుకో. పో" తు.చ. తప్పకుండా చేశాడు. రెండు నెలలైంది! ఏ పనీ జరుగలేదు.

పార్వతి ఈ గొడవ కాలేజి ప్రిన్సిపాల్‌తో, కొలీగ్సుతో, కనిపించిన వారందరితో చెప్పడం ప్రారంభించింది. రాజుని ఆప్యాయతతో పలకరించే చాలమంది ఇపుడు తలలు త్రిప్పుకొని పోతున్నారు.

కొంతమంది ఆంతరంగికులు "ఏమిటి రాజా! మీ ఆవిడ అందరితో అంటుంది, నీవు ధర్మరాజువి కాదుట, ఇదివరలోలా! యమధర్మరాజువట. సవితిని తెస్తానంటున్నావట?"

"అవును బ్రదర్. పార్వతి నిజమే చెవుతూంది." అంతకంటే చెప్పలేకపోయాడు.

సత్యనారాయణ ఆరోజు "సార్, అరుణా వాళ్ళ నాన్నని పిలిచి నీ కూతురు నా భర్తని వల్లో వేసుకొంది, నా సంసారంలో నిప్పులు పోసింది. నేను గవర్నమెంటు ఉద్యోగిని జాగ్రత్త. మీ అందర్నీ ఏమిచేస్తానో! మీ అమ్మాయిని

అదుపులో పెట్టుకోండి, అని చెప్పారట సార్, మీ శ్రీమతిగారు" అన్నాడు.

పరిస్థితులు విషమిస్తున్నాయి. ఇంట్లో పార్వతితో రాజుకి మాటలులేవు. రాజు తిన్నాడో, తాగాడో పార్వతి పట్టించుకోవటం మానేసింది. రాజు ట్యూషన్లు చెప్పడం మానేశాడు. కాలేజీలో క్లాసులు పరధ్యానంగా చెపుతున్నాడు. కుర్రాళ్లు ఇతని క్లాసులో ఎక్కువ అల్లరి చేస్తున్నారు.

తాయత్తు తీసి పారేశాడు.

సత్యనారాయణ ఒక్కడే అప్పుడప్పుడు పలకరించేవాడు. "ఏం చేయను సత్యనారాయణా పార్వతిని ఒప్పించలేకపోతున్నాను. అరుణ, పార్వతి నా రెండు కళ్ళు."

సత్యనారాయణ మరో సలహా ఇచ్చాడు. "కోరుకొండ చీకట్ల సూర్య నారాయణగారి దగ్గర కెళ్ళండి సార్. ఆయన దగ్గరికి పెద్దపెద్ద వాళ్ళు, మినిష్టర్లు వెళుతూ వుంటారు. ఆయనకి అసాధ్యమైనదేదీ లేదుట."

కోరుకొండ హాజరయ్యాడు రాజు.

పురాతన మండువా. పెంకుటిల్లు. వరండాలో నాల్గు బెంచీలు, మనుష్యులెవరూ లేరు.

నీరు కావి పంచె కట్టుకొన్న పన్నెండేళ్ళ కుర్రాడు ఏమి కావాలంటూ వచ్చాడు.

"చీకట్ల సూర్యనారాయణ సిద్ధాంతిగారు కావాలి బాబూ"

"ఆయనకి ఒంట్లో బాగుండలేదు. వారబ్బాయిని, నన్నడగండి. మీప్రశ్నకి జవాబు నేను చెబుతాను."

"నీవు చెప్పేదిగాదు బాబూ" అని కుర్రాడిని బ్రతిమాలి, ఎలాగైతేనే ఇంటర్వ్యూ సంపాదించారు. వద్దంటున్నా కాఫీ ఇచ్చారు. అదయ్యాక గదిలోకి వెళ్ళాడు రాజు.

నలభై అయిదేళ్ళ స్థూలకాయుడు మంచంమీద కూర్చొన్నాడు. ఒత్తైన గిరజాల జుట్టు, నుదుట కుంకం, మెళ్ళో రుద్రాక్షలు, చేతికి కంకణాలు, ఉంగరాలు, ఎర్ర పంచెతో, కండువా కప్పుకొని ఉన్నాడు.

"నమస్కారం!" అన్న రాజుని ఎదురుగా స్టూల్‌మీద కూర్చోమని సైగ చేశాడు. చెవులు చూపిస్తూ "నాక్కొంచెం వినికిడి తక్కువ.. కొంచెం గట్టిగా

చెప్పండి."

ప్రక్కన నుంచొన్న కుర్రాడిని కాస్త బైటికి వెళ్ళమని, ప్రారంభించాడు రాజు. 'నాది రాజమండ్రి. కాలేజీ లెక్చరర్‌ని. అంతరంగిక సమస్య ఒకటున్నది నాకు. నాకనుకూలంగా దాన్ని పరిష్కరించాలి మీరు" అంటూ నమస్కరించాడు రాజు.

"ఆ! ఆగండి. ఇక నేను చెపుతాను." ప్రారంభించాడు సిద్ధాంతి. "మీ ఇల్లు దానవాయిపేటలో ఉంది. ఆ! అటుపిమ్మట పడమటి ముఖం ఇల్లు. ఎడమ వైపు పెద్దసందు. ముందు రెండు గదులు వెనుక రెండు గదులు. ఆ అటుపిమ్మట ముందు ఖాళీ తక్కువ. వెనక ఖాళీ ఎక్కువ. ఆగ్నేయంలో వంటగది. వంటగది ఇంటినానుకొని పొడుచుకున్నది. అవునా! కాదా! కాదంటే చెప్పండి."

ఆశ్చర్యంగా ఉందే. అంతా చూస్తున్నట్లు చెప్పేస్తున్నాడీయన. 'అవునండి' అన్నాడు రాజు.

"మొత్తం పన్నెండు గుమ్మాలూ, ఇరవై రెండు కిటికీలు, పది అలమారాలూ ఉన్నాయి. కావలిస్తే ఇంటికెళ్లి లెక్క పెట్టుకోండి."

నిజమే. రాజుకి తెలీదు. ఇంటికి వెళ్ళి లెక్కెట్టాలి. సిద్ధాంతి మళ్ళీ చెపుతున్నాడు.

'ఆ! అటుపిమ్మట, ఉత్తరం ఖాళీ పల్లంగా వుంది. ఈశాన్యం నొక్కింది. పొడుచుకొచ్చిన ఆగ్నేయం వంటగది మిగిలిన యింటికి కలసి వుండకూడదు.' అంతా చూస్తున్నట్లే చెప్పేశాడు.

'ఉత్తరం ఖాళీ స్థలం ఎత్తు చేయండి. లేకపోతే సంఘంలో మీమాటకి విలువుండదు. మీ సంపాదన అంతా ఖర్చే. ఆ అటుపిమ్మట వంటగది మిగిలిన ఇంటినుండి విడదీయండి. అలా వుంటే ఎప్పుడూ కళత్రంతో తగాదాయే.'

"మీరు చెపుతున్నదంతా నిజమే నండి" ఇక మిగతాది రాజే చెప్పాడు. 'నా భార్యతో ఇపుడు తగాదాగానే ఉందండి. విధివశాత్తు ఒక విధవరాలితో సంబంధం అయిందండి. దీన్ని తీవ్రంగా నా భార్య ప్రతిఘటిస్తుందండి. నా భార్యను సుముఖురాల్ని చేయాలి. రెండో ఆవిడ నా దగ్గరకి రావాలి. వాళ్ళిద్దరూ నా రెండు కళ్ళు. సఖ్యంగా నాతో కాపురం చేయాలి. ఎంతమందికి లేరండి ప్రపంచంలో ఇలా." అన్నాడు రాజు సిగ్గువిడిచేసి.

సిద్ధాంతి "నీకడుపు బంగారంగాను. నాకూ ఇద్దరు భార్యలేనయ్యా."

ఇంకేం! రాజుకి సంబరమయింది.

"ఆ! తప్పక ఆ విధంగా జరుగుతుంది. ముందు నే చెప్పిన మార్పులు మీ ఇంట్లో చేయించిరండి. అవసరమైతే నేనే మీ ఇంటికి వచ్చి చూస్తా."

ఏడువేలు ఖర్చుపెట్టి మూడు వారాల్లో అనుకున్న మార్పులన్నీ ఇంటికి చేయించాడు రాజు.

ఇక ఎప్పుడు అరుణా పార్వతులు సఖ్యంగా తనతో కాపురానికొస్తారో! ఆత్రుతగా కోరుకొండ పరిగెట్టాడు. పళ్ళు, ఫలాలు సమర్పించి 'గురూగారు మీరన్నవన్నీ చేశాను. పార్వతి ఎప్పుడు సఖ్యంగా వుంటుంది. అరుణ నా దగ్గర కెప్పుడు వస్తుంది?" అని అడిగాడు ఆత్రంగా.

"ఆ! నీ కడుపు బంగారం గాను" మరి కొన్ని శ్లోకాలు చదివాడు. "మంత్రాక్షతలిస్తాను. రాత్రి పన్నెండు గంటలకి అరుణ ఇంటిముందు జల్లు, అటుపిమ్మట వాటి వెంబడి నీ అరుణ పరిగెట్టుకొచ్చేస్తాది నీ దగ్గరికి...." అన్నాడు సిద్ధాంతి గంభీరంగా.

వాటిని పట్టుకొచ్చి ఆరోజు రాత్రి కుమార్ టాకీసుకి సెకండ్ షోకి వెళ్ళి, అరగంట ముందే బైటకు వచ్చి, నిర్మానుష్యంగా వున్న ఇన్నీసుపేటలో అరుణ ఇంటిముందు నుంచొని అక్షింతలు చల్లేశాడు రాజు. "బందిఖానాలో ఉన్న అరుణ తన దగ్గరకు రావాలి. పార్వతి ఒప్పుకోవాలి. పార్వతీ అరుణలు నారెండు కళ్ళు" అనుకుంటూ వచ్చి ఇంట్లో పడుకొన్నాడు రాజు.

అంతటితో ఊరుకోకుండా రాజు ఎన్నిగుళ్లను సందర్శించాడో, ఎందరి దేముళ్ళకు మొక్కుకొన్నాడో! ఎన్నెన్ని మొక్కుబళ్ళు ముందే తీర్చేశాడో! నాల్గు నెలలైంది.

ఫలితం శూన్యం.

కోరుకొండ సిద్ధాంతిమీద కూడ గురి తప్పిపోయింది. క్లోక్ రూమ్‌లో దిగాలుగా కూర్చున్న రాజుని మళ్ళీ సత్యనారాయణ పలకరించాడు. "సార్! దిగులు పడకండి. ఈసారి ఆకుదీకులపాలెం అన్నారం అనే ఆయన ఉన్నారు సార్. మా ఇంటి ప్రక్కన రాముడి గమిడిగేదె పోతే ఆరునెలల తరువాత ఆయన చెప్పాడు 'ఈనెల 10వ తారీకు ఉదయం గేదె వస్తది' అని. సరిగ్గా 10వ తారీకు నాటికి ఉదయం ఏడుగంటలకి గేదె రాముడి యింటిముందు

ఉంది సార్!" అన్నాడు సత్యన్నారాయణ చంకలెగరేసుకుంటూ.

"ఇక నమ్మకం లేదురా. వీళ్ళెవరూ ఏమీ చేయలేరు."

"కాదుసార్. ఈ ఒక్కసారికి వెళ్ళండి."

పార్వతి, పిల్లలకి అన్యాయం చేస్తున్నాడో, అరుణకి అన్యాయం చేస్తున్నాడో తెలియటం లేదు.

"సరే అలాగే" అన్నాడు రాజు చివరికి.

ఆకుదీకుల పాలెంలో కర్ణంగారి ఇంటిప్రక్క అన్నారం సిద్ధాంతిగారి దగ్గర వాలాడు రాజు. ఆయన వ్యవసాయం చేసుకొనేవాడు. మానేసి దుర్గాదేవి భక్తుడై శక్తిని సంపాదించి వాస్తు, సాముద్రిక జ్యోతిషాలని తెలిసికొన్నాడట.

బలంగా ఎత్తుగా పంచెకట్టుకొని లాల్చీ వేసుకొని తలకి అంటకత్తె రేయించుకొని బొట్టు, రుద్రాక్షమాలలతో వున్న ఆయనకి నమస్కారం చేశాడు రాజు.

ఆయన బలవంతంగా కాఫీ తాగించాడు రాజుతో. రాజు మళ్ళీ తన కథను విన్నవించుకొన్నాడు.

"నీకు ఇది పూర్వజన్మ ఫలం. అనుకుంటే రాదు. నీకు ఇద్దరు భార్యలు రాసిపెట్టే వుంది. నీవు తప్పించుకోలేవు." ఒక శ్లోకం చదివాడు సిద్ధాంతి.

"మీరేవిధంగా చేస్తారో! నేననుకున్న విధంగా నా పార్వతి అరుణలు నాతో సఖ్యంగా కాపురం చేయాలి. మిమ్మల్ని సంతోషపెట్టే బాధ్యత నాది." అన్నాడు రాజు.

"నేను చెపుతున్నాను కదా. పార్వతితో ఈ తాత్కాలిక ఎడబాటు విధి లిఖితం. అరుణ నీదగ్గరకి రాకపోతే నీవు చచ్చిపోతావు. మీరు ముగ్గురు కలిసి కాపురం చేస్తారు."

"కాకపోతే కొన్నాళ్లు అరుణని వేరేగా వుంచాల్సి రావొచ్చు."
"దానికేముందండి. అవసరం వస్తే అలాగే. కాని వాళ్ళిద్దరు ఒక ఇంట్లో నాతో సఖ్యంగా ఉండేట్లు చూడండి. సిద్ధాంతి గారూ" అంటూ ప్రాధేయపడ్డాడు రాజు.

"తప్పక చేస్తాను. పూజలు చేస్తాను. నీ భార్యకూడ లెక్చరర్ అన్నారు

కదా!" అన్నాడు సిద్ధాంతి.

"అవునండి. ఆవిడ మా కాలేజీయే. బోటనీ లెక్చరర్" అన్నాడు రాజు.

"నేను స్వయంగా వచ్చి మాట్లాడుతాను ఆవిడతో".

"అంతకంటేనా! మీరు మాట్లాడితే ఆవిడ మనసు మార్చుకోవచ్చు" నమస్కారం చేసి వచ్చేసాడు రాజు.

★ ★ ★

వారంరోజుల తరువాత సత్యన్నారాయణ "అన్నారం సిద్ధాంతి అమ్మగారితో నిన్న మాట్లాడుతున్నాడు సార్ డిపార్టుమెంటులోనే.." అన్నాడు రాజుతో.

"అయితే అసాధ్యుడే. మన పనికిక ఢోకాలేదు" అనుకున్నాడు రాజు.

ఆరోజు అన్నారం సిద్ధాంతి ఇంటికే వచ్చాడు. పిల్లలతో పార్వతి బజారు కెళ్లింది. ఇల్లంతా కలయచూశాడు. వాస్తు లోపాలు లేవన్నాడు.

"ప్రహరీ అవతల బూరుగుచెట్టు అలా ఎండి పోయిందేమిటి?" సిద్ధాంతి ప్రశ్న.

"అయిదారు నెలలైంది. చెదపట్టిందేమో. చాలా ముసలి చెట్టు." జవాబిచ్చాడు రాజు.

"మీ ఆవిడ యింట్లో ఏమన్నా పూజలు చేయించిందా? దాని తరువాత అలాగ చెట్టు మాడిపోయిందా?" సందేహం వెళ్లబుచ్చాడు సిద్ధాంతి.

"నాకు తెలిసినంతవరకు అలాగేమీ జరగలేదు. అయినా అది ప్రక్క ఇంట్లో చెట్టు గదా!" అన్నాడు రాజు.

"నీ జీవితంలో అరుణ రాకపోతే బూడిదై పోతావు. ఈ సంబంధం పూర్వజన్మ ఫలం" నిక్కచ్చిగా చెప్పాడు సిద్ధాంతి. రాజుకి సంతోషం వేసింది.

"నా మూలంగా అరుణని ఇంట్లోనే బంధించారు. దానికి ఎలాగైనా బందిఖానా నుండి విముక్తి కలిగించాలి." అన్నాడు రాజు.

"అరుణ అడ్రసు చెప్పండి. వాళ్ళ నాన్నతో కూడ మాట్లాడతాను. పార్వతితో మాట్లాడాను. చాల మొండి మనిషి. గాబరా వద్దు. నా మాట వింటుంది." అంటూ ధైర్యం చెప్పాడు సిద్ధాంతి.

రాజు ఇన్నీసుపేటలో అరుణ అడ్రసు ఇచ్చాడు. నాల్గురోజుల తరువాత సత్యనారాయణ చెప్పాడు. "అన్నారం సిద్ధాంతి కూతురికి అమ్మగారే ప్రిన్సిపాల్‌తో చెప్పి బి.ఎస్.సి.లో సీటు ఇప్పించారండీ."

'బాగుంది. పార్వతితో పనులు కూడ చేయిస్తున్నాడే సిద్ధాంతి. ఘటికుడే.' అనుకున్నాడు రాజు.

ఆరోజు సాయంకాలం ప్రక్కింట్లో నలభై అడుగుల బూరుగు చెట్టు నిలువునా కూలిపోయింది.

మరుసటి రోజు మధ్యాహ్నం తలనొప్పిగా వుందని పర్మిషన్ పెట్టి రెండు గంటలకి ఇంటికొచ్చాడు రాజు. రోడ్డుప్రక్కగా స్కూటర్‌బెట్టి గేటు తీసేందుకు వెళ్ళాడు.

"సార్! ఆయన పిలుస్తున్నారు." రోడ్డుమీద ఎవరో ఉన్నారు. అటు చూస్తే స్కూటర్ దగ్గర యూనిఫారం వేసుకొని ఒక సబ్ ఇన్‌స్పెక్టర్ "ఇక్కడ పెట్టారేంటి మీ స్కూటర్‌ని, ఈ వీధిలో స్కూటర్ని పార్కు చేయకూడదు. మీకు తెలియదా?" అని గర్జించాడు.

"అది నా ఇల్లు. గేటు తీసి లోపల పెడుతున్నాను."

"కుదరదు మీమీద కేసు వ్రాస్తున్నాను."

"సరే రాసుకోండి"

"పదండి. స్కూటర్ ఎక్కండి."

"ఇప్పుడేమిటి?"

"మిమ్మల్ని డియస్పీ గారు వెంటనే తీసుకొని రమ్మన్నారు. పదండి."

"మరి దానికి డొంక తిరుగుళ్ళెందుకు?"

రాజుని కూర్చోమని వెనక సీట్లో ఇన్‌స్పెక్టరు ఎక్కి బలవంతంగా రాజుని డియస్పీ దగ్గరకు తెచ్చాడు.

డైరెక్టు రిక్రూట్ లాగున్నాడు. డియస్పీ కుర్రాడే.

"రండి మాష్టారు కూర్చోండి! మీ ఇంట్లో విషయాలు జాగ్రత్తగా చూసుకోవాలి సార్."

"ఏమిటి?"

"మీరు మరొక యువతిని తెమ్మని మీ భార్యను హైరాన చేస్తున్నారట.

ఇవి చట్టవిరుద్ధం. నేను మీ స్టూడెంటుని. అందుకే ఆ ఫైల్‌ను అలా నొక్కిపెట్టి మిమ్మల్ని పిలిపించాను."

"పార్వతి తనమీద పోలీసు రిపోర్టిచ్చిందా" విస్తుపోయాడు రాజు.

"పార్వతిగారు మళ్ళీ కంప్లెయింటిస్తే మిమ్మల్ని అరెస్టు చేయాల్సి వుంటుంది."

రాజు తల తిరుగుతోంది.

డియస్పీ "రమ్మను వాళ్ళని కూడా లోపలికి" అన్నాడు ఇన్‌స్పెక్టరుకేసి చూసి. అరుణ, వాళ్ల నాన్న వచ్చారు.

"అరుణ నాకోసం ప్రాణాల్ని కూడ ఇస్తుంది" అనుకున్నాడు రాజు.

ఆవిడకోసమేగదా తన తాపత్రయం అంతా. ధైర్యం వచ్చింది రాజుకి.

"అడగండి ఆవిడ ఏమి చెపుతుందో" అన్నాడు డియస్పీ రాజుతో.

రాజు నెమ్మదిగా "అరుణా నీ సూదిముక్కు, నీ కళ్ళు, నీ పెదాలు సర్వస్వం నావే కదూ! నీవే చెప్పావు. నిర్భయంగా చెప్పు. నేను ప్రపంచాన్నే ఎదిరిస్తున్నాను నీకోసం. పార్వతి ఎప్పటికైనా నా మాట వింటుంది గాబరా పడకు".

"వీడి దగ్గర నేను చదువుకున్న మాట వాస్తవమే సార్" అంది అరుణ. ఉలిక్కిపడ్డాడు రాజు ఆ సంబోధనకి. డిఎస్పీని చూస్తూనే మాట్లాడుతోంది అరుణ.

"ఏమిటి యీ ఏకవచన ప్రయోగం - నాలో ప్రతీ రక్తపు బొట్టూ మీకై తపిస్తుంది - అన్న అరుణేనా?" అనుకుని విస్తుపోయాడు రాజు.

"ఇతనికి నాకూ ఏమీ సంబంధం లేదు. నాకే యిష్టమైతే నన్నెవరూ ఆపలేరు సార్! నేనే వచ్చేదాన్ని అతని దగ్గరికి. నన్నెవరు బంధించలేదు" అంది అరుణ.

ఇంకా చెపుతోంది. "నాకు పెళ్లి సంబంధాలు వస్తున్నాయి. నేను మళ్లీ పెళ్లి చేసుకుంటాను. నన్నేమైనా హైరానా చేస్తే వూరుకొనేది లేదు."

"ఇదిగో కాగితం మీద వ్రాసిస్తున్నాను డియస్పీగారూ! నాకు పెళ్ళి కుదిరితే మీకే మొదటి పెళ్ళి కార్డు యిస్తాను" అంది అరుణ ఎంతో ధీమాగా.

రాజు మనసులో మెదులుతున్నాయి అరుణ ఇదివరలో చెప్పిన బాసలు "నాకంటూ పెళ్లి జరిగితే మీతోనే. అది ఎప్పుడో అయిపోయింది. నాకింకా మా వాళ్ళు పెళ్ళి చేస్తే అది నా శవానికే. నేను మళ్ళీ పెళ్ళి చేసుకొంటాననుకుంటున్నారా?" అన్నమాటలు ఏమయ్యాయి.

డియస్పీతో యింకా ఏమో చెప్పి అరుణ, వాళ్ల నాన్న వెళ్ళిపోయారు. రాజు బుర్రకేమీ ఎక్కటం లేదు. అరుణ అబద్ధమాడుతోంది. గొణుక్కున్నాడు రాజు.

"చూడండి మాష్టారూ, అరుణ చెప్పింది విన్నారు గదా! యిక పార్వతి గారితో సుఖంగా వుండండి, వెళ్ళిరండి!" అన్నాడు డియస్పీ.

నడుచుకుంటూ వచ్చి మునిసిపల్ పార్కు బెంచి మీద పడుకొన్నాడు రాజు. ఎక్కడ పడుకొన్నాడో, ఎక్కడ తిరిగాడో రెండు రోజుల తరువాత అనాలోచితంగా యింటి గుమ్మం దగ్గరికి వచ్చాడు. గుమ్మం దగ్గర అప్పుడప్పుడే పైట వేసుకొంటున్న పెద్ద కూతురు "ఛీ, నీవు మానాన్నవని చెప్పుకోవటానికి సిగ్గేస్తుంది. మా అమ్మని అన్యాయం చేస్తావా?" అంటూ తాగుతున్న కాఫీ రాజు ముఖంమీదికి విసిరింది. వెనకాలే వచ్చిన పార్వతి "పోరా!పో, నీకు ఆ కులటే కావాలంటే అక్కడకే పో! దాన్ని ముట్టుకొన్న నీవు మళ్ళీ నాతో కాపురం చేయాలనే వచ్చావా, పో!" అంటూ అరచింది.

నీరసపడిపోయి ఏం జరుగుతుందో అర్థంగాని రాజు మళ్ళీ వీధిన పడ్డాడు.

దారిలో ఎదురైన సత్యనారాయణ "సార్ అదేమిటి ఆ గెడ్డంఏమిటి? అలా పీక్కు పోయారేమిటి? బాధపడకండి సార్! అన్నీ మనమనుకున్నట్లే జరగవు సార్!"

చెప్పకూడదనుకొని మరొక విషయం కూడా చెప్పాడు. "అరుణని భార్యపోయిన ఒక మద్రాసు వాడికిచ్చి పెళ్ళి చేశారు, సార్! నిన్ననే వాళ్లిద్దరూ మద్రాసు వెళ్ళిపోయారు."

వెర్రిగా చూస్తున్నాడు 'ఏది దారి?' అర్థం గాలేదు.

రాజు గోదారి వైపు సాగిపోయాడు.

*(విశాలాంధ్ర దినపత్రిక అనుబంధం, 7-11-1993)*

12

# కోనసీమలో పెళ్లిపందిరి

**రాజుగాడి పెళ్ళికి మేము నలుగురం రాజమండ్రి బయలుదేరాం. మా స్నేహితుల్లో ఒకొక్కరికి పెళ్ళిళ్ళు అయిపోతున్నాయి. మేము ఎ.వి.ఎన్. కాలేజి స్టూడెంట్లము. మా చదువులో ఆఖరి సంవత్సరం. నిజ జీవితంలో అడుగు పెట్టి స్థిరపడే సమయం.**

ఇటువంటి తాపత్రయం మా పొట్టి రామారావుకి మొదట్నించి ఎక్కువగా వుండేది.

పొట్టి రామారావు ఇప్పుడేమి పొట్టి గాదు. ఐదడుగుల ఎనిమిది అంగుళాల పొడవును ఇండియాలో పొట్టి అని ఎలా అంటాము? కాని మనవాడికా పేరు వచ్చేసింది. మొదటి సంవత్సరం బి.ఎస్.సి. లో చేరేటప్పటికి వాడి ఎత్తు నాలుగు అడుగులు మాత్రమే. కాని రెండేళ్ళ హాస్టలు భోజనం బాగా వంటబట్టిందో లేక వాడికది పెరిగే వయసో కాని అమ్మోనియా ఎరువు వేసిన హైబ్రిడ్ జాతి కాయకూరలాగా ఏపుగా పెరిగి పొడవైపోయాడు.

చెప్పదగ్గ గుణాలు అతనికి ఇంకా ఎన్నో వున్నాయి. బినాకా టూత్ పేస్టు ఎడ్వర్టైజ్‌మెంటుకి పనికొచ్చే ఎత్తయిన పళ్ళు, ఆకర్షణీయంగా వుండాలనే తాపత్రయం, శ్రుతి మించి చేసుకునే అలంకరణ, ముఖానికి కోటింగులు ఈ పద్ధతిగా ఏ చిన్నఫంక్షన్‌కు వచ్చినా తనకున్న ఒక్క తెల్ల సూటు, బ్రౌన్ టై వేసుకుని ప్రత్యక్షమయ్యేవాడు.

చిన్నతనంలో తను హైదరాబాద్‌లో చదువు వెలగబెట్టాడు. దానితో హిందీ-ఉర్దూ, ఇంగ్లీషు అనర్గళంగా మాట్లాడి జనాల్ని అదరగొట్టేవాడు. నోటమ్మట సరిగా మాటలు రాని మాకు అసూయగా వుండేది.

రామారావుకి మరొక వింతయిన అలవాటున్నది. సంవత్సరమంతా పేస్టు

చేసుకొని చదవడం దేనికి?

పరీక్ష సమయంలో ఆఖరి నెల లేక పదిహేను రోజులలో సిలబస్ అంతా చదివేయలేమా? మరీ అంత తెలివి తక్కువ వాళ్ళం కాదు కదా అనే దురభిప్రాయం మాలో మాకే లోతుగా పాతుకుపోయి వుండేది. ఇక ఈ ప్రయత్నానికి గాను రాత్రంతా మేలుకుని వుండేందుకు, పగలంతా కష్టపడి లిమిట్ లేని కాఫీలకు, సిగరెట్ల- నిత్యధూపాలకి ఏర్పాట్లు చేసుకునే వాళ్ళం.

చచ్చీ - చెడీ అన్ని ఏర్పాట్లు చేసుకుని రాత్రి తొమ్మిది గంటలకు చదువుకి ఉపక్రమించేసరికి మా రామారావు ప్రత్యక్షమయ్యేవాడు.

అప్పుడు ఇతని పేరు ఆల్ ఇండియా రేడియో. ఏ వయసులో వానినైనా, ఆడనైనా, మొగనైనా మాటల్లో దింపి ఎన్నెన్నో కబుర్లు చెప్పి టైమ్ సెన్సు లేకుండా చేసేవాడు. క్లాసులో అమ్మాయిల నందరిని వేరువేరుగా విభజించి గుమ్మడికాయల జాతని, మరో జాతని, ప్రతి ఒక్కరికి ఉచిత బిరుదులు, మారు పేర్లను ప్రసాదించడంలో మా రామారావు దిట్ట. సున్నుండ, సోడాబుడ్డీ, జింటో, అప్పలమ్మ మొదలయినవి ఈయన బహూకరించిన పేర్లలో కొన్ని. 'అప్పలమ్మ నెత్తిమీద కప్పలాట' అనికట్టిన పాటల బాణి పిక్‌నిక్‌లో ఎలా పాడాలో చెబుతాడు. లెక్చరర్లని ఎలా బోల్తా కొట్టించాలో చెబుతాడు. ఇక ఇవి అవి యేమిటి యే విషయం వచ్చినా అనర్గళంగా లెక్చర్లు కొట్టేస్తాడు. మాకు స్పృహ వచ్చేసరికి ఏమయ్యేదంటే వంటిగంటైె పోయి మేము నిద్రపోయేవాళ్ళం. రామారావుకి మాత్రం నిద్రేపోయేది. రూమ్‌కి పోయి చక్కగా రుబ్బేసేవాడు. పరీక్షలో రామారావు మాత్రం మంచి మార్కులతో పాసైపోయేవాడు.

అప్పటినుండి మేము వాడంటే జాగ్రత్త పడ్డాం. అందుకనే మా నారాయణకి వాడంటే కోపం. 'యూస్‌లెస్ ఫెలో, మమ్మల్నీ చదువుకోనీరా ఫూల్' అని తిట్టేవాడు. నారాయణరావు నిజంగా నాప్రాణ స్నేహితుడు. వాడి వల్ల చాలా ఉపకారాలు పొందాను. కాని వాడు చాలా సన్నగా వుండేవాడు. ఈ వీక్ పాయింటుని తీసుకుని రామారావు నారాయణ్ని 'శవం' గాడని, 'కొంగ నడక వాడని' గేలిచేసేవాడు. నారాయణ ముష్టిఘాతాలకి భయపడి ఆ పేర్లను సరిచేసి "స్వాన్" అని మార్చాడు. వాడి దృష్టిలో మాత్రం దాని అర్థం శవం అనే. ఈ తగువు వల్ల నారాయణ రామారావుని మాతో పెళ్ళికి రాకుండా చేద్దామని ప్రయత్నించాడు. నేనే ఏదోవిధంగా ఎంటర్‌టైనింగ్‌గా వుంటాడని, కలిసి వుంటే కలదు సుఖమని వాడిని మాతో వచ్చేందుకు ఒప్పించాను.

మూడోవాడు మా కృష్ణ. బలంగా వుంటాడు. ఆ వరం ఎలా

సంపాదించాడో గాని వాడు నిజంగా వృకోదరుడే. వాడిని భోజనానికి పిలిచిన వారు ఎవరయినా గాబరా పడాల్సిందే. హోటల్‌కి వాడితో వెళితే తగాదా. ప్లేట్ల లెక్కకాదు వాడిది. అప్పటికి రెడీగా వున్న వాయిలోని అన్ని ఇడ్లీలు, లేక డేగిసాలో వున్న ఉప్మా పూర్తిగా అలా తయారయిన సరుకుని పూర్తిగా ఆరగించేవాడు. పెద్ద స్కేలు పెళ్ళిళ్ళలో ఏదోవిధంగా సరిపెట్టుకోవచ్చునని వుబలాట పడుతూ వుంటాడు. వీడు రోజా పెళ్ళికి రడీ!

నాలుగోవాడిని నేను. నా గురించి నేను చెప్పుకోవడం అంత బాగుండదు. అంతా కలసి రాజమండ్రి పెండ్లి ఇంటికి సకాలంలో చేరాము.

పెళ్ళి పందిట్లో అంతా సందడిగా తిరుగుతున్నారు. సన్నసన్నగా 'పిలచిన బిగువటరా' పాట సన్నాయి వాయిద్యగాళ్ళు చక్కగా వాయిస్తున్నారు. మృదంగ వాయిద్యగాడు ఆ పాటలో లీనమై తల, దానితో పాటు జుట్టు, ఒళ్ళు వేటినీ దాచుకోకుండా వూగిపోతూ వాయించేస్తున్నాడు. మధ్య మధ్య రాజుల్లా డ్రెస్ చేసుకున్న బేండ్ మేళం వారు కూడా హిందీ పాటల ట్యూన్‌లను వాయిస్తున్నారు.

చిన్న పిల్లలు కొబ్బరి ఆకులతో వేసిన పందిరి స్తంభాలను పట్టుకొని పరుగెడుతూ నన్నుముట్టుకో ఆటలు ఆడుతున్నారు. వయస్సులో వున్న పెళ్ళికాని అమ్మాయిలు శక్త్యనుసారం ముస్తాబయి నచ్చినవారికి చిరునవ్వులు, విరితూపులు సారిస్తూ కూడా హడావిడిగానే తిరుగుతున్నారు. వీరిని ఒక కంట కనిపెడుతూనే వున్నారు, వారి తల్లులు, పిన్నులు, అత్తలు. పందిరిలో వేసిన కుర్చీలలో సుఖాసీనులైన పెద్దవారు సిగరెట్లు, చుట్ల పొగలు త్రాగుతూ, కర్పూరపు పుల్లల్ని వాసన చూస్తూ, పెళ్ళికాని వారి పిల్లలకి ఆ పందిరిలోనే ఏమయినా భవిష్యత్తు దొరుకుతుందా అని వెతుకుతున్నారు.

రాజు తమ్ముడు మమ్మల్ని గుర్తు పట్టి అన్నగార్ని పెళ్ళి కొడుకుని చేస్తున్నారని ప్రక్కనే వున్న విడిది లోనికి మమ్మల్ని ప్రవేశపెట్టాడు. ఏర్పాట్లు ఘనంగా వున్నాయి.

మేమంతా వచ్చినందుకు రాజు చాలా సంతోషించాడు. మాకు ఇబ్బంది కలుగకుండా చూసుకోమని రాజు తమ్ముడికి గట్టిగా చెప్పాడు.

"ఒరేయ్ రాజు! మాకు అటెండెన్సు మార్కు చేశావు గదా! పెళ్ళి పందిరిలో ముహూర్తం టైముకి కలుసుకుంటాం" అని చెప్పి హుటాహుటి విడిదికి వచ్చేశాము. వెంటనే చదువులోనికి దిగిపోయాము. చదువంటే పేకాట. కాని

రామారావు నెమ్మదిగా తప్పించుకుని బైటకి వెళ్ళిపోయాడు. వాడికి ఈ చదువు అంతగా పట్టదు లెండి.

పురోహితుల మంత్రోచ్చారణాలతో మావాడి పెళ్ళి పూర్తయింది. కాని ఆ ముహూర్తానికే రామారావులో మార్పు కనిపించింది.

"ఏమిరా ఇలా వున్నావు? వంట్లో బాగోలేదా! ఏమయింది?"

సరి అయిన జవాబు రాలేదు.

వాడా రోజు పెళ్ళి భోజనం కూడా సరిగా చేయలేదు. కృష్ణ మాత్రం యాభై లడ్డూలు, యాభై కాజాలు మిగిలిన వాటిని కూడా అదే లెక్కలో ఎక్కించి త్రేన్చాడు.

సాయంకాలం టిఫిన్ల తరువాత ఈమని శంకరశాస్త్రిగారి వీణ కచేరి ప్రారంభమయింది.

రామారావు విషయంలో కొంచెం అనుమానం అక్కడ వేసింది. వాడి దృష్టి మరొక వైపుంది. సరోజ కూడా మా క్లాస్‌మేట్. పెళ్ళి కొచ్చినట్లుంది. ఆడవాళ్ళ వైపు కూర్చున్న సరోజ, రామారావుల చూపులు కలసే వున్నాయి. మధ్యలో చేతులు అడ్డంగా వూపినా రామారావు అదే లోకంలో వున్నాడు. అప్పుడు అర్థమయింది మాకు, వాడికి ప్రేమ రోగమంటుకున్నదని. మేము పేకాడుతున్న సమయంలో రామారావు బైటికి వచ్చినప్పుడు ఆ అమ్మాయితో మాట్లాడే భాగ్యము కలిగిందని వాడు తరువాత చెప్పాడు.

ఇక రాజు పెళ్ళయి ఒకింటి వాడయాడు. వాడిని అభినందించి తిరిగి వైజాగు వచ్చేశాము.

మళ్ళీ రొటీనులో పడ్డాము. క్లాసులు, లేబరేటరీ వర్కు వగైరా.

అప్పుడప్పుడు రామారావు సరోజ గురించి కొన్ని కుతూహల విషయాలు చెప్పేవాడు. వాడు చెప్పేవాటిలో కొన్నిటిని నమ్మకూడదని, కొన్నిటిని సెన్సారు చేయాలని మాకు తెలుసు.

వాడు చెప్పే విషయాలు, విశేషాలు - సరోజ వరసకి తన మేనత్త కూతురే అని, వాళ్ళు బాగా డబ్బున్న వాళ్ళని, సరోజ తమ్ముడికీ కూడా తనంటే ఇష్టమని కాకా పట్టేశాడు. వాళ్ళ వూరు పనిగట్టుకొని వెళ్ళి సరోజ తల్లిని (తండ్రి చిన్నతనంలో పోయాడట) కలిసికొని పళ్ళిచ్చి, కాళ్ళకి నమస్కరించానని...

ఒక సంవత్సరంలో ప్రోగ్రసు ఏమిటంటే వాళ్ళిద్దరు బీచిలకు, సినిమాలకు ఫ్రీగా తిరగడం. రోడ్లమీద సరోజ కనబడితే చాలు రామారావు మమ్మల్ని చాలా దూరంగా నిలబెట్టి.. ఇక వాళ్ళిద్దరూ అలా మాట్లాడుకోవడమే. మేము విసుగెత్తి

"ఇదేమి సోదిరా బాబు"

అనుకుని వాళ్ళిద్దరినీ అలా వదలేసి కదలిపోయేవాళ్ళం. తత్ఫలితంగా రామారావు కూడా ప్రీ ఫైనల్‌లో ఒక సబ్జక్టు తప్పాడు.

ఆ రోజు కృష్ణ ఒక తాజా వార్త తెచ్చి సంచలనం రేపాడు.

వీడు రామారావునీ సరోజనీ 'మనోహర్' లో చూశాడు. సరోజకి అక్కడ వాంతి అయింది. మేము అంతా ఆశ్చర్యపోయాం. రామారావు ఇంత అడ్వాన్సు అయిపోయాడా అని. కుతూహలాన్ని చంపుకోలేక వాడిని మా రూముకి లాక్కొచ్చి నిలదీసి అడిగాం. వాడు అటువంటిదేమీ లేదని బతిమిలాడుతూ ఈ క్రింది కథ చెప్పాడు.

ఫైవ్ స్టార్ హోటల్‌కి తీసుకుని వెళ్ళిన ఘనతను దక్కించుకుందామని సరోజను హోటలు మనోహర్‌కి తీసుకుని వెళ్ళాడు. ఎయిర్ కండిషన్ చలిగానే వుంది. బేరర్లు మసక మసకగా కనిపించినా నీటుగానే వున్నట్టున్నారు. డల్ లైట్లలో తడుముకొని జాగ్రత్తగా వెళ్ళవలసి వచ్చింది. కులాసాగా కూర్చుని చాలాసేపు సన్నగా వస్తున్న సంగీతం వింటూ మాట్లాడుకున్నారు. ఇలా కొన్ని గంటలయాక బేరరు ఏమిటి అన్నట్టుగా పలకరించాడు. డబుల్ కట్‌లెట్, వెజిటబుల్ బిరియాని, ఆలుకట్టర్ కర్రీ ఆర్డరిచ్చాడు. వాటిని తింటున్నపుడు రామారావు సహజ ధోరణిలో ఫైవ్ స్టార్ హోటళ్ళు, డల్ లైట్ల మీద లెక్చరు ప్రారంభించాడు.

"సరోజా ఈ డిమ్‌లైట్లు ఇటువంటి పెద్ద హోటళ్ళలో ఎందుకు పెడతారో తెలుసా?"

"ఊహు తెలియదు. కట్లెట్టు బాగుంది కదూ!"

"తింటున్న వాటిలో ఎండు మిరపకాయ అది కాకపోవచ్చు"

"సరేలేబాబు. ఇక చెప్పకు! రుచిగా వున్నాయి కదూ!" అంది సరోజ.

రామారావు ఊరుకోలేదు.

"ఎండు మిరపకాయలు బొద్దింకలు కావచ్చు! జీలకర్ర, ఆవాలు అలాంటి

పురుగులు కావచ్చు! చీకటిలో తినేస్తారు"

సరోజ సడన్‌గా తినడం ఆపి సింకు దగ్గరకెళ్ళి వాంతి చేసుకొని రామారావుని తెగతిట్టి "ఇటువంటి హోటళ్ళకి నన్ను తీసుకుని రాకు" అని వెళ్ళిపోయింది.

కథ నిజమే కావచ్చు.

ఈ చిరు కలహాన్ని అధిగమించి సరోజను ప్రసన్నురాలిని చేసుకునేందుకు మరికొన్ని రోజు లయ్యాయట.

ఇక మేమంతా ఒక నిర్ధారణకి వచ్చేసాము. రామారావు కూడా దగ్గరలో ఎప్పుడో శుభలేఖ ఇచ్చేస్తాడు. ఏమయినా ఘటికుడే. ప్రేమ పెళ్ళిలాగా మేనత్త కూతురునే చేసుకుంటున్నాడు. మేమంతా కొంచెం అసూయ పడిన మాట వాస్తవం.

అదృష్టవశాత్తూ మేము నలుగురం ఫైనల్ పరీక్షలో పాసైపోయాం.

బరువెక్కిన మనసులతో స్నేహితులమంతా వీడుకోలు తీసుకొని ఎవరి గూళ్ళు వారు చేరాము. గిర్రున రెండు సంవత్సరాలు గడిచిపోయాయి. ఈరోజు నారాయణ పెళ్ళి శుభలేఖ వచ్చినపుడు ఆనందంతో ఉరకలు వేసింది మనసు. స్నేహితులను మళ్ళా చూసుకోవచ్చు. కోస్తా జిల్లాల పచ్చదనాన్ని చూస్తూ ట్రైను మీద, పడవమీద, బస్సుమీద, గుర్రం బండిమీద ప్రయాణం చేసి రిక్షాలో అమలాపురం వెళ్ళి వందిరికి చేరేసరికి సాయంకాలం ఆరు గంటలయింది.

నారాయణ ఆప్యాయంగా స్వాగతం పలికాడు. సాయంత్రం అక్కడ వారి బంధువులు పెద్ద పెద్ద వాళ్ళు, మొగవారంతా గుమిగూడారు. బోగంమేళం వాళ్ళకి ఆనవాయితీ, అత్యవసరం. నాకు వాళ్ళ మధ్య కెళ్ళటం సిగ్గేసింది. కాని లోపల హుషారుగానే వుంది.

"సముద్రాలన్నీ సారా అయితే
కాలువలన్నీ కల్లు అయితే
లోకాలకి నేనే రాజౌతా
చక్కని సాని పిల్ల పక్కలో వుండాలోయ్
అదీ ఇదీ కాకపోతే కందిపప్పు నేతి చుక్కాకలిపి
కొట్టాలోయ్"

సరసాలు, సరదాలుతో అక్కడి పెద్దల్ని చూసేందుకు ఆశ్చర్యం వేసింది.

మరుసటి రోజు పెళ్ళి సమయానికి పెళ్ళి పందిరి చేరాను.

అంతా సందడిగా తిరుగుతున్నారు. సన్నాయి వాయిద్యం. బేండ్ మేళం ఒకరి తరువాత ఒకరు పాటలు వాయిస్తున్నారు.

పందిట్లో చిన్న పిల్లల ఆటలు, పడుచు పిల్లల పరుగులు, పెద్దల ఆలోచనలు, మళ్ళీ రాజు గాడి పెళ్ళిని తలువుకు తెచ్చాయి.

"ఒరేయ్ మూర్తి"

అంటూ కృష్ణ పలకరించాడు.

"ఏమిరా ఇంత ఆలస్యం! నేను నిన్ననే వచ్చా. ఎంతో ఎంటర్‌టయిన్ మెంటు మిస్సయ్యావు"

కృష్ణతో పాత కథల్ని మళ్ళీ చెప్పుకుంటున్నాము.

రిక్షాలో దిగుతున్న రామారావును చూశాను. కృష్ణతో "దిగేది రామారావేనా" అడిగాను.

"అవు"నన్నాడు.

"ఏమిటి రామారావు ఇలా మారిపోయాడు? ఆ చురుకుదనం లేదు. సాధారణ మేకప్. చేతిలో పిల్లెవరు? పక్కన యువతి ఎవరు? సరోజేది?"

ఈ ప్రశ్నల వర్షాన్ని కురిపించాను.

కృష్ణ జవాబులు చెప్పాడు.

"నీకు తెలియదా? సరోజ డాక్టర్ శేషగిరిని పెళ్ళి చేసుకొని అమెరికా వెళ్ళిపోయింది"

ఉక్రోషం పట్టలేక వెంటనే రామారావు మరొక సంబంధం ఒప్పుకుని పెళ్ళి చేసుకున్నాడు. అప్పటి చిలిపితనం, అల్లరి తగ్గిపోయాయి. వైజాగులో పిడబ్ల్యూడీలో గుమస్తాగా చేస్తున్నాడు.

అయ్యో అనిపించింది. అయ్యో రామారావు!!

అతడెవడో ఇతని కంటే ఘనుడా?.......

*(ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రిక; 1993 దీపావళి ప్రత్యేక సంచిక పే.108-111)*

## 13

# 'నెం 152 వెయిటింగ్ లిస్టు' ఇన్ కోణార్క్

"శుభయాత్ర. హేపీజర్నీ", "బొంబాయి నుండి భువనేశ్వర్‌కు వు ఎక్స్‌ప్రెస్ ఎనిమిదో నెంబరు ప్లాట్ ఫారంమీదికి పది ముషాలలో వచ్చుచున్నది. ప్రయాణికులకు శుభయాత్ర". భాష ఎ కాకపోయినా, భావం మాత్రం ఇదే!

రాత్రి తొమ్మిది గంటలకు బొంబాయి వి.టి. స్టేషన్‌కు వచ్చేసరికి ఈ కటనను హిందీలోనూ, ఇంగ్లీషులోనూ, చెప్పిందే చెపుతున్నాడు.

(హేపీజర్నీ అనగానే జేమ్సుబాండ్ సినిమాల్లో రైలు ప్రయాణం స్తుకొచ్చింది. ఆ రైళ్ళలో అసలు మనుష్యులే కనబడరు. అన్ని సదుపాయాలూ దులోనే ఉంటాయి. భోజనాల బోగీలో కూర్చుంటే, బేరరు తినుబండారాల్నీ ానీ సప్లయి చేస్తాడు. సిగరెట్టు కాలుస్తూ విస్కీని సిప్ చేస్తూ కూర్చుంటే రు కుర్చీలోకి హీరోయిన్ వచ్చి కూర్చుంటుంది.

ఎవడో వెనుక గుంపులో నుండి పరిగెత్తుకొస్తూ దభీమని గుద్దుకుంటూ మేసరికి ఈ లోకంలోకి వచ్చా.)

రెండు రోజుల గడువులో బొంబాయిలో ఇంటర్వ్యూకి రమ్మని టెలిగ్రాం , రిజర్వేషన్ లేకుండానే కోణార్క్ ఎక్స్‌ప్రెస్‌లో తప్పనిసరై వచ్చేశా. నాకు యాణమంటే ఎప్పుడూ భయమే!

జనం చెప్పుకుంటూ ఉంటే ధైర్యం వేసింది.

కేరళలో వందమంది వెయిటింగు లిస్టులో ఉంటే మరొక బోగీని తగిలిస్తారనీ, ఇక్కడైతే తృణమో పణమో ముట్టచెపితే టి.సి.లు ఊరుకొంటారనీ, ఒరిస్సాలో అయితే టిక్కెట్టును అడిగిన టి.సి.ని కొట్టి రైలుబండిలో నుండి బైటకు తోసేస్తారనీ.

మరి అంత దౌర్జన్యం మనకొద్దులెండి.

నేనైతే బొంబాయిలో దిగగానే సామర్లకోటకు తిరుగు టిక్కెట్టును తీసేసుకున్నాను. కాని అది నూటయాభై రెండవ నెంబరు వెయిటింగ్ లిస్టులో పడింది.

గోదావరి వరదలా పరిగెత్తుకొస్తున్న జనప్రవాహాన్ని చూసుకుంటూ నాలుగడుగులు ముందుకు వేశాను. పెద్దనాన్న ఇచ్చిన అడ్రసు కాగితం గుర్తుకొచ్చి తీసి చదివాను.

"ఉన్నికృష్ణ, స్టేషన్ సూపరింటెండెంట్, బొంబాయి వి.టి.

నా పెదనాన్న కూడా రైల్వే ఉద్యోగి. ఉన్నికృష్ణా ఆయనా చాలారోజులు మద్రాసులో కలసి పనిచేశారట.

వెదకబోయిన తీగ కాలిగి తగిలినట్లు ఎదురుగానే ఉన్నికృష్ణ ఆఫీసు! అందులో ఆయన కూడా దొరికాడు.

పరిచయం చేసుకొని చేయగల సహాయాన్ని అర్థించాను.

తదుపరి మా సంభాషణలో అసలు ఈ ఉన్నికృష్ణకి మా పెదనాన్నతో పరిచయం ఉన్నదా? అని అనుమానం వచ్చింది.

"మా డ్యూటీని మేము చేస్తాము. మాకెవరైనా ఒకటే" తన మనస్తత్వాన్ని వ్యక్తం చేశాడు.

"ప్రొద్దుటి నుండి డి.ఆర్.ఎమ్. తాలూకా అని, చీఫ్ ఇంజనీర్ పనివాడి పెళ్ళమని, ఇలా ఎంతోమంది రిజర్వేషన్ల కొచ్చారు"

"వీళ్ళందరికి మేము ఏమి చేయగలం? మా దగ్గర 'అల్లా ఉద్దీన్ మాయా దీపం' ఉన్నదా! వీళ్ళ కోర్కెల్ని తీర్చేందుకు!

"నేనేమీ చేయలేను మిస్టర్. ట్రైన్లో టిక్కెట్టు కలక్టర్నే పట్టుకోండి" ఉచిత సలహా నిచ్చాడు.

అవును! ఆఖరి నిమిషంలో ఎవరు మాత్రం ఏమి చేయగలరు? నేనే

సమాధానపడ్డాను. కాని ఈ విషయం పెదనాన్నకి చెప్పదలచుకోలేదు. బాధ పడతాడు.

ట్రైన్ ఇక వచ్చేస్తుందేమో. ప్లాట్ ఫారం మీదకి పరిగెట్టాను.

"మే ఐ హెల్ప్ యూ" అని వ్రాసి ఉన్న చిన్న చెక్క గది కనిపించింది. దానిలో కుర్చీ, బల్ల, దానిమీద ఫోను ఉన్నాయి. కాని సహాయం చేసే వ్యక్తి మాత్రం దరిదాపుల్లో లేడు.

మరికొంత దూరంలో "ఆఖరి నిముషంలో కేన్సిల్ అయిన టిక్కెట్ల వలన ఏర్పడిన ఖాళీల కోసం ఇక్కడ సంప్రదించండి" అన్న బోర్డు కనబడింది.

అప్పుడే యాభైమంది క్యూలో చేరారు. వారితో వెనక నేను చేరాను.

'లెస్ లగేజ్ మోర్ కంఫర్ట్. మేక్ ట్రావెల్ ఎప్లెజర్" నా చేతిలో సంచి ఒకటే ఉండబట్టి తేలిగ్గా తిరిగేస్తున్నాను.

పదిహేను నిమిషాలలో నా వంతు వచ్చింది. "సార్ నాది 152 వెయిటింగ్ లిస్టు. ఖాళీలేమన్నా ఉన్నాయా?" అడిగాను.

"నీ ముందు రెండొందల మంది 'ఆర్.ఎ.సి. లిస్టులో ఉన్నారు. వారందరికి బెర్తులిస్తే గాని నిన్ను చూడరు" జవాబిచ్చాడు.

"మరైతే మరొక స్పెషల్ బోగీని తగిలిస్తారా సార్" ఆశగా అడిగిన నన్ను వెర్రివాడ్ని చూసినట్లు చూసి తల అడ్డంగా తిప్పాడు.

"గాబరా పడకండి! టికెట్టు కలక్టర్ని కలుద్దాం. నేనూ మీతో బాటే" మాట గలిపాడు ప్రక్కనున్న తెలుగు ప్రయాణీకుడు. ఎడారిలో ఒయాసిస్‌లా కనబడ్డాడతను.

అనుకున్న దానికంటే అరగంట లేటుగా నెమ్మదిగా ప్లాట్ ఫారంమీదికి వచ్చింది రైలు బండి.

ఆ చివరి నుండి ఈ చివరి వరకు రెండుసార్లు పరుగెత్తి ఎలాగైతేనేం టిక్కెట్టు కలక్టర్ని పట్టుకున్నాము.

మా రిజర్వేషన్ గురించి చాలా ప్రాధేయపడ్డాము. రహస్యంగా "మీరడిగినంత" అంటూ మభ్య పెట్టాము.

"ఊహూ!" ఆ కాలవస్త్ర కవచధారి (నల్లసూటుపెద్ద మనిషి) మహా కర్కోటకుడిలా ఉన్నాడు. "నో, డోంట్ వేస్టు మై టైమ్. డోంట్ గెట్ ఇంటూ

రిజర్వ్‌డ్ కంపార్టుమెంట్సు" కుండ బద్దలు కొట్టినట్టు చెప్పాడు.

ఇంతలో రైలు కదలిపోతున్నది. "తర్వాత మాట్లాడుకొందాం ముందు బండెక్కండి" అనుకుంటూ తెలుగు ప్రయాణీకుడితో ఒక కంపార్టుమెంటు లోనికి ఎక్కేశాను.

బొంబాయి సేట్లు పెద్ద పెద్ద ట్రంకు పెట్లను దారికడ్డంగా పడేసారు. వీరికి "ట్రావెల్‌లో ప్లెజర్" అక్కర్లేదు గాబోలు.

ఒక గంటలో ఒకరి తర్వాత ఒకరిని అడుగుతూ "టిక్కెట్ ప్లీజ్" అని నన్నూ అడిగాడు టి.సి.

ప్రక్కనున్న స్నేహితుడు మోచేత్తో పొడిచాడు నన్ను. టిక్కెట్టు, ఇరవై రూపాయలనోటు అతని చేతిలో పెట్టా.

"సీటు బెర్తు అంటూ అడగకండి! అలా అడ్జస్టు అయిపోండి" అంటూ వెళ్ళిపోయాడు. టిక్కెట్టు తిరిగిస్తూ.

భోజనాల వేళ కావడంతో ఒకరొకరూ బిరియాని, పులిహోర పొట్లాలు, కారేజీలు విప్పి భోజనాలకు ఉపక్రమించారు. నాకటువంటి వాటిని తెచ్చుకొనే అవకాశం లేకపోయింది. స్టేషన్లలో కొనుక్కొనేందుకు కూడా ఏమీ దొరక లేదు. నోటిలో నీరూరుతుంటే తింటున్న వాళ్ళను చూడనట్లుగా నటిస్తూ కూర్చుండిపోయాను.

"ఇక ప్రక్క వేయండి!" అన్నాడు స్నేహితుడు. "ఎక్కడ" అన్నాను.

"ఎక్కడేమిటి నేలమీదే!" అన్నాడు.

సీట్ల మధ్య లగేజి, ఇక మనుషులు నడిచే దారిలోనే, ప్రక్కగా సంచిలోనుండి దుప్పటి తీసి పరిచాను. లుంగీ మార్చుకొని పక్క బాక్ రబ్బరు తలగడ ఊది, వాటి మీద ఒద్దికగా పడుకొన్నాను. అటూ ఇటూ తిరుగుతున్న జనం కాళ్ళు తగులుతూనే ఉన్నాయి. అలసట వలన, రైలు కుదుపు వలన త్వరలోనే నిద్ర పట్టేసింది.

పోలీసు ఒకడు "ఉఠోరే!" అని అరుస్తూ డొక్కలో లాఠీతో పొడుస్తూంటే మెలుకువ వచ్చింది. ఎక్కడో పడుకున్న స్నేహితుడు లేచి వచ్చి తారక మంత్రం ఉపదేశించాడు. వాడి చేతిలో అయిదు రూపాయలు పెట్టా. "ప్రక్కగా పడుకోబాయీ కాళ్ళు తగులుతాయి" అంటూ నవ్వుకుంటూ కలక్షన్లు చేసుకుంటూ వెళ్ళిపోయాడు.

మరొక గంటకి గాబోలు మరొకడు పొడిచాడు లాఠీతో. "ఇప్పుడే గద బాయి మీ వాళ్ళకిచ్చాను" లాభం లేదు. వీడికీ ఇవ్వాల్సిందే! ఇచ్చేశాను. రైలు కుదుపులో మళ్ళీ నిద్రపట్టేసింది.

ఈసారి నా తలకి ఏదో తగులుతుంటే ఉలిక్కిపడి కళ్ళు తెరిచా. చేతిలో తలగడను తడిమితే కొబ్బరి పీచులా తగిలింది. లేచి చూస్తే ఒక బిచ్చగత్తె పడుకొంది.

"కోటికి పడగలెత్తిన కోటీశ్వరుడూ, కూటికోసం శ్రమపడే నిర్భాగ్యుడూ, నీ కృపకెప్పుడూ సమపాత్రులే!" వెంకటేశ్వరస్వామి భక్తిగీతం గుర్తుకొచ్చింది. తలగడ లాక్కుని నేనే దూరంగా జరిగి పడుకున్నాను.

తెల్లవారేలోగా మరొక టి.సి.కీ మరొక పోలీసుకీ చేతులు తడిపాను.

నిద్రలేచి చూసేసరికి తలగడ క్రింద పాంటు, నా కొవ్వాడిస్ బెల్టు, చెప్పులు కనబడలేదు. అదృష్టవశాత్తు చొక్కా జేబులో పర్సు అలాగే ఉన్నది.

బెజవాడలో తెలుగు స్నేహితుడు దిగిపోయాడు.

మరి నాల్గు గంటల్లో సామర్లకోట వచ్చేసింది. గుంపుల్లో నుండి దిగి బయటి బస్‌స్టాప్ చేరేసరికి నా చొక్కా జేబులో పర్సుకూడా మాయమయిందని తేలింది.

మళ్ళీ స్టేషన్ ప్లాట్ ఫారంలోని పోలీస్ స్టేషన్‌కు వెళ్ళి మొరపెట్టుకున్నాను. పోలీసులు "ఎంత డబ్బు పోయింది సార్" వివరాలయిన తర్వాత "మీరు స్టేషన్ బయటకు వెళ్ళారు గాబట్టి ఊళ్ళో పోలీసు స్టేషన్లో కంప్లెయింటు ఇవ్వండి" అంటూ అక్కడిచ్చిన కంప్లెయింటు కాగితాన్ని చింపేశాడొక పోలీసు.

తల గోక్కుంటూ ప్లాట్‌ఫారం మీద నిలబడ్డాను. చేతిలో సంచి మిగిలింది.

కూతవేసి నెమ్మదిగా ముందుకు సాగిపోయింది రైలుబండి.

*(పల్లకి వినూత్న వారపత్రిక: 2-3-94 పే.36-37)*

14

# గౌతమి ఎక్స్‌ప్రెస్‌లో ముఖమల్ చెప్పలు

"అబ్బ ఏమిటి ఈ తోపుడు"

కాకినాడ టౌన్ స్టేషన్‌లో గౌతమి రైల్‌లో ఎక్కుతున్నాము. పదిహేను రోజుల క్రితమే రిజర్వేషన్ చేయించాను నాకు, నా భార్యకు.

పందుల మందలా జనం తోసుకొచ్చేస్తున్నారు. జబర్దస్తీగా వున్న ఒకావిడ చదువుకున్నది లాగానే ఉన్నది; మోచేతులతో అందర్నీ అటూయిటూ పొడిచేస్తూ ఎక్కింది. తన సామానంతా లోపలికి వచ్చేవరకు మిగిలిన వాళ్ళని ఎక్కనివ్వలేదు. "పద్నాలుగు" తన సామానంత వచ్చేసింది అని లెక్కేస్తూంది. ఈలోగా తలనిండా సామానుతో పోర్టర్ తోపుడు.

ఈ గొడవంతా అయి లోపలికి వచ్చేసరికి ఎక్కిన జనంలో మూడొంతులు గబగబా దిగిపోయూరు. దూసుకుంటూ రాసుకుంటూ రెండు సంచుల్ని తీసుకొని 12, 13 బెర్తుల్ని చేరుకొనే సరికి తల ప్రాణం తోకకు వచ్చింది. పార్వతి, నేను సీట్లలో చతికిలబడ్డాం. మా వెనకే అరవయ్యేళ్ళ ముసలమ్మ, ఇరవయ్యేళ్ళ కూతురితోను, ఇద్దరు మనుమరాళ్ళతోను మా చుట్టూ సీట్లలో కూర్చున్నది. ఆఖరి పిల్లకు టిక్కెట్టు లేదు గాబోలు.

అయిదు నిమిషాలలో బండి కదిలింది.

"అమ్మా దాహం వేస్తూందే!" ఆఖరి పిల్ల. "అప్పుడే మొదలా! యివిగో" మిల్టన్ నీటి డబ్బా యిచ్చింది.

"అమ్మా సంచిలో మామిడికాయ యివ్వవా?" పెద్ద పిల్ల. ఇంటి దగ్గర చెప్పి వుంటుంది తల్లి - రైలుబండిలో తిందువుగానని.

"ఆగవే సామానుకాస్త సర్దనీ" పెట్టె, సంచులు సీటుక్రింద సర్దుతూ

అంది.

"అమ్మా! మన బెర్తులేవే" ముసలావిడ.

"పైనవి రెండు మధ్య దొకటి" కూతురు.

"నేనుపైకెక్కలేనే" ముసలావిడ.

"మరేం చెయ్యను. పిల్లలు కూడా పైనైతే దొర్లిపోతారు" కూతురు.

"అమ్మా! నేను ఆ కిటికి దగ్గిర కూర్చుంటానే" చిన్న పిల్ల.

కిటికి దగ్గిర కూర్చున్న నేను "రా అమ్మా!" అని ఆ పిల్లకి సీటిచ్చేసాను.

కూతురు "మీరెక్కడికి వెళుతున్నారు?" నన్ను మాటల్లోకి దింపింది.

"హైదరాబాదమ్మా."

ముసలి తల్లి పిల్లలు గురించి ప్రాధేయపడింది, క్రింది సీట్లుకావాలని.

"పదిహేను రోజుల క్రితం కావాలని యీ క్రింది సీట్లను రిజర్వ్ చేయించానమ్మా".

"మాకు వయస్సు మళ్లింది గదా! పై బెర్తులెక్కలేము. క్రింది బెర్తు కావాలంటే తీసుకోండి. మే మిద్దరం మధ్య బెర్తు కెళతాము."

దానికే చాలా సంతోషించి, ధన్యవాదాలు చెప్పింది. "ఎదురుగా వున్న క్రింది సీటు ఎవరిదో, దానిని కూడా అడగండి" సలహానిచ్చాను.

ఎదురుగా కూర్చోకుండా నుంచునే చూస్తున్న నలభై యేళ్ళ నల్లటి సన్నపాటి మనిషి తెల్లజాట్టుతో క్రూరంగా చూస్తున్నాడు.

"ఈ క్రింది బెర్తు మీదా?"అడిగింది, ఆ కూతురు. అవునన్నట్టు తలవూపాడు. ముసలి తల్లంటూ, చిన్న పిల్లలంటూ క్రింద పడుకుంటారని, అతనిని పై బెర్తుపై పడుకోమని మరోసారి యేకరువు పెట్టి ప్రాధేయపడింది. అతను మాట్లాడలేదు, సరిగదా అడ్డంగా తలవూపి తన అయిష్టతని వ్యక్తం చేసాడు.

మీరంతా నా సీట్లో లెండి అన్నట్లు సైగ చేసి, తన బెర్తును ఆక్రమించేసాడు.

అతని ముఖంలోకి ఎంతటి కర్కోటకుడివిరా? అన్నట్లు చూసాను. అతనేమీ చలించలేదు.

మధ్య బెర్తు మీద పార్వతి కూడా ఎక్కేసి పడకేసింది. ముసలమ్మ

క్రిందిబెర్తులోనూ పిల్లలు, కూతురు పై రెండు బెర్తుల్లోనూ సర్దుకున్నారు.

అపుడే రాజమండ్రి వచ్చేసింది.

నిర్మల భర్త వస్తానన్నాడు. గబగబా బూట్లు తీసేసి ప్రక్కన చూసా! పార్వతి నా హవాయి చెప్పులేసు కొచ్చేసిందన్న మాట. ఎంతో చెప్పాను, నే కొన్న ముఖమల్ చెప్పులేసుకొని రా, హైదరాబాద్‌లో పార్టీలో తిరగాలని. నా మాట వినదు గదా!

సరే! హవాయి చెప్పులేసుకొని ప్లాట్‌ఫారం మీద కొచ్చాను. ఆ మూల నుండి యీ మూలకు నాలుగు సార్లు తిరిగాను. ఎందుకో నిర్మల భర్త రాలేదు. సరిగ్గా గంట సేపు ఆపేసాడు. బండి కదులుతుండగా ఎక్కి చెప్పుల్ని సీటు మధ్య వదిలి, నా మధ్య బెర్తు పైకి ఎక్కే ప్రయత్నం చేస్తున్నాను.

క్రింది బెర్తు మీద పడుకుని వున్న నల్లని వాడు, తెల్లని జుట్టు వాడు క్రూరమైన చూపుల వాడు - నే విడిచిన హవాయి జోళ్ళను జాగ్రత్తగా చేతితో పట్టుకొని మరి కొంచెం సీటు క్రిందికి జరుపుతున్నాడు. ఆశ్చర్యమేసింది! యేమిటి? నా చెప్పులమీద అతనికి ఇంత గౌరవ భావం ఏమిటని?

మరి కొంచెం జాగ్రత్తగా అటూ యిటూ చూసాను. పార్వతి నేను చెప్పినట్లు తన ముఖమల్ చెప్పుల్ని వేసుకొచ్చింది. అవి ప్రక్కనే వున్నాయి.

*(తెలుగు విద్యార్థి మాసపత్రిక; మార్చి 1994 పే.22)*



నిరీక్షణ 1992 ప్రణవమూర్తి

15

# గుండెగదిలో మెంటల్‌కేస్

ఆసలే ఆ రోజు సోమవారం. అవుట్ పేషంట్ వార్డు (ఓ.పి.) చాలా రష్‌గా ఉంది. రికార్డు అసిస్టెంటు సెలవు. ప్రొబేషనరీ నర్సు క్లాస్ అంటూ వెళ్ళిపోయింది.

ఓ.పి. టిక్కెట్లు యిచ్చే వారికేమి తెలుస్తుంది! అప్పుడే పుట్టిన వాళ్ళ దగ్గర నుండి మూడు కాళ్ళ ముసలోళ్ల వరకూ అందరికీ గుండెనొప్పి అంటూ యిక్కడికే పంపిచేస్తున్నారు. నలభై యేళ్ళు దాటిన వారికిగదా గుండెజబ్బు లొచ్చే అవకాశం ఎక్కువ!

వరసగా ఓ.పి. టిక్కెట్లను తీసుకొని నంబరు వేసి ఒకరి తరువాత ఒకరిని, బ్లడ్ ప్రెషర్ చూస్తూ పరీక్ష చేసి మందులు వ్రాసి పంపుతున్నాను. గుండెజబ్బుల వారు సాధారణంగా వయసు మళ్ళిన వారు, చాదస్తులు, ఎన్నో సంవత్సరాలుగా వైద్యం చేయించుకొనే వారై వుంటారు. ఓపిక లేకపోయినా యేదోలా రోగికొకసారి, రోగితో వచ్చిన యిద్దరు ముగ్గురు అనుచరులకు, మరిన్ని సార్లు, జబ్బును గురించి విడమరిచి చెప్పి తీరాలి.

ఇంతలో పరిచయస్తుడు, మెడికల్ స్టూడెంటు మరొక స్టాఫ్ నర్సు 'మాకు తెలిసిన వారూ, చుట్టాలూ' అంటూ తీసుకొచ్చిన వారిని ముందుగా చూడాలి గదా! లేకపోతే కోపాలు వస్తాయి.

మెడికల్ సైడ్ సరిగా చూడకుండానే కార్డియాలజీ కేసంటూ మా అభిప్రాయం కోసం పంపబడే కేసులూ, అర్జంటుగా, ఆ క్షణం 'కార్డియాలజీ ఫిట్‌నెస్' కావాలంటూ వచ్చే సర్జికల్ కాంప్లికేటెడ్ కేసులూ, వీటన్నిటిని ఒక్కడ్నీ చూసుకోవటం చాలా చీకాకుగా వుంది.

విదేశాలలో వైద్య నిపుణుడు (ఎక్స్‌పర్టు) అంటే రోజుకి నాలుగైదు కేసులకంటే ఎక్కువ చూడడు. చూసిన వాటిని క్షుణ్ణంగా చూసే అవకాశ ముంటుంది. మరి యిక్కడ? రోజుకీ నలభై యాభైకేసుల్ని ఒక్కడే చూడాలంటే, యేమి చూస్తాడు?

ఇంతలో వార్డుబాయ్ పుల్లయ్య 'సారూ! నన్నొకసారి చూడండి' అన్నాడు.

"కాంప్లికేటెడ్ కేసు చూస్తున్నాను కొంచెం సేపు ఆగరా బాబూ" అన్నాను.

రెండు నిముషాలాగి 'సార్ ఈ చీటి మీద రిపీట్ అంటూ సంతకం పెట్టేయండి, నేను థియేటర్‌కి పోవాలి' తొందర పెట్టాడు పుల్లయ్య.

"నీవూ హాస్పిటల్ స్టాఫ్‌వేగదా! కేసు చూస్తున్నానా కూర్చున్నానా? కొంచెంసేపు ఆగలేవా?" అసహనంగా అన్నాను. "సార్ మీరు నన్ను చూడక్కర్లేదు. ఈ ఓ.పి. చీటి మీద సంతకం పెడితే సరిపోతుంది. మొన్న డాక్టరు సురేష్‌గారు చూసారు నన్ను" అన్నాడు మస్తరేయించుకొని పోవాలని తొందరపడుతూ.

"నిన్ను నేను చూడను. దానిమీద సంతకం పెట్టను. ఇదివరలో నిన్నెవరు చూస్తే వారికే చూపించుకో" చిర్రెత్తి అన్నాను.

మొహం ముడుచుకొని పోయాడతడు.

మరుక్షణం బాధనిపించింది. ఆ యెద్దడిలో మరి ఏం చేయగలను!

ఎంతో వేగంగా చూస్తే ఆఖరి పేషెంటుని చూసేసరికి సరిగ్గా పన్నెండున్నర మధ్యాహ్నమయింది.

ఇకలేద్దామా అనుకొనే సరికి మరొక వ్యక్తి 'ఈ చీటి చూడండి' అంటూ వచ్చాడు.

రక్తం, నీరుడు పరీక్ష చేయించుకొచ్చే సరికి మెడికల్ ఓ.పి. మూసేసారు. నేను ఖాళీగా కనిపించాను.

"బాబూ యిది నేను చూసేది కాదు. ప్రక్కన మెడికల్ వారే చూడాలి. వారు నిన్న విన్ను చూసి వాటిని వ్రాసారు. అందుకని మళ్లీ వారికే చూపిస్తే సుళువు".

"ఆ గదిలో అంతా వెళ్ళిపోయారు బాబయ్యా" అన్నాడు.

"అయితే రేపు ప్రొద్దుటే వచ్చి చూపించుకో" అన్నాను.

'దూరం నుండి వచ్చాను సార్. రిపోర్టులో చూసి బాగున్నానో లేదో చెప్పండి' అన్నాడు.

"చూడు బాబూ యెవడు కనబడితేవాడికి నీ చీట్లను చూపించకు. అందరికి చూపిస్తే తలో సలహా యిస్తారు. నీ తల తిరిగిపోతుంది. నిన్న చూసిన వాడికే చూపించు, వెళ్లు! నన్ను విసిగించకు"

గొణుక్కుంటూ పోయాడా వ్యక్తి.

లేవబోయేసరికి, మరో నలభైయేళ్ళ వ్యక్తి ప్రత్యక్షం.

"నా బి.పి. చూడండి సార్. అందరు డాక్టర్లు వెళ్ళిపోయారు. ఒక్క బి.పి.యే సార్" అన్నాడతను.

ప్రొద్దుట్నించి అందరినీ పొమ్మంటున్నాను. 'సరే రండి', 'బి.పి. కఫ్' కట్టి బల్బుతో గాలి కొడుతున్నాను.

"సార్! నాకు బి.పి. ఎక్కువగా వుంటే ఎక్కువ వుందని చెప్పకండి సార్!" అన్నాడు.

"మరైతే చూపించుకోవటం దేనికట?" అన్నాను.

అదృష్టం కొద్ది బి.పి 'నార్మల్'గా వుంది.

"నార్మల్‌గానే వుందయ్యా, భయంలేదు" చెప్పాను.

"భయంలేదాసార్! బతికించారు. బ్రతికి పోయాను. ఆ చేత్తో నా గుండె కూడా చూసేయండి సార్" అన్నాడు.

ఇదెక్కడ సొదరాబాబూ, సరే గుండెమీద స్టెత్‌పెట్టి చూసి "బాగుందయ్యా నీ గుండె" అన్నాను.

"హమ్మయ్య. నాగుండె బావుందా సార్. మరైతే రేపు సాయంకాలం వరకూ బతికి పోయాను మీ దయవల్ల, మీ కాళ్ళకి నమస్కారం సార్".

"నాక్కాదు. ఆదేవుడికి పెట్టు నమస్కారాలు, కుర్చీనుండి లేవ బోయాను."

అతడు నా చేతుల్ని గట్టిగా పట్టుకొని, కుర్చీనుండి లేవనీయకుండా అదిమిపెట్టి, "సార్! నా గుండెమీద మీ చేత్తో ఓసారి కొట్టండి సార్, నాకెంతో సంతోషంగా వుంది; మీ లాంటి డాక్టరు దొరికి నందుకు.'

నేను నోరు తెరుచుకొని అలా చూస్తూ వుంటే రెండేళ్ళ పిల్లాడ్ని చంకలో యెత్తుకొని యీయనగారి భార్య కూడా లోపలికి వచ్చేసింది. నాన్‌స్టాప్‌గా లెక్చరిస్తూ. దాని సారాంశం, "రెండు నెలల నుండి ఆవిడ భర్త ఉద్యోగానికి వెళ్లటం లేదు. తినడానికి బత్తేలు లేవు. అతనికి మతిస్తిమితంగా లేదు. డాక్టరు మల్లీశ్వరరావుగారికి చూపిస్తున్నారు...."

"అయ్యబాబో ఇది మల్లీశ్వరరావుగారి మెంటల్ కేసా! తల్లీ! ఈయన్ని వెంటనే మెంటల్ ఓ.పి.కి తీసుకు వెళ్ళు. ఆయనకు అక్కడే వైద్యం జరగాలి" ప్రాధేయపడ్డాను.

ఆ తల్లి తన యింట్లో విషయాలు యింకా యేమేమో చెపుతూనే వుంది. చంకలో కుర్రాడు కూడా ఏడుపు లంకించుకున్నాడు.

"బాబూ మీ చేత్తో.... నా గుండె మీద .... కొట్టండి సార్. నేను బతికిపోతాను" అతను పదే పదే అంటూనే వున్నాడు.

"బాబూ నేను కూడా మల్లీశ్వరరావు గారి దగ్గరకే వైద్యానికి వెళ్ళాలి" తలపట్టుకొని బయటకు నేను పరిగెత్తాను.

*(జూలై, 1994 గీతాంజలి దమ్మీసంచిక, పే.52-53)*



సంతకు 1973 ప్రణవమూర్తి

# 16

# లేబర్‌రూం ఆటసింగారం

వార్డులో అడుగుపెట్టేసరికి హృదయ విదాకరమైన అరుపులు మామూలే! పురిటి నొప్పులు అలా వుంటాయేమో! వాటికి తోడు "గేదెలా అరుస్తావెందుకు? మొగుడి దగ్గర పడుకున్నప్పుడు తెలియలేదా? గట్టిగా అరవమాకు" ఇటువంటి మొరటు మాటలు తరచూ, పురటాల వార్డులో డబ్బులు ఇవ్వని పేషెంటుని గదమాయిస్తూ, తరచుగా ఆయాలనుండి వినిపిస్తూనే వుంటాయి.

ఆ రోజు కూడా అలాగే ఒక ఆయా ఉదయం 8 గంటలకి లేబర్‌రూమ్‌లో వున్న ఒక్క పేషెంటునీ తిడుతూ వుంది.

హౌస్ సర్జన్‌గా పన్నెండు పురుళ్ళు పోయాలి. వాటిని రికార్డులో రాసుకోవాలి. పన్నెండు కేసులయ్యేసరికి, తలప్రాణం తోకకి వస్తుంది, ముఖ్యంగా మొగ డాక్టరుకి. కొన్ని పెద్ద డాక్టరుగారి ఇంటరెస్టెడ్ కేసులు, మరికొన్ని అసిస్టెంటు గారివి. వీటి దగ్గరకు మనం వెళ్ళనే కూడదు. మిగిలిన వాటిలో పోస్టు గ్రాడ్యుయేటు స్టూడెంట్సు, లేడీ హౌస్ సర్జన్సు కో స్టూడెంట్సుతో పోటీ ఎప్పుడూ వుంటూనే వుంటుంది.

అసలు ప్రొబేషనర్ నర్సులు కూడా కేసుల కోసం పోటీకి వచ్చేస్తున్నారు.

ఈ రోజు సెలవుకావడంతో, మిగిలిన వారు రాకపోవడంచేత, అదృష్టంకొద్దీ నాకొక కేసు దొరికింది.

పేషెంటు గట్టిగా అరుస్తూ వుంది. పరీక్షచేస్తున్న నన్ను గట్టిగా డొక్కలో తన్నింది. ఈ మధ్యే సూపరింటెండెంట్ గారు ఒక సర్క్యులర్ కూడా పంపారు. ప్రజాప్రతినిధులు వస్తారు. కార్యకర్తలు వస్తారు. ఆఫీసర్లు వస్తారు. వీరందరిని

ఆహ్వానించి అతి మర్యాదగా సమాధానాలు చెప్పా'లని 'పేషెంట్లతో పరుషంగా మాట్లాడకూడ'దని. 'సాదరంగా వైద్యం చేయా'లని. అవును తప్పదు తన్నించుకోవాలి! ఏమైనా దురుద్దేశంతో 'కావాలని' తన్నలేదుగా!

"అమ్మా! కొంచెము ఓపిక పట్టు, గట్టిగా ముక్కునొప్పులిచ్చేయి తల్లీ" బతిమాలాను.

ఆ మనిషి పల్లెటూరిది. పట్టుమని పద్దెనిమిదేళ్ళుండవు పాపం! తెగ గొడవ చేసేస్తూంది. "ఓరి సచ్చినోడో! ఓరి నాయనో, ఓరి మావో, ఎంత పనిచేశావురా! నిన్ను జన్మలో దగ్గరకు రానీయనురా" లకారాలతోటే ఎలాబడితే అలా మొగుడ్ని తిట్టేస్తుంది.

"అసలు ఆడదానిగా పుట్టేకూడదు. మొగాడ్ని పెళ్ళే చేసుకోకూడదు. అయ్యబాబో! యేంటి. యీ పిల్లల్నీ, యీ పిల్లల్ని కనటం" అరుస్తూనే వుంది. పళ్ళు బిగబెట్టి గిట్టకరుస్తూ వుంది.

కళ్ళంబట నీళ్ళు ధారావాహికంగా కారుతూ వున్నాయి. కాళ్ళూ చేతులు బల్లకి కొట్టుకుంటూ వుంది.

"అలసిపోతావే పిల్లా! అరవమాకు" ఈసారి కొంచెం సౌమ్యంగానే చెప్పింది ఆయా! చెప్పేకొద్దీ గావుకేకలు ఎక్కువయిపోయాయి.

రాత్రి నుండీ నొప్పులతో అరుస్తోందన్నారు. కానీ ఇప్పటికీ డెలివరీ అయే సూచన కనబడడంలేదు. 'పల్సు' పెరుగుతూంది. 'బి.పి.' తగ్గుతూంది.

ఇక లాభంలేదు; అసిస్టెంటుని తీసుకొచ్చి "మేడమ్! డెలివరీ ప్రోగ్రెస్ అవడంలేదండీ" అని చెప్పాను.

ఆవిడ చూసి "అవును మనిషి నొప్పులివ్వలేకపోతూంది. ఫీటల్ డిస్ట్రెస్ కూడా వచ్చేట్టుంది. మిడ్‌లో ఫోర్‌సెప్సు వేయాలి" చెప్పింది.

"కాళ్ళూ చేతులూ కట్టండి" గాజు గుడ్డతో కాళ్ళూ చేతుల్ని కౌచికి కట్టింది ఆయా. 'సెడేట్ హర్' సిస్టరు ఇంజక్షను ఇచ్చింది. పేషెంటు మత్తులోకెళ్ళింది. "సిస్టర్! ఫోర్‌సెప్సు, ఇన్‌స్ట్రుమెంట్సు రెడీ చేయండి"

"ఆయా! లైటు ఇటు పెట్టు." అసిస్టెంటు హడావిడి ప్రారంభమయింది.

"పేషెంటు చల్లబడుతూంది. పల్సూ, బి.పి.ఎలా వున్నాయి?" చెప్పాను.

"డాక్టర్! ఫ్లూయిడ్స్ స్టార్టు చేయండి" డెక్ట్రోజు డ్రిప్పు పెట్టాను.

మరి పదిహేను నిముషాలలో ఫోర్‌సెప్సు వేసి పిల్లాడిని లాగేసింది అసిస్టెంటు.

"పల్సూ. బి.పి. ఎలా వున్నాయి డాక్టర్!" అరిచింది ఆవిడ. చెప్పాను.

"అరె! బాప్‌రే! పేషెంటు షాక్‌లోకి పోతూంది 'డెక్స్ట్రాన్', మెఫంటీన్' ఇంజక్షనివ్వండి. రెండో చేతికి 'డొపామెన్' డ్రిప్ పెట్టండి" అరుస్తూనే వుందావిడ.

మరి పదినిముషాలలో కుట్లువేసి, ఆవిడ పేషెంటుని పరీక్షచేసి 'హమ్మయ్య పేషెంటు ఇప్పటికి కొంచెం స్థిమిత పడింది' అనుకుంది.

"మగపిల్లాడుకదూ. పిల్లాడ్ని రివైవ్ చేశారా?" పోస్టు గ్రాడ్యుయేట్ స్టూడెంటు "బేబి బాగున్నాడు మేడమ్" చెప్పింది. అప్పటికి గాని యుద్ధానంతర ప్రశాంతత ఏర్పడలేదు.

నావైపు చూసి "నీవేకదా ఈ కేసును టేకప్ చేస్తున్నావు! అరగంటకి అరగంటకీ బి.పి. చూసి నాకు ప్రోగ్రెస్ చెప్పాలి" అని వెళ్ళిపోయిందావిడ.

ఆరోజుసాయంత్రం నాలుగు గంటలకి ఆ తల్లికి స్పృహ వచ్చింది.

"నీకు కొడుకు పుట్టాడే తల్లి! నాకో చీర ఇవ్వాలి" అంటూ ఆయా చెప్పింది.

ఆ తల్లి ఇపుడు చిరునవ్వులు చిందిస్తూంది.

"నా మావ యేడి బాబూ" నన్ను చూసి అడిగింది. ఈ మనిషేగా ఇంతసేపు మొగుడ్ని చెడతిట్టింది అనుకుంటూ "వస్తాడ్లే నువ్వు పడుకో" అన్నాను.

"గుంటడ్ని మావ చూశాడా బాబూ! ఆడి ముఖాన్ని మావ చూడాలి బాబూ" ఎంతో తెరిపిగా అంది.

"ఏయ్, పడుకో! ఇంతవరకూ వాడిని తిట్టిన నీవేనా ఇలా అంటున్నావు? అతను తరువాత చూస్తాడులే పిల్లాడ్ని" కొంచెం గదమాయించాను ఈసారి.

నిజానికి లేబర్ రూమ్‌లోకి పై మొగోడ్నెవర్నీ రానీయరు మరి.

ఆ పిల్ల ఇంకా నవ్వుతూ నాకేసి చూస్తూ "నా మావ చూస్తున్నాడులెండి" అంది. అర్థంగాక చుట్టూ చూశాను. ఎక్కడ్నించి చూస్తున్నాడా? అనుకుంటూ.

బైట నుండి ఎత్తైన కిటికీ పైకి ఎగబాకి పగిలిన అద్దంలో నుండి, దొంగతనంగా చూస్తున్న పాతికేళ్ళ పల్లెటూరి పడుచువాడి ఇకిలిస్తున్న పళ్ళు కనిపించాయి.

*(స్వాతి సపరివార పత్రిక: 22-7-94 పే.61)*

## 17

# వెన్నెల పరోపకారం

అప్పుడే కొత్త క్లయింట్ ఒకడు రాజు గదిలోకి వచ్చి కూర్చున్నాడు.

"చెప్పండి" అన్నాడు రాజు.

ఇంతలో "నమస్కారం ప్లీడరు బాబూ, లోపలికి రావచ్చా. దీర్ఘాయుష్మాన్‌భవ" శంకర శాస్త్రిగారు లోపలికి వచ్చేసారు.

"నమస్కారం. కూర్చోండి శాస్త్రులు గారు" అన్నాడు రాజు.

రెండు నెలలనుండి పాడుతున్న పాడుతున్న పాటే ప్రారంభించాడు శాస్త్రులుగారు. "శ్రీ శ్రీముఖ నామ సంవత్సరం, మాఘమాస కృష్ణ పక్షం త్రయోదశి, అంటే మార్చి పదవతారీఖున మహాశివరాత్రి పడింది...

"మీ నాన్నగారు, తాతగారు, ముత్తాతగారు తరతరాలుగా శివరాత్రినాడు చేయిస్తున్న యీ ఈశ్వరుడి రుద్రాభిషేకం ఈసారి మీ పేర చేయించాను. రెండు వేలు ఖర్చయింది బాబు. బక్కవాడ్ని అక్కడక్కడా డబ్బు తెచ్చాను. మీరు కాస్త త్వరలో డబ్బు సర్దుబాటు చేయాలి బాబు."

"ఏదో అశ్రద్ధ. అయినా 'స్లాకెపిరియడు!' ఏమనుకోకండి శాస్త్రులుగారు. కొంచెం టైం కావాలి. అడ్జస్టు చేసేస్తాను. పదిరోజుల్లో కనబడండి" అన్నాడు రాజు.

"దీర్ఘాయుష్మాన్‌భవ" అనుకుంటూ వెళ్ళిపోయారు శాస్త్రిగారు.

★ ★ ★

"ఇక చెప్పండి" అన్నాడు రాజు.

"నా పేరు శేఖర్" ప్రారంభించాడు.

అతను సన్నగా దగ్గర దగ్గర అరడుగులుంటాడు. వయస్సు ముప్పై - ముప్పై అయిదు సంవత్సరాలుంటాయి. నెలలుగా క్రాఫ్ చేయించినట్లు లేదు. గెడ్డం మీసాలు పెంచాడు. కళ్ళు లోతుకు పోయాయి. ప్రపంచంలోని చీకటి అంతా అతని ముఖంలోనే గోచరిస్తుంది. కథ ప్రారంభించాడు.

'నేను హత్య చేయలేదు ప్లీడర్ గారూ!'

"నేను నిర్దోషిని" ప్లీడర్ దగ్గర, డాక్టర్ల దగ్గర నిజమే చెప్పాలి. అతను చెపుతున్నది నిజమే కావచ్చు. తలూపాడు రాజు.

"నేను నాన్ బెయిలబుల్ వారంటులో వున్నాను, ప్లీడరుగారు" తనని ఎవరైనా గుర్తు పడతారేమోనని చుట్టూ చూశాడు.

"భయం లేదు! ఎవరూ రారు. మీరు చెప్పండి" అభయమిచ్చాడు రాజు.

"పోయిన మార్చి నెల పన్నెండవ తారీఖున నా ఒక్కగాని ఒక్క బావ పొలంలో చచ్చి పడివున్నాడు సార్." శేఖర్ గొంతు దుఃఖంతో జీరబోయింది.

"తెల్లవారు జామున పాలేరు చూసి పరుగెత్తుకొంటూ వచ్చి నాతో చెప్పాడు సార్. ఇద్దరం పొలంలోకి పరిగెట్టాం. అప్పుడే తెల్లారుతోంది. పొలం ప్రక్కన బోది గట్టుమీద బోర్లా పడున్నాడు బావ. మనిషి చల్లబడి బిగుసుకుపోయి అయిసులా ఉన్నాడు. నా కాళ్ళు చల్లబడ్డాయి."

"వరేయ్ బద్రం రిక్షాని పట్రారా" పాలేరుకు పురమాయించాను.

"శవాన్ని ఇంటికి తెచ్చి గుమ్మంలో గడ్డి పరచి దానిమీద పరుండబెట్టి, వంటిమీద ఎక్కడైనా పాముకాట్లున్నాయేమోనని వెతికాము సార్. నా బావని ఎవరో హత్య చేసారన్న అనుమానమే లేదు సార్ నాకు.

"అక్క శోకాలు ప్రారంభించింది. 'నిన్న సాయంకాలం దెబ్బలాడి, కోపంతో పొలం పోయావు. నీవుదేనితో వున్నా నేనడ్డొచ్చానా! నా కొడుక్కి, నాకు అన్యాయం చేసావు'. యీ మాటల్నే పాటలా పాడుతూ గుండెల్ని బాదుకొంటూ ఏడ్చింది.

"రాజమండ్రిలో ట్రయినింగ్ కాలేజీలో చదువుతున్న అతని కొడుకు నా మేనల్లుడు గుర్తుకొచ్చాడు. వెంటనే పోస్టాఫీసుకు వెళ్ళి అతనికి రమ్మని టెలిగ్రాం ఇచ్చాను.

"తిరిగి వస్తుంటే స్నేహితుడు రమణ కనిపించాడు. ఏమిట్రా కంగారుగా పరిగెడుతున్నావంటే విషయం చెప్పాను."

"అయితే నీ బావ అనుమానాస్పద పరిస్థితుల్లో చనిపోయాడన్నమాట."

వాడి బుర్ర ప్లీడరు బుర్రలా పనిచేసింది. "నీవు ముందస్తుగా పోలీసు కంప్లెయింటు యివ్వాలి" రమణ సలహా ఇచ్చాడు.

ఇద్దరము పోలీసు స్టేషనుకు పరిగెత్తాము.

అక్కడ పరిచయస్తుడే అయిన ఎస్.ఐ.

"బాబూ శేఖర్! నీమీద నీ చుట్టాలనుండి మర్డర్ కంప్లయింటు వచ్చింది. నిన్ను అరెస్టు చేయాలి" అన్నాడు. నా గుండె గుబేలుమంది. బావ తమ్ముడి కొడుకే ఫిర్యాదు చేసాడట. 'ఎస్.ఐ. సహకారంతో నేను పరారై' స్నేహితుని యింట్లో తల దాచుకుంటున్నాను సార్.

"నేను నా బావని యెందుకు చంపుకుంటాను సార్. ఆస్తి విషయంలోగాని, మరే విధంగానూ అతని చావువల్ల నాకు లాభం లేదు. అతని ఉంపుడుగత్తె విషయంలో నేను కోప్పడడం ఘర్షణ పడడం ఉంది. బావ, బావ తమ్ముడి ఆస్తి పంపకాలు పూర్తి కాలేదు. ఇతని చావు వల్ల కొంత ఆస్తి అతని తమ్ముడికే రావచ్చు.

"నేనీ హత్య చేయలేదు ప్లీడరుగారూ, మీరు పేరు మోసిన క్రిమినల్ లాయరని మిమ్మల్ని ఆశ్రయిస్తున్నాను. మీరే నన్ను రక్షించాలి" కథ ముగించాడు శేఖర్ మళ్ళీ కళ్ళ నీళ్ళు తుడుచుకుంటూ.

మధ్యలో అడ్డు తగలకుండా అంతా విని కావలసిన పాయింట్స్‌ను వ్రాసుకున్నాడు రాజు.

'మీకు నేను చేయగలిగిన సాయం చేస్తాను. బెయిల్‌కు ప్రయత్నిస్తాను." రాజు కేస్ టేకవ్ చేసినట్లే.

★ ★ ★

"శ్యామల్‌రావుగారూ" ప్లీడరు గుమస్తాను పిలిచాడు రాజు.

"శేఖర్‌గారూ, యీయన చెబుతారు. స్టాంపు ఖర్చులకు డబ్బు యివ్వండి. రేపు సాయంత్రం మీ సాక్షులను తీసుకురండి" రాజు చెప్పాడు.

మరుసటి రోజు సాక్షులతో మాట్లాడినప్పుడు పాలేరు, రిక్షావాడివల్ల అంత ఉపయోగం కనిపించలేదు రాజుకి.

శేఖర్‌ను చూస్తూ, "మీకు బెయిల్ యేర్పాటు చేసాను. రోజూ ఉదయం పోలీసు స్టేషన్‌లో కనుపిస్తూ వుండండి. రెండు వాయిదాలు కానివ్వండి. ఎదుటివాడి పట్లు కూడా అర్థమవాలి గదా!" వారిని పంపించేసాడు రాజు.

రెండు వాయిదాలు కూడా అయిపోయాయి.

శేఖర్ బావ తమ్ముడు,

"అతని అన్నకి అక్రమ సంబంధమున్నదని అందువలన భార్యతోనూ బావమరిదితోనూ అనేకసార్లు ఘర్షణ పడడం, శేఖర్ బావని చంపుతానని ఆవేశంతో అనేకసార్లు బెదిరించడం, తడబడకుండా సాక్ష్యమిచ్చాడు.

ఇక ఆ తమ్ముని కొడుకు హత్యని చూసానంటూ ప్రత్యక్ష సాక్షే అయ్యాడు. ఇక తను వాదించగలిగేదేమిటి అనుకున్నాడు రాజు. ప్రత్యక్ష సాక్షిని క్రాస్ ఎగ్జామిన్ చేస్తూ రాజు అడిగిన ప్రశ్నకు అతను సమాధానాలు ఇచ్చాడు.

"నా పేరు సోమయ్య, చనిపోయిన వ్యక్తి తమ్ముడి కొడుకును.

"మార్చి పన్నెండో తారీఖు రాత్రి, పదిగంటలు దాటుతుంది.

"శేఖర్ అతని బావను కర్రతో నెత్తిమీద బాది పారిపోవటం కళ్ళతో చూచాను.

"చేతిలో లైటు లేకపోయినా వెన్నెల బాగా వుంది. శేఖర్‌ను గుర్తు పట్టాను.

"భయపడి యీ విషయం రాత్రి యెవరితోనూ చెప్పలేదు. తెల్లారి పెదనాన్న చనిపోయాడన్న వార్త తెలియగానే పోలీసు కంప్లయింటు నేనే యిచ్చాను".

ఈ సాక్ష్యంతో రాజుకి యేమి చేయాలో తోచలేదు.

"మెడమీద తగిలిన దెబ్బవలన వెన్నుపూస నలిగిపోయింది. ఆ దెబ్బ కర్రతో కొట్టడం వలన తగలవచ్చు. ఆ దెబ్బే చావుకి కారణము" డాక్టరు పోస్టు మార్టమ్ రిపోర్టు కూడా చదివేసాడు.

ఇక పబ్లిక్ ప్రాసిక్యూటరు విజృంభించాడు.

"శేఖర్ తన బావ ఇతర స్త్రీలతో సంబంధం పెట్టుకొని, తన అక్కకు అన్యాయం చేస్తున్నాడని, అతనితో అనేకసార్లు ఘర్షణపడటం వూరంతటికి తెలుసు.

"అనిర్దిష్టమైన అతని ఆస్తి మరొకస్త్రీకి కూడా పంచవలసి వస్తుంది. కొడుకు చదువుసంధ్యల మీద శ్రద్ధ చూపని భార్యపై నిరాదరణ చూపే బావమీద శేఖర్ కక్ష పెంచుకున్నాడు. ఆ రోజు అనగా సం॥ మార్చి పన్నెండవ తారీఖు సాయంత్రము కూడా యీ విషయంలో బావా మరుదులు ఘర్షణ

పడ్డారు. అదేరోజు రాత్రి పది గంటల సమయంలో బావను పొలం గట్టున కర్రతో కొట్టి శేఖర్ పారిపోవడం ప్రత్యక్ష సాక్షి సాంబయ్య చూసాడు. ఇది ఆవేశపూరితంగా క్షణికోద్రేకంతో చేసిన హత్యకాదు. పథకం వేసి అవకాశం చూసి చేసిన 'కోల్డు బ్లడెడ్ మర్డరు'.

"పాము కాటుకు చనిపోయాడని మరునటిరోజు గబగబా బావ అంత్యక్రియలు జరిపించేందుకు తొందరపడ్డాడు శేఖర్. హత్య చేసిన శేఖర్‌కు యావజ్జీవ కారాగార శిక్షను విధించాలని" కోరుతూ, కూర్చున్నాడు పబ్లిక్ ప్రాసిక్యూటర్.

★ ★ ★

ఇక యేమిచేయాలో తోచక శూన్యంలోకి చూస్తున్న రాజుకి కోర్టు హాల్ లోనికి తొంగి చూస్తున్న శంకర శాస్త్రి కనిపించగానే చిరాకు వేసింది. డబ్బు వసూలుకు యిక్కడికి కూడా వచ్చేసాడు అనుకున్నాడు.... అతను చెప్పే మాటలు చెవిలో గింగిర్లు కొడుతున్నాయి.

"శ్రీ శ్రీముఖనామ సంవత్సరం, మాఘమాసం, త్రయోదశి అంటే మార్చి పదవ తారీఖున మహా శివరాత్రి పడింది బాబూ...'

రాజు బుర్రలో ఒక ఆలోచన మెరిసింది.

"మైలార్డ్" అంటూ పర్మిషన్ తీసుకొని గుమ్మం దగ్గరకు వెళ్ళి శాస్త్రులగారితో రెండు నిముషాలు మాట్లాడి చిరునవ్వుతో తిరిగి వచ్చాడు రాజు.

"మైలార్డ్ సాక్షి సాంబయ్యను మరొక్కసారి ప్రశ్నించేందుకు అనుమతి కావాలి" అన్నాడు రాజు.

"పర్మిషన్ గ్రాంటెడ్" అన్నాడు జడ్జిగారు.

సాంబయ్యను ముమ్మారు పిలిచి బోనెక్కించారు.

"శేఖర్ అతని బావను పొలంలో కొట్టి పారిపోయింది ఏ రోజు?" అడిగాడు రాజు.

"మార్చి పన్నెండో తారీఖు" చెప్పాడు సాంబయ్య.

"యాభై గజాల దూరంలో లాంతరు లేకుండా చీకట్లో శేఖర్‌ను ఎలా పోల్చుకున్నావు?" అడిగాడు రాజు.

"చీకటి యేమిటి బాబూ! పిండారబోసే వెన్నెలలో చక్కగా కనిపించాడు శేఖర్" అన్నాడు సాంబయ్య.

"సరే ఇక నీవు వెళ్ళవచ్చు." అన్నాడు రాజు.

★ ★ ★

రాజు ఇక తన వాదన ప్రారంభించాడు.

"చదువు సంధ్యలు లేని బావ యింట్లో శేఖర్ తలలో నాలుకై, ముఖ్యంగా అతని కొడుకుకి చదువు సంధ్యలు చెప్పిస్తున్నాడు.

"బావకు వేరే స్త్రీతో సంబంధమున్నది. దానిని ఖండిస్తూ అతనితో ఘర్షణ పడిన మాట వాస్తవం. ఈ విషయంలో అతని అక్క అంతగా అభ్యంతరం చెప్పలేదు. బావను చంపేందుకు శేఖర్‌కు సరైన 'మోటివేషన్' లేదు.

"అతను చనిపోతే శేఖర్‌కు యే విధమైన లాభమూ లేదు. చనిపోయిన వాని చావు వలన తన తమ్ముడి కుటుంబానికే ఆస్తి సంక్రమించే అవకాశం ఉన్నది.

"ఇక ప్రత్యక్ష సాక్షి కథనం బూటకం! కట్టుకథ. మార్చి పదవ తారీఖు త్రయోదశి, మహాశివరాత్రి. మార్చి పన్నెండవ తారీఖు అమావాస్య. కటిక చీకటి! వెన్నెల లేదు. యాభై గజాల దూరంనుండి ఆ రోజు మనిషిని గుర్తు పట్టడం అసాధ్యం. శేఖర్, బావల మధ్య మనస్పర్థలనాధారంగా తీసుకొని యీ హత్యను శేఖర్ మీదికి నెట్టారు. శేఖర్ నిర్దోషి"

హాలంతా చప్పట్లతో ప్రతిధ్వనించింది.

జడ్జిగారు, ఆధారాలను, రాజు ఆర్గ్యుమెంటును సమర్థిస్తూ, శేఖర్ నిర్దోషి అని తీర్పునిచ్చారు.

శేఖర్ నిర్దోషి! ఇది సత్యం. శేఖర్ బావ హత్య కూడా సత్యమే. తరువాత శేఖర్ బావను ఎవరు హత్య చేసారన్నది, శేఖరూ పట్టించుకోలేదు. కోర్టువారూ పట్టించుకోలేదు.

ప్లీడరు రాజు శంకరశాస్త్రులు గారింటికి వెంటనే వెళ్ళి మూడువేలు సమర్పించి, నమస్కరించి వచ్చాడు.

*(తెలుగు విద్యార్థి మాసపత్రిక; జనవరి 1995 పే.38)*

**18**

# వెండిమెరుపు రహస్యం

**మా ఎక్స్‌ప్రెస్ రైలు విజయవాడ చేరేసరికి ఉదయం పదిగంటలయింది. నాతో సేట్ చమన్ లాల్‌గారు కూడా హైదరాబాద్ వస్తున్నారు. అర్థాంతరంగా వచ్చిన నా బదిలీని ఆపుకోవడమెలాగో తెలియని పరిస్థితిలో చమన్‌లాల్‌గారి సిఫార్సు నాకు వరంలా లభించింది....**

మా అమ్మాయికి నిరుడే పెళ్ళయిపోయింది. మా అబ్బాయిలింకా ఇంటర్ విద్యార్థులే. వీళ్ళను ఏ యంసెట్‌కో తయారు చేసి ఏదో మార్గంలోకి మళ్ళించాలి. అందుకుగాను గుంటూరులోనే నేను మరికొంతకాలం ఉండాలనుకున్నాను. ఈ బాధల్ని మిత్రుడు రామారావుతో చెప్పినపుడు "అబ్బాయ్ నాకో మిత్రుడున్నాడు. అతని పేరు చమన్‌లాల్! హైదరాబాద్‌లో అతను చేయలేని పనంటూ ఏదీ లేదు. నీ డైరెక్టర్లూ వారి మీది మినిష్టర్లూ ఆయన చెప్పుచేతల్లోనే వుంటారు. ఇతను కనుక ఫోనులో చెబితేచాలు ఎలాంటి బదిలీ అయినా ఆగిపోతుంది. కాని, దగ్గరుండి పని చేయించుకోవడం మంచిది. నేను చెబితే చాలు! ఆయన హైదరాబాదుకి నిన్ను తీసుకువెళ్ళి నిమిషాల మీద బదిలీ ఆపించగలరు" అన్నాడు....

ఎదురు ఖర్చులు పెట్టుకుంటూ, ఇప్పుడు చమన్‌లాలే వస్తున్నారు నాతో!... నలభైనిముషాల తరువాత నెమ్మదిగా రైలు కదిలింది. కంపార్టుమెంటులోకి చిన్న కుర్రాడొకడు చొచ్చుకొచ్చాడు, బనీనూ నిక్కరూ తొడుక్కుని పెరిగిపోయిన క్రాపింగు దువ్వుకోకుండానే లోపలికి వస్తున్న ఆ కుర్రాడికి పన్నెండేళ్ళు కన్నా ఎక్కువుండవు. చీకిరి కళ్ళూ, చింపిరి జుట్టూ, బక్క చిక్కి బీదగా ఉన్నాడు. వాడు కింద కూచున్ని చిన్న చీపురుతో తుక్కు తుడుచు

కుంటూ వస్తూ మధ్య మధ్య తలపైకెత్తి "బాబూ! ధర్మం చెయ్యండి" అంటూ చేతులు చాపుతున్నాడు.

"మొన్న రాజమండ్రి ప్రయాణంలో కూడా ఇలాంటి కుర్రాడే ఎక్కాడు. ఎక్కినవాడు నా బాటా జోళ్ళు కొత్తవి చాలా చాకచక్యంగా తుక్కుతో తోసుకుని పోయాడేమో అన్న అనుమానం నా మనసులో మెదిలింది. ఇలాంటి వాళ్ళను అసలు బోగీలోకే రానియ్యకూడదు. దొంగ వెధవలు" అని నా మనసులో నేను అనుకుంటున్నాను.

కానీ.... చమన్‌లాల్ మాత్రం జేబులోంచి ఓ పది రూపాయల నోటుని చకీమని తీసి వాడి చేతిలో పెట్టేశాడు. వాడు దాన్ని కళ్ళకద్దుకుని నిక్కరు జేబులోకి తోసేసి ముందుకు పాక్కుంటూ పోయాడు.

నేను మాత్రం నిర్ఘాంతపోతూ "ఏమిటిసార్ ఇలాంటి వాళ్ళకు డబ్బులివ్వడం దేనికి? వీళ్ళని ఒక కంట కనిపెడ్తూ ఉండాలి మనం! దొంగ వెధవలు వీళ్ళు" అన్నాను. ఆయన జర్దాకిళ్ళీ నములుతూ "మాస్టారూ! ఒక విషయం చెప్పమంటారా?" అన్నాడు.

అలాగే అన్నట్లు తలవూపాను నేను.

"నాకు సిగ్గూ బిడియం లేవు. ఎందుకంటే నేను కూడా నా చిన్నతనంలో ఈ రకంగానే రైలు బళ్ళల్లోని తుక్కులూడుస్తూ అడుక్కుని డబ్బు సంపాదించి ఈనాడు ఇంత గొప్పవాణ్ని అయ్యానంటే మీరు నమ్ముతారా? నమ్మరా!" అన్నారు చమన్‌లాల్.

నేను నిర్ఘాంతపోయాను.

ఖరీదైన సిల్కు బట్టలూ, మెళ్లో ఒక బంగారు గొలుసూ, రెండు చేతులకూ కలిపి అయిదు వజ్రాల ఉంగరాలూ గల చమన్‌లాల్ చెబుతున్నదంతా తమాషా కోసమే అని నేను అనుకున్నాను. కాని ఆయన మళ్ళీ అందుకుని చెప్పడం మొదలెట్టారు.

"రాజస్థాన్ ఎడారి సమీపాన ఉన్న కృష్ణఘడ్ మా ఊరు. నాకు ఊహ తెలిసినప్పటికే మా నాన్నగారు చనిపోయారు. నాకు అప్పటికే పన్నెండేళ్ళు. మా చెల్లెలికి ఏడేళ్ళు! మా వూళ్ళో పట్టుమని యాభై ఇళ్ళు కూడా ఉండవు. అంతా కూలిపనులు చేసుకొని బతికేవాళ్లే! నా తల్లి ఎవరింటికైనా వెళ్ళి ఏ పెసలో, మినుములో తిరగలిలో వేసి పిండి తయారుచేసి ఇస్తే, వారు

ప్రతిఫలంగా కొంచెం దోసెలపిండి యిచ్చి పంపేవారు. అలాగ సంపాదించుకున్న నాడు మాకు ఏవో అప్పచ్చులు చేసి పెట్టగలిగేది! లేకపోతే మేమంతా ఖాళీ పొట్టతోనే ఉండేవాళ్ళం.

ఇలా గుండగా నేను ఒక బొప్పాస తోటలో కాపలాకి కుదిరాను. అప్పుడు నా జీతం నెలకు కేవలం ఐదు రూపాయలు మాత్రమే. ఆ తోటలో కొన్ని బొబ్బాసి కాయల్ని దొంగతనంగా కోసి యిసుకలో కప్పెట్టి త్వరగా పండబెట్టి రొట్టెలు లేని రోజుల్లో నేను కొన్ని ముక్కలు తిని చెల్లెలికి కొన్ని ముక్కలు పెట్టేవాడిని.

ఒక రోజున బొంబాయిలో పనిచేస్తున్న మా మేనమామ ఒకడు వచ్చి 'ఒరే! నీకు బొంబాయిలో సేట్ల దగ్గర ఉద్యోగమిప్పిస్తాను; నాకూడా వస్తావా?' అని అడిగాడు. మా అమ్మ నన్ను ప్రోత్సహించింది. నేను బొంబాయి చేరుకున్నాను.

కొలాబాలో ఒక సేటు దగ్గర నేను ఉద్యోగంలో చేరాను.

ఇంట్లో అన్ని రకాల పనులూ చేయడమే కాకుండా, సేట్ కాళ్ళు పట్టడం కూడా నేను చేసేవాడ్ని, వయసుకుమించిన వని వల్లా, సరైన తిండి పెట్టకపోవటం వల్లా, త్వరగా అలసిపోయేవాడ్ని. కాపోతే సమోసాలు, చపాతీలు, జిలేబి మొదలైన వంటలు చేయటం నాకు ఆ సేట్‌గారి యింట్లో బాగా అలవాటయింది.

వాళ్ళిచ్చే జీతం - జత బట్టలు కొనుక్కునేందుకు గానీ, నా చిల్లర ఖర్చులకు గానీ సరిపోయేది గాదు. ఇక తల్లికి చెల్లికి ఏమి పంపుతాను?

రెండేళ్ళు ఎలాగో పనిచేసి ఓ రోజుని వాళ్ళింట్లోనే రెండొందలు దొంగతనం చేసి రైలెక్కేశాను. ఆ రైలు నన్ను విజయవాడ జేర్చింది.

చేతిలో ఉన్న డబ్బు నెల్లాళ్ళలో అయిపోయింది. కాళేశ్వరరావు మార్కెట్టులో తిరగటం ప్రారంభించాను. బరువులు మోసి రూపాయి, అర్ధ సంపాదించే వాడ్ని.

కృష్ణానదిలో మునిగి స్నానం చేసేవాడ్ని, ఒంటి మీద బట్టలతోనే నీట్లో మునిగేవాడ్ని. ఒంటినంటుకుని అవి అలాగే ఆరిపోయేవి. ఆ బ్రిడ్జి ప్రక్కనే పడుకునే వాడ్ని.

ఆ రోజుల్లోనే నేను రైలు బోగీల్లో ఎక్కి ఈ కుర్రాడిలాగే అడుక్కునేవాడ్ని'

అంటూ ఉద్వేగ పడిపోయాడు చమన్‌లాల్. ఈ కబుర్లలో మా రైలు కృష్ణాబ్రిడ్జిని దాటేసిందన్న సంగతి కూడా మాకు తెలియలేదు. పచ్చని వరిచేల మధ్య వేగంగా పోతూంది - మా ఎక్‌స్ప్రెస్సు. జేబులోని చేతి రుమాలు తీసుకొని కళ్ళు తుడుచుకుని చమన్‌లాల్ తిరిగి చెప్పడం మొదలెట్టారు.

"మరి కొన్నాళ్ళు ఆటోమోబైల్ షాపులో కుర్రాడిగా పనిచేశాను. మూడేళ్ళు గడిచాయి. అంటే అప్పటికి నాకు పదిహేడు సంవత్సరాలొచ్చాయి. ఒక రోజు ఒక కస్టమరు యిచ్చిన అయిదు వందల్ని పట్టుకుని పారిపోవాలని ప్రయత్నించాను. కాని దొరికి పోయాను. టూ టౌన్ పోలీసు స్టేషన్లో వారం రోజులు లాకప్పులో పెట్టి చితకబాది మరీ వదిలారు. తరువాత నాకు ఎక్కడా స్థిరమైన పని దొరకలేదు. విజయవాడలో ఎక్కడ ఏ దొంగతనం జరిగినా నన్ను ఓసారి పోలీసు స్టేషన్‌కి తీసుకొని వెళ్ళడం తన్నడం రివాజైపోయింది. ఈ బాధలు భరించలేక నేను గుంటూరు పారిపోయాను.

అక్కడ ఇక మర్యాదగా బతకాలని నిర్ణయించుకున్నాను. బొంబాయి సేట్ దగ్గర పనిచేసిన అనుభవంతో చిన్న జంగిడి వ్యాపారం ప్రారంభించి సమోసాలు, చపాతీలు, మిరపకాయ బజ్జీలు అమ్మాను. అది కాలేజీ స్టూడెంట్ల కూడలి అవడంతో నా 'స్టారు' అందుకొని జంగిడి - చిన్న టీ స్టాల్, అదే అంచెలంచెల మీద పెద్ద హోటలయికూచుంది. మా అమ్మనీ, చెల్లాయినీ గుంటూరు వచ్చేయమన్నాను. చెల్లెలికి పెళ్ళి చేసి నేనూ పెళ్ళి చేసుకున్నాను. ఇప్పుడు నేను సేట్ చమన్‌లాల్‌ని! కాలేజి జంక్షన్‌లోని పెద్ద హోటల్ నాదే! ఆర్.టి.సి. కాంప్లెక్సులోనూ, రైలు స్టేషన్ ముందూ ఉన్న టీ స్టాల్సు అన్నీ నావే! నాకు అరవైకి పైగా టాక్సీలున్నాయి.

ఊళ్లో ఏ సందడి జరిగినా నా ప్రమేయముంటుంది! ఏ పొలిటికల్ పార్టీ అయినా నా సహాయం పొందాల్సిందే!

ఇప్పుడు మీలాంటి వందమంది ఆఫీసర్లను కొనేసే స్తోమత నాకుంది. అయినా మీరంటే నాకెంతో గౌరవం. ఎందుకంటే నేను చాలా అల్పస్థాయినుంచి అంతస్తులెక్కి పోయినవాడ్ని" అంటూ చమన్‌లాల్ తన కథను పూర్తిచేశారు.

మేం హైదరాబాద్ చేరాం. మా డైరెక్టరేటులో అందరూ అతనికి సలాములు చేస్తుంటే నాకు చాలా ఆశ్చర్యమయిపోయింది. నా పని చిటికెలో చేయించుకొచ్చి ఆర్డర్‌ను నా చేతిలో పెట్టారు.

'చాలా థాంక్సు చమన్‌లాల్‌గారూ' అంటూ చేతులెత్తి నమస్కరించబోయాను. "చాల్లెండి! ఇదీ ఒక పనేనా? ఇందులో నేను చేసిందేముంది" అని అతనంటే, 'నువ్వింకా ఎదిగి నాలాంటి వారికి సహాయం చెయ్యవయ్యా' అని, నేను మనసులో ఉన్న మాటని పైకి అనాలా, వద్దా అనే సందేహంలో పడిపోయాను. ఇది నాకెన్నటికీ తీరని సందేహంగా మిగిలిపోయింది.

చమన్‌లాల్ చిరునవ్వు నవ్వుకుంటూ నాకు షేక్‌హాండిచ్చి 'గుడ్‌లక్' అంటూ వెండి మెరుపులా వెళ్ళిపోయాడు. దొంగమబ్బులా నేనే మిగిలిపోయాను.

*(గీతాంజలి యువజీవన పక్షపత్రిక: జనవరి 1995 పే.34-36)*



అరుణరాగాలు 1994 ప్రణవమూర్తి

## 19

# దేముడి గదిలో దొంగ

సూర్యదేవర సూరన్న పంతులు గారి పేరు వినని వారు చుట్టు ప్రక్కల గ్రామాలలోగాని, సిటీలోగాని లేరు. పండిత పామరులను సమదృష్టితో చూస్తూ వారికి ఏ కష్టమొచ్చినా నివారణోపాయాలను సూచిస్తూ తలలో నాలుకగా ఉంటారాయన. ఆడపిల్ల పుష్పవతి అయినా, ఏ ప్రయాణాలకు గాని, ఏ శంకుస్థాపనలకు గాని, గృహ ప్రవేశాలకు గాని పెళ్ళిళ్ళకు గాని అందరూ ఆయనచేతనే ముహూర్తం పెట్టించుకుంటారు.

ఎనభై యేళ్ళ సూరన్న పంతులు గారిది దబ్బపండు చాయ. తలమీద వెంట్రుకలన్నీ రాలిపోయి చలిమిడి ముద్దలా ఉంటుంది. కనుబొమ్మలు తెల్లబడిపోయినా కళ్ళు తీక్షణంగా ఉంటాయి. ఈ వయస్సులో కూడా కళ్ళజోడు లేకుండానే పంచాంగం చదువగల రాయన. చెవులకు బరువైన కుండలాలు, చేతులకు గండపెండేరాలు, మెడలో రుద్రాక్షమాలలు, నీరుకావి పంచెతో, ఒంటినిండా విబూది రేకలు, నొదుట కుంకుమ బొట్టుతో ఒక విధమైన తేజస్సుతో మెరిసిపోతూ ఉంటారాయన, కొంచెం స్థూలకాయులైనా ఈనాటి యువకులకంటే చలాకీగా మైళ్ళు తరబడి నడవగల రాయన.

ఆయన దుర్గాదేవి ఉపాసకులు, దసరా ఉత్సవాలు వారి లోగిలిలో అత్యంత వైభవంగా జరుగుతూ ఉంటాయి.

దసరా ఉత్సవాలు వారం రోజులలో ప్రారంభమవుతాయనగా, ఆ రోజు సూరన్న పంతులుగారి పేరిట ఒక తంతి వచ్చింది. దాని సారాంశము -

"నా శిష్యుడైన శ్రద్ధానందస్వామి మీ ఊరి పొలిమేరలకు, సహచరులతో

నడిచి వస్తారు. వారికి స్వాగతం పలికి తగిన సదుపాయాలు కలిపించండి. శిష్యకోటికి వారి దర్శన భాగ్యము కలిగించి అందరు తరించండి" రోజు, సమయము రాశారు. "ఇది సాక్షాత్తు సత్య శంకరాచార్యుల వారి ఆదేశము".

ఇక సూరన్న పంతులుగారి ఆనందానికి అవధులు లేవు. అందరికీ ముఖ్యంగా సిటీలో ఉన్న రిటైర్డు సెక్రటరి రంగనాథం గార్కి - ఆహ్వానాలు అందించారు.

ఆ రోజు రానే వచ్చింది. అందరూ మేళతాళాలతో ఊరి పొలిమేర చేరారు. అనుకున్నట్టుగా శంకరాచార్యుని శిష్యుల వారు మరి పది మందితో ఎంతో వేగంతో నడుచుకుంటూ వచ్చారు. శ్రద్ధానందస్వామి వారిని పరిచయం చేసి వారితో వచ్చిన పొరుగూరి ప్రజలు సెలవు తీసుకున్నారు.

శ్రద్ధానందస్వామివారికి పట్టుమని ముప్పై సంవత్సరాలు ఉండవు. పై నుంచి క్రింది వరకు ఒకే కాషాయ వస్త్రం కట్టుకున్నారు. బోడిగుండు పిలక, వంటినిండా విభూది, రుద్రాక్ష మాలలు, చేతిలో కర్ర! చాలా అర్భకంగా ఉన్నారు.

సూరన్న పంతులు గారు, రంగనాథంగారు మరి రెండు డజన్ల మంది ఆయనకు సాష్టాంగపడి మెడలో దండలు వేసి వారిని సూరన్న పంతులుగారి ఇంటికి తీసుకొని వచ్చారు. స్వామి వారికి ఒక గది ప్రత్యేకించారు. అందులో మండపం, దేవి విగ్రహం, పూజా సామగ్రి అన్నీ సమకూర్చారు. స్వామి వారు తమ దినచర్యలను క్రమబద్ధం చేసేశారు. ఉదయం లేవటం, ఉన్న భక్తులతో భజనలతో ఊరిలో ప్రతి వీధి పాదయాత్రలు చేయటం, తిరిగి రాగానే పూజాగృహంలోనికి వెళ్లటం. ఆయన ఎక్కువ సేపు 'భగవధ్యానం'లోనే ఉండేవారు. అరమోడ్పు కన్నులతో నిద్రపోతున్నారా అని అనిపించేది. పదకొండు గంటలకల్లా, నిష్ఠతో కన్యలు చేసిన చక్కెర పొంగలి, దధ్యోదనం, ఒకటి రెండు పళ్లూ స్వల్పంగా తీసుకొనేవారు. మళ్ళీ ధ్యానంలోకి వెళ్ళిపోయేవారు. సాయంకాలం అయిదు గంటలకి అక్కడ చేరిన భక్తులనుద్దేశించి ఉపన్యాసాలిచ్చేవారు. తత్వ రహస్యాల్ని వివరిస్తూ ఉంటే రాత్రి పన్నెండు గంటలయేది. తరువాత ఆయన పూజ గదిలోనే పడుకుండి పోయేవారు.

ఆరోజు రంగనాథం గారు సూరన్న పంతులు గారి ఇంటికి చేరేసరికి సాయంకాలం అయిదు గంటలయింది. స్వామి వారు అందరితో సభలోనే ఉన్నారు.

"స్వామీ మీకు ఈ ధర్మచింతన ఇంత చిన్న వయసులోనే ఎందుకు

కలిగింది? మీరసలు ఏమి చదువుకున్నారు?" భక్తి పూర్వకంగా అడిగారు రంగనాథంగారు.

"నేను డాక్టరుని, ఎఫ్.ఆర్.సి.ఎస్. ఓరోలెరింగాలొజీ, లండన్‌లో చేశాను' ' సావధానంగా చెప్పారు. స్వామీజీ.

"అయ్యబాబో ఎంత పెద్ద డాక్టరు చదువో? లండన్లో నోరు తిరగని డిగ్రీలు చదివారు. అక్కడ అందరూ ఆశ్చర్యపోయారు.

"ఇంతటి మహామహునికి ఆతిథ్య మిచ్చే అవకాశం నాకే కలిగింది" అనుకుంటూ, చిరునవ్వు చిందించారు, సూరన్న పంతులు గారు.

స్వామి వారు ఇంకా చెప్పారు. "నా పూర్వజన్మ సుకృతం వలన ఒక పీఠాధిశులను కలుసుకొనే భాగ్యం కలిగింది. ఆయనే నాకు హితోపదేశం చేశారు. డాక్టరయి డబ్బు సంపాదించాలనే యావ పెట్టుకోవద్దని, నాలో అంతర్గతమైన జ్ఞాన తత్వాన్ని అజ్ఞానంతో కొట్టు మిట్టాడుతున్న భక్తజనానికి వెల్లడి చేయమనీ ఆజ్ఞాపించారు.

"అప్పటి నుండి నేను సన్యాసాన్ని స్వీకరించి ఈ ధర్మ చింతనలో పడ్డాను."

స్వామి వారు "శంకరాచార్యుల వారికి జై" అన్నారు.

భక్త జనమంతా అందుకొని "జై" అన్నారు.

ఇంతలో ఆ ఊరి మోతుబరి ఒకరు తన బాన కడుపును చూసుకొంటూ "స్వామీ! గత నాల్గేళ్ళుగా నాకు అజీర్తి రోగమున్నది. ఎందరో డాక్టర్ల దగ్గర కెళ్ళాను. గుణం కనిపించలేదు. మీరు నాకుపాయం చెప్పాలి." ప్రాధేయపడ్డాడు.

స్వామి వారు అతనిని దగ్గరకు రమ్మని సైగ చేశారు. రాగానే కూర్చో మన్నారు. పళ్ళెంలో నుండి ఒక ఆపిల్ పండు తీసి, మంత్రించి, నమస్కరించి అతని చేతిలో ఉంచారు. "దీనిని నీవే తిను" అన్నారు.

స్వామివారు అజీర్తి రోగి కనబడ్డాడు కాబట్టి దానికి సబంధించిన ఉపన్యాస మివ్వటం ప్రారంభించారు.

"ఆరోగ్యమే మహాభాగ్యము. ఆరోగ్యం కొనుక్కుంటే వచ్చేది కాదు. లక్షాధికారి... కోటీశ్వరుడు... డబ్బెక్కువయే కొద్దీ ఆరోగ్యం కొరవడుతుంది. ఎ.సి. గదుల్లో హంస తూలికా తల్పాల మీద పడుకొనే వారికి సరిగ్గా నిద్రపట్టదు."

"కంకర లారీ లోడ్ చేసిన వాడు ఆ బండి కంకర మీదే తువాలు వేసి పడుకుంటాడు. పైన మండే ఎండ, అయినా లారీ కుదుపుకి, వాడికి చక్కగా నిద్ర పట్టేస్తుంది. రెండు మూడు గంటల తరువాత డ్రైవరు బండి నాపినప్పుడు "ఒరే? వచ్చేశాంరా లే." అనే వరకూ గాని వాడికి మెలకువ రాదు."

"ఆహా! నిజమే" అందరు తల లూపారు. స్వామివారు ఇంకా చెప్పారు. "అందుకే సరైన వ్యాయామము, యోగాసనాలు కావాలి. వేగంగా నడుస్తే చాలు, పరుగెట్టడం మంచిది కాదు. అది శ్వాసను ఖర్చు చేస్తుంది. కాని శ్వాస బ్రతికున్నంత కాలం ఆడుతూనే ఉండాలి కదా? పరుగెడితే శ్వాస ఎక్కువ ఖర్చయి దుర్వినియోగం అవుతుంది. ఆయుష్షు తగ్గుతుంది. అందుకే పరుగెట్టి శ్వాసను వృధా చేయకండి."

"అవును, ఇదీ నిజమే" అందరూ తలలూపారు.

స్వామి వారు ఇంకా చెప్పారు. "మేకలు మొదలైనవి శాకాహారులు. సింహం మొదలైనవి మాంసాహారులు. వాటి ఆహార నియమాలు నికరం. సింహం గడ్డి తినదు కదా? మేక మాంసం తినదు కదా? కాని మనుషుల్లో అనేక ఆహార వ్యవహారాలు. అమెరికా, చైనా, ఇండియాలోని వారందరికి ఒకోరకమైన ఆహారం. ఇండియాలోనే ఉత్తరదేశంలో చపాతీలు, దక్షిణంలో సాంబారు అన్నం. ఒక మనిషి మరొక ప్రదేశానికి వెళ్ళాడంటే వాడి కడుపు పాడైపోయిందన్న మాటే గదా?"

ఈ విషయం కూడా భక్తులందరు ఒప్పుకున్నారు.. తలలూపారు.

స్వామి వారు మరొక విషయాన్ని చెప్పారు.

"అమృతాహారం, ఇతరులకు సేవ చేయాలన్న భావం, యోగం, వీటి వల్ల మనిషి ఎక్కువ కాలం బ్రతుకుతాడు."

"కాయగూరల్ని, ధాన్యాన్ని వండి తింటున్నాం! పెనం మీద వేసిన ధాన్యం నేలలో నాటితే మొలకెత్తునా? ధాన్యాన్ని వండి, జంతువుని చంపి ఆ చచ్చిన మాంసాన్ని - మృతాన్నాన్ని తింటున్నాం. దీనితో ఆయుస్సెలా పెరుగుతుందీ!

"అమృతాన్నాన్ని తిన్నవారే చిరాయువులు మన ఋషులు.

"పచ్చి గింజలు, ఫలాలు వీటిలో జీవమున్నది. వీటిని నాటితే మొలకలొస్తవి. అటువంటి వాటిని తింటే ఆయుస్సు పెరుగుతుంది."

అందరూ చప్పట్లు కొట్టారు. ఇలా ఎన్నో రహస్యాలను చెప్పారు స్వామి వారు.

ఇక రంగనాథం గారు ఒక నిర్ణయానికి వచ్చేశారు. ఇటువంటి మహానుభావుణ్ణి కొన్ని రోజులైనా సిటీలో ఉన్న తన స్వగృహంలో ఉంచితే గాని తన జన్మకి సాఫల్యం లేదని. సూరన్న పంతులి గారి కాళ్లా వేళ్లాబడి స్వామి వారిని తన భవంతికి తీసుకొచ్చారు.

ఐ.ఎ.ఎస్. ఆఫీసర్‌గా రంగనాథం గారు అతిలాఘవంగా లక్షలు సంపాదించేవాడు. వారి విశాలమైన భవనంలో స్వామి వారికి పూజా మందిరాన్ని కేటాయించారు. మరికొన్ని సదుపాయాలను సమకూర్చారు. స్వామి వారు కూడా పూజలు చేయడం ప్రారంభించారు.

ఆ రోజు రంగనాథం గారి భార్య పుట్టిన రోజు కావటం వారు అదృష్టంగా భావించారు. ఆమెను స్వామి వారు మనసారా అనేక విధాల ఆశీర్వదించి, దీవించారు.

స్వామి వారు దంపతుల నుద్దేశించి "మీ నగలతో అమ్మవారిని అలంకరించండి. పూజలో పెడితే అనేక సంపదలు కలుగుతాయి మీకు" అన్నారు.

మహాభాగ్యంగా దంపతులు లక్షలు వెల చేసే వెండి బంగారు నగలన్నిటినీ స్వామి ముందుంచారు. ఆయన వాటితో అమ్మవారి నలంకరించి రాత్రి పన్నెండు గంటల వరకూ పూజలు చేశారు.

"ఈ రోజు శుక్రవారం కదా తల్లీ, అమ్మవారి మెడలో ఆభరణాలు ఈ రోజు తీయుటం భావ్యంకాదు; రేపు ఉదయం తీయండి."

"అలాగేస్వామి" దంపతులు సాష్టాంగ నమస్కారాలు చేసి వారి గదుల్లోకిపోయి పడుకున్నారు.

స్వామి వారు ఆరోజు కూడా పూజా మందిరంలోనే పడుకున్నారు.

తెల్లవారగానే రంగనాథం దంపతులు దేముడి గదిలోకి దణ్ణం పెట్టుకోవటానికి వచ్చారు.

స్వామి వారు గాని, నగలు గాని కనబడలేదు.

గది బోసిపోయింది.

*(ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక, మార్చి 29-4 ఏప్రిల్ 1995 పే 44-45)*

# రెక్క విప్పిన రివ్యూ (ప్రివ్యూ)

*(డా॥ రెంటాల శ్రీ వెంకటేశ్వరరావు, డా॥ మిరియాల రామకృష్ణ గారికి రాసిన ఒక ఉత్తరంలోని కొన్ని భాగాలు...)*

డియర్ సర్,

.... పుస్తకం తెరవగానే నన్ను ఆకట్టుకున్నవి శీర్షికలు. కొత్తగా, ఆకర్షవంతంగా పేర్లుపెట్టి పుస్తకం చదవాలన్న బుద్ధి పుట్టేటట్టు చెయ్యగలిగారు డా॥ మూర్తిగారు. 'గౌతమీ ఎక్స్‌ప్రెస్‌లో ముఖమల్ చెప్పులు', 'అల్లం మురబ్బా వెల ఒక వంకరనవ్వు', 'నెం.152 వెయిటింగ్ లిస్టు ఇన్ కోణార్క్'... మామూలు కథా శీర్షికల కన్న ఎంతో భిన్నంగా అందంగా ఉన్నాయి!

రెండో మంచి లక్షణం, రీడబిలిటీ. చదివించే గుణం ఏ రచనకయినా అతిముఖ్యం. ఈ 'కథా సంపుటి' మొదలుపెట్టడం వరకే పాఠకుడి వంతు; తర్వాత ఇదే ఆతన్ని ముందుకు తీసుకుపోతుంది.

డాక్టర్ గారి వాక్యంలో స్పష్టత, సారళ్యం, కుదురు ఉన్నాయి. వర్ణన శక్తి బావుంది. పాత్రయినా ప్రదేశమయినా అవస్థ అయినా పాఠకులకి చక్కగా అందిస్తున్నారు. ఆకుజోళ్ళకోసం అల్లాడుతున్న అర్భకుడు, వంకర నవ్వుతో

అల్లం మురబ్బా సంపాదించుకున్న కుర్రకుంక, 'రెండిళ్ళ'కోసం ముచ్చటపడి లెంపలేసుకున్న పెద్దమనిషి, షో మాష్టర్ డాక్టరు భీమారావు గారు పుస్తకం మూశాక కూడా గుర్తుంటారు.

కోణార్కలో రిజర్వేషన్ దొరక్క పాత్రతోపాటు మనమూ అవస్థ పడతాం. ఒక రాత్రివేళ పరువూ, మొహమాటమూ, సభ్యతా అన్నీ ఏ గంగలో కలుస్తాయో ఏమో సీటుకీ సీటుకీ మధ్య నేలమీద దుప్పటి పరిచి నిద్దట్లో కూలతాం.

ఆవుట్ పేషెంట్ వార్డులో డాక్టరుగా డ్యూటీ చేస్తూ ఎన్నో ఈతి బాధలు అనుభవిస్తాం.

"అల్లం మురబ్బా...." కథనంలో ఆత్మీయతని అనుభవిస్తూ రాజు చేస్తున్న అల్లరి పనులన్నీ తిలకిస్తాం. వాడి వక్రహాసం మెరుపులు గమనిస్తూ అల్లంమురబ్బా వాడితో పాటు మనమూ ముగ్ధులమై పోతాం. తల్లిలాగే వాడి పక్కలో పడుకుని వాడి ముగ్ధవదనాన్ని తృప్తిగా చూస్తాం.

ఇలా మనని సిట్యుయేషన్‌లో ఇరికించి ఆనందానికో ఇబ్బందికో మరేదానికో గురిచెయ్యగలగడం మంచిశక్తి.

రకరకాల సంఘటనల్ని వస్తువులుగా తీసుకున్నారు రచయిత. అది విశేషమే. బొంబాయి నుంచి విశాఖ వరకూ ఉన్న ఊళ్ళు ప్రస్తావనలో కొస్తాయనీ అంచేత కోణార్క్ ఎక్స్‌ప్రెస్ అనే పేరు సూచించాననీ చెప్పారు కదా! మంచి ఎంపిక.

ఎన్నుకున్న ఇతివృత్తాన్ని Present చేసిన తీరు చాలా సహజంగా ఉంది. వట్టి incidents ని కూడా చక్కగా చదివించారు.

తర్వాత ప్రత్యేకంగా చెప్పాల్సింది Sense of humour. హాస్యం ఉన్నవి కొన్నయితే. కొసమెరుపుతో హాస్య స్పర్శ తీసుకొచ్చిన రచనలు కొన్ని.

కథల కుండాల్సిన ముఖ్యమైన లక్షణాలు ఎక్కువ రచనల్లో లేవు. అలా అని గల్పికో, స్కెచ్చో అందామా అంటే వాటికి ఆ లక్షణాలూ పట్టవు. వివరం చెబుతా.

ఈ పుస్తకం చదువుతుంటే అమరావతి కథలు, పెన్నేటి కతలు గుర్తొచ్చాయి. కొన్ని పోలికలున్నాయి. వాటిల్లో కూడా రచనలు చిన్నగా ఉంటాయి. శీర్షికలు చిత్రంగా ఉంటాయి. కథనంలో ఆత్మీయత ఉంటుంది. ఒక చిన్న సంఘటన మాత్రమే కథకు ఆధారం అవుతుంది. జీవితానికి

దగ్గరగా ఉంటాయి. అమరావతి కథలు పుస్తకం ఉంది. అందులోంచి విడదీసి చూస్తే ఎక్కువభాగం కథలుగా అనిపించవు. విడిగా నిలబడ్డానికి వాటిలో బలం చాలదు. అయితే ఒక Series లో అందంగా ఇమిడాయి. పెన్నేటి కథలకు రాయలసీమ జీవితమూ, అమరావతి కథలకి అమరావతి వాతావరణమూ ఒక సూత్రాన్ని ఏర్పాటుచేసి వాటిని గుదిగుచ్చడమే కాక బలాన్నిచ్చాయి.

మన పుస్తకంలో కూడా రచనలు చాలామట్టుకి అటువంటి 'కథలే' అయినా ఒక నేపథ్యం లోపించి - వేటికవి విడి కథలు కదా - బలం తగ్గింది.

ఏ సంఘటన అయినా దానికదిగా ఒక కథ కాదు. ఎంత ఆసక్తి కరమైనదయినా సరే. దాంట్లోంచి ఒక జీవిత సత్యాన్ని ప్రదర్శించాలి రచయిత. ఒక తాత్త్విక భూమిక దానికి జతపడాలి.

కథకి పాఠకుడు ములిగేంత కైవారం ఉండాలి. ఓ సమస్య, దాని పాదు, వృద్ధి, ఘర్షణ ఉండి, ఇవన్నీ ఆసక్తికరంగా పెరిగి చివరికి పాఠకుడి ఆసక్తి తీరాలి.

'అర్భకుడి ఆకుజోళ్ళు' ఉంది. 'ప్రస్తుతం'లో మొదలయ్యింది. కృష్ణ ఆకుజోళ్ళు ఎందుకు కొన్నాడు, ఎలా పోయాయి Flash back లో చెప్పారు రచయిత. కథ మళ్ళీ ప్రస్తుతానికొచ్చింది. ఏమీ జరగకుండానే మొదటిలాగే ఆకుజోళ్ళ కోసం ఆ అర్భకుడు అల్లాడుతుండగానే ముగిసిపోయింది. పాఠకుడి ఆసక్తి తీరలేదు.

'రిస్టు వాచీ ముసలితనం' చూద్దాం. చూసేముందు ఒకమాట.

The germinal idea must be perfectly clear and the interest arising out of it must never be complicated by any other consideration అంటాడు Hudson కథ గురించి రాస్తూ. 'రిస్టు వాచీ.....' కథలో ఈ లోపం కొంత ఉంది. - నరసింహారావు చీట్ చెయ్యడం కథకి అతకలేదు. అలాగే ప్రకాశరావు అత్తవారింటికి వెళ్ళడానికి (ప్రయాణానికి) సంబంధించిన వివరాలు కథకి అవసరం లేదు. రిస్టువాచీ ముసలితనానికీ ప్రకాశరావు వృద్ధాప్యానికీ ఒక Link అవసరం. అదేమిటో తెలియటం లేదు.

'చిన్నకారు మీద బస్తీ బురద' ఏ ప్రత్యేకతా లేని రొటీన్ జీవితదృశ్యం. అది రచన ముగిశాక కూడా అలాగే ఉండిపోయింది. దాన్లోకి ఒక విశేషం

జొరబడాలని గానీ, దాన్నుంచి ఒక విశేషం బయటకు రావాలని గానీ పాఠకుడు ఆశిస్తాడు.

దీంట్లో వైద్యవృత్తికి సంబంధించిన రచనలున్నాయి. పిల్లకాకి ఎదురుదెబ్బ, గుండెగదిలో మెంటల్‌కేస్.... ఇలాంటివి. ఇవి anecdotes. ఏ వైద్యవృత్తికి సంబంధించిన కథల Series లోనో అయితే మనం ఇంకా ఎక్కువగా ఆనందిస్తాం. (ప్రణవమూర్తిగారికి ఉన్న రచనాసక్తికీ, రచనా శక్తికీ ఆయన వృత్తి జీవితం నేపథ్యంగా కథలూ గాథలూగా ఒక పెద్ద రచన చేస్తే చాలా బావుంటుంది)

ఈ సంపుటిలో కథలు లేవని కాదు. ఓ హెన్రీ పద్ధతిలో రాసిన 'కాకినాడలో గురజనాపల్లి' చదివాక లేవని ఎలా అంటాం? మంచి సంఘర్షణా సందేశమూ జతపడ్డ 'గొంగళి పురుగుల జ్యోతిషం' నిస్సందేహంగా కథ. Character - oriented Story గా వచ్చిన "అల్లం మురబ్బా...." విశేషం ఉన్న కథ. మూర్తిగారిని మంచి కథకులనడానికి అదిచాలు.

చెప్పవచ్చే దేమిటంటే మంచి వాక్య రచనా, కథన శక్తీ, హాస్యప్రియతా, సూక్ష్మ పరిశీలనా, శీర్షికా రచనా వైలక్షణ్యమూ ఉండి, ఇతివృత్త వైవిధ్యం చూపే ప్రణవమూర్తిగారు, సంఘటనని కథగా మలిచే Process విషయంలోనూ, కథకి ఒక తాత్త్విక భూమిక నేర్పాటు చేసే విషయంలోనూ, presentation విషయంలో లాగే plotting విషయంలోనూ, editing లోనూ మరికొంత జాగ్రత్త తీసుకుంటే నిస్సందేహంగా మరిన్ని మంచి కథలు రాస్తారు.

ఈ ఉత్తరం డాక్టర్ గారికి అంతో ఇంతో ఉపయోగపడితే సంతోషం.

(సరాసరి కథల్లోకి జొరబడకుండా ఇటొచ్చి ఈ ఉత్తరమ్ముక్కలో చిక్కుపడ్డ పాఠకులు ఎవరయినా ఉంటే దీన్ని తక్షణం విడిచిపెట్టి అంతా మరిచిపోయి సొంత కళ్ళతో పుస్తకంలోకెళ్ళడం మంచిది.)

ఆవిష్కరణకి పూర్వమే నన్నీ పుస్తకానికి పాఠకుణ్ణి చేసిన మీ ఆదరానికి నమస్కరిస్తూ.....

ఉంటానండి.

మీ

పాలకొల్లు,
30-6-95.

ఆరెస్ వెంకటేశ్వరరావు